# మన ద్వితీయ పంచవర్ష ప్రణాళిక

పబ్లికేషన్స్ డివిజన్

# మన

# ద్వితీయ

# పంచవర్ష ప్రణాళిక






భారత ప్రభుత్వ
సమాచార, ప్రసార మంత్రిత్వశాఖ
ప్రచురణ విభాగము.

# విషయసూచిక

I

# ఉపోద్ఘాతము

"నవభారత నిర్మాణమనే సుదీర్ఘ ప్రయాణంలో తొలిఘట్టము విజయవంతముగా ముగిసినది. వెనువెంటనే ద్వితీయఘట్టము ప్రారంభమైనది" అన్నారు శ్రీ జవహరులాల్ నెహ్రూ, యిటీవలనే న్యూఢిల్లీలో జరిగిన జాతీయాభివృద్ధిసమితి సమావేశమునందు అధ్యక్షోపన్యాసమిస్తూ. ఆయన యింకా యిలా అన్నారు — "ఒక జాతియొక్క జీవితము యెడతెగక పారే ప్రవాహము వంటిది. ఈ ప్రవాహమును క్రమబద్ధము చేయడానికి మనము అమలు జరిపే అభివృద్ధి ప్రణాళికలు నిర్విరామముగా కొనసాగవలసి యుంటుంది."

ప్రథమ పంచవర్ష ప్రణాళిక 1956 సం॥ మార్చి 31 వ తేదీన ముగిసినది. కానీ, దీనికి బాగా ముందుగానే ద్వితీయ పంచవర్ష ప్రణాళికను సంబంధించిన ప్రాథమిక పనులు ప్రారంభించబడ్డాయి.

1954 సం॥ ఏప్రిల్‌లోనే ప్రణాళికాసమితి, వ్యవసాయాభివృద్ధి, గ్రామీణ పరిశ్రమలు, సహకారాభివృద్ధి మొదలగు విషయాలకు ప్రాముఖ్యమిస్తూ గ్రామ, తాలూకా, జిల్లా స్థాయి ప్రణాళికలను రూపొందించవలసిందని వివిధ రాష్ట్ర ప్రభుత్వాలకు విజ్ఞప్తిచేసింది. దేశాభివృద్ధి పనులందు ప్రజలుకూడ పాల్గొని, యథాశక్తి సహాయపడవలయునంటే గ్రామ, తాలూకా, జిల్లా ప్రణాళికలు యెంతైనా అవసరం. ప్రణాళికను సంబంధించిన సాంకేతిక, గణాంక సమస్యల పరిశీలనలో, ప్రణాళికాసమితి, కేంద్రమంత్రిత్వశాఖలు, భారతీయ గణాంక సంస్థల సహకారమును పొందింది. తరువాత 1955 సం॥ మార్చిలో ఈ పరిశీలనల ఫలితములన్నీ ప్రొఫెసర్ పి. సి. మహాలనోబిస్‌చే సమర్పించబడిన "ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ముసాయిదా స్వరూపము" అను పత్రమునందూ; ప్రణాళికా సమితి, ఆర్థికమంత్రిత్వశాఖలకు సంబంధించిన ఆర్థికశాఖలచే తయారుచేయ బడిన "ద్వితీయ పంచవర్ష ప్రణాళికయొక్క రూపురేఖలు" అనే మరొక పత్రమునందూ వివరింపబడినాయి. తరువాత 1955 ఏప్రిల్‌లో అర్థశాస్త్రవేత్తల సంఘమొకటి, ఈ పత్రములను పరిశీలించి తన అభిప్రాయములను తెలియజేసింది. అనంతరం 1955 సం॥ మే నెలలో జాతీయాభివృద్ధిసమితి పైన తెలియజేయబడిన పత్రములను పరిశీలించి, ప్రణాళిక స్వరూపమునకు సంబంధించిన ప్రాతిపదిక విషయములను ఆమోదించింది.

అనంతరం ప్రణాళికాసమితి, ప్రణాళిక స్వరూప, స్వభావాలను గురించి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ప్రతినిధులతో చర్చలు జరిపింది. ఈ చర్చలను, వివిధ

వ్యాఖ్యానములను దృష్టిలోకి తీసికొన్నమీదటనే 1956 ఫిబ్రవరిలో ప్రణాళిక ముసాయిదా స్వరూపము ప్రజాభిప్రాయము నిమిత్తం ప్రచురించబడింది. దీని మీద స్వీకరించబడిన వివిధ వ్యాఖ్యానములు, సూచనల దృష్ట్యానే 1956 మేలో ప్రణాళిక తుదిస్వరూపం ప్రచురించబడింది.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికను సంబంధించిన రెండు ముఖ్యవిషయాలను గురించి యిచ్చట ప్రస్తావించవలసి యున్నది. మొదటిది, ఈ ప్రణాళిక మార్పులకూ, చేర్పులకూ అతీతమైనది కాదు. దీర్ఘకాల ప్రయోజనాల దృష్ట్యానూ, ప్రణాళిక అమలు జరిగేకొలదీ వివిధ రంగములందు సంభవించే మార్పుల దృష్ట్యానూ వార్షిక ప్రణాళికలద్వారా యెప్పటికప్పుడు తగిన సర్దుబాట్లను చేయుటకు వీలుగా ప్రణాళిక రూపొందించబడింది. ఇక రెండవది, ప్రణాళిక అమలుజరిగి, ఆర్థికవ్యవస్థ అభివృద్ధి చెందేకొలదీ వస్తువులధరలు పెరిగిపోకుండా అదుపులోనుంచడానికి వ్యవసాయోత్పత్తులను ప్రణాళికలో ఆశించినదానికన్న మరింత అధికంచేయవలసిన అవశ్యకత యున్నది.

మొత్తముమీద ద్వితీయ పంచవర్ష ప్రణాళిక, గ్రామీణ భారతావనిని పునర్నిర్మించి, పారిశ్రామికాభివృద్ధికి తగిన పునాది వేసి, దేశంలోని వెనుకబడిన ప్రాంతాల ప్రజలకు తగిన అవకాశములను కల్పించి, తద్వారా యావద్దేశపు సర్వతోముఖాభివృద్ధికి కృషిచేయగలదు.

1 వ అధ్యాయము

# సాధించబడిన అభివృద్ధి, భావిలక్ష్యములు

## తొలి పంచవర్ష ప్రణాళిక

దేశపు సర్వతోముఖాభివృద్ధికి మన తొలి ప్రయత్నమైన తొలిపంచవర్ష ప్రణాళిక, రెండవ ప్రపంచ యుద్ధము, దేశవిభజనలవల్ల యేర్పడిన జటిల సమస్యల ననేకం పరిష్కరించుటతోబాటు, ఆర్థిక వ్యవస్థను పటిష్ఠముచేసి, ముందు ముందు తీవ్రతరమైన అభివృద్ధిని సాధించుటకు తగిన పరిస్థితులను కల్పించగలిగింది.

## సాధించబడిన అభివృద్ధి

గత అయిదు సంవత్సరాలలో సాధించబడిన అభివృద్ధిని సమీక్షించితే, మన అంతిమ లక్ష్యాల దృష్ట్యా యిది స్వల్పమైనప్పటికీ, అనేక రంగాలలో గణనీయమైన అభివృద్ధి సాధించబడిందని చెప్పక తప్పదు.

తొలి పంచవర్ష ప్రణాళిక కాలములో జాతీయాదాయమునందు 18 శాతము పెరుగుదల సాధించబడింది. 1952-53 ధరలప్రకారం జాతీయాదాయము 1950-51 సం॥లో రూ. 9,110 కోట్లనుండి 1955-56 సం॥ నాటికి రూ. 10,800 కోట్లవరకూ పెరిగింది. ఇదే కాలంలో తలసరి ఆదాయము 11 శాతము, వస్తువినిమయవ్యయము 9 శాతము పెరిగినవి. ముఖ్యముగా వ్యవసాయోత్పత్తులందు సాధించబడిన పెరుగుదల ప్రత్యేకించి చెప్పదగినది. ఆహార ధాన్యాల వుత్పత్తి 20 శాతము, ప్రత్తివుత్పత్తి 45 శాతము, నూనెగింజల వుత్పత్తి 8 శాతము పెరిగినవని అంచనా.

ఇక నీటిపారుదల సౌకర్యాల విషయం. తొలిప్రణాళిక ముగియునప్పటికి పెద్ద నీటిపారుదల ప్రాజెక్టుల ద్వారానేమి, చిన్న ప్రాజెక్టుల ద్వారానేమి మొత్తం 160 లక్షల యెకరాల భూమికి నీటిపారుదల సౌకర్యం కల్పించబడింది. విద్యుచ్ఛక్తి వుత్పత్తి 1950-51 సం॥లో 677.5 కోట్ల కిలోవాట్ గంటలనుండి 1955-56 సం॥ నాటికి 1,100 కోట్ల కిలోవాట్ గంటలవరకూ పెంపొందింది.

తొలిప్రణాళిక కాలములో పారిశ్రామికోత్పత్తులందుకూడా విశేషమైన అభివృద్ధి సాధించబడింది. పారిశ్రామికోత్పత్తుల సూచీసంఖ్య 1950 సం॥లో 105 నుండి 1955 సం॥ నాటికి 161 వరకు హెచ్చినది.

తొలిప్రణాళిక కాలములో ప్రభుత్వ, ప్రైవేటు రంగములందు నూతన పరిశ్రమలనేకం ప్రారంభించబడ్డాయి. ప్రభుత్వరంగమునందు ప్రారంభించబడిన పరిశ్రమలందు ప్రత్యేకించి చెప్పదగినవి—సింద్రీ యెరువుల ఫ్యాక్టరీ, చిత్తరంజన్ రైలుయింజన్ల కర్మాగారము, హిందూస్తాన్ కేబుల్సు కర్మాగారము, విశాఖపట్టణంవద్దనున్న హిందూస్థాన్ షిప్‌యార్డు, మద్రాసువద్దనున్న ఇంటెగ్రల్ కోచ్ ఫ్యాక్టరీ, మైసూరువద్దనున్న హిందూస్తాన్ యంత్రపరికరముల కర్మాగారము, కలకత్తావద్దనున్న నేషనల్ యిన్‌స్ట్రుమెంట్సు ఫ్యాక్టరీ, బెంగుళూరు వద్దనున్న టెలిఫోనుల కర్మాగారము మొదలగునవి. ప్రైవేటు రంగమునందు కూడా భారీవస్తుపరిశ్రమలు, నిత్యావసరం వస్తుపరిశ్రమల అభివృద్ధికి విశేషంగా పెట్టుబడి పెట్టబడింది.

తొలిప్రణాళిక కాలములో ప్రభుత్వ, ప్రైవేటు రంగముల పెట్టుబడి మొత్తము రూ. 3,100 కోట్లవరకూ వుంటుందని అంచనా. పెట్టుబడి రేటు 1950-51 సం॥లో 5 శాతమునుండి 1955-56 సం॥ నాటికి 7.3 శాతము వరకూ పెంపొందించబడింది. ప్రణాళికక్రింద పెట్టుబడి క్రమక్రమంగా పెంపొందించబడినప్పటికీ నిత్యావసరం వస్తువుల ధరలు పెరుగకపోవడం ముదావహమైన విషయం. నిజానికి ప్రణాళిక తొలిసంవత్సరంలోనున్న ధరలకన్న ప్రణాళిక చివరి సంవత్సరమునందలి ధరలు 13 శాతము తక్కువగా నున్నవి.

## లోపములు

పైన వివరించబడినవన్నీ హర్షించదగినవైనప్పటికీ యింకనూ అపారముగా కృషిజరుగవలసియున్నది. మనదేశపు ప్రజల జీవనప్రమాణములు యితర అభ్యుదయ దేశాలతో పోల్చితే బహుతక్కువ స్థాయిలందు వున్నట్లు విశదమౌతుంది. ప్రజలలో అత్యధిక సంఖ్యాకులు తినేఆహారం యేమాత్రమూ పుష్టికరమైనది కాదు. తలసరి వస్త్రవినియయం 16 గజములు మాత్రమే. గృహవసతి, విద్య, వైద్య సౌకర్యాలు బహు తక్కువగా వున్నాయి. ఇవి యిలా వుండగా, జనాభా యేడాదికి 1.25 శాతము చొప్పున పెరుగుతున్నందువల్ల నిరుద్యోగుల సంఖ్యకూడా మిక్కుటముగా పెరుగుతున్నది. జనాభా పెరుగుదల వల్ల ఆర్థికాభివృద్ధి కుంటువడే ప్రమాదమున్నది.

## ఆర్థికాభివృద్ధి, కీలకవిషయాలు

పైన తెలియజేయబడిన లోపాలను తొలగించడానికి శీఘ్రమైన, సమగ్రమైన ఆర్థికాభివృద్ధిని సాధించవలసియున్నది. ఒకదేశపు ఆర్థికాభివృద్ధి అనేక విషయాలపై ఆధారపడియుంటుంది. ప్రజల వుత్సాహశక్తి, ఆధునిక పద్ధతుల కనుగుణముగా వారి దృక్పథమునందు రావలసిన మార్పులు వీనిలో ముఖ్య

మైనవి. కాగా, ఆర్థికాభివృద్ధి దిగువ విషయాలపైకూడా ఆధారపడియుంటుంది.

(1) జనాభా పెరుగుదల తీరు ;

(2) జాతీయాదాయములో పెట్టుబడికి ప్రత్యేకించబడే భాగము ;

(3) పెట్టుబడి–ఉత్పత్తి నిష్పత్తి.

తొలి పంచవర్ష ప్రణాళికను రూపొందించినప్పుడు, జనాభా పెరుగుదల, పెట్టుబడిరేటు పెరుగుదల, పెట్టుబడి–ఉత్పత్తి నిష్పత్తుల పెరుగుదలలను వుజ్జాయింపుగా అంచనా వేయడం జరిగింది. జనాభా పెరుగుదల యేడాదికి 1.25 శాతముగా వుండి, పెట్టుబడిరేటు 1950–51 సంIIలో 5 శాతమునుండి 1968–69 సంII నాటికి దాదాపు 20 శాతము వరకు పెంపొందించబడి, పెట్టుబడి–ఉత్పత్తి నిష్పత్తి 3 : 1 గా వుంటే, జాతీయాదాయము 1971–72 సంII నాటికి రెట్టింపు కాగలదనీ, తలసరి ఆదాయమైతే 1977–78 సంII నాటికి రెట్టింపు కాగలదనీ అంచనా వేయబడింది. తొలి పంచవర్ష ప్రణాళిక అనుభవందృష్ట్యా ఈ అంచనాలన్నీ సవరించబడినాయి. సవరించబడిన అంచనాల ప్రకారం, తొలి పంచవర్ష ప్రణాళికనుండి అయిదవ పంచవర్ష ప్రణాళికవరకూ పెట్టుబడిరేట్లు, జాతీయాదాయము, తలసరి ఆదాయములందు ఆశించబడుచున్న పెరుగుదల, పెట్టుబడి–ఉత్పత్తి నిష్పత్తి వివరములు దిగువపట్టికయందివ్వబడ్డాయి.

జాతీయ ఆదాయము, పెట్టుబడుల పెరుగుదల, 1951–76

(1952–53 ధరల ఆధారముగా)

| | మొదటి ప్రణాళిక (1951–'56) | రెండవ ప్రణాళిక (1956–'61) | మూడవ ప్రణాళిక (1961–'66) | నాల్గవ ప్రణాళిక (1966–'71) | ఐదవ ప్రణాళిక (1971–'76) |
|---|---|---|---|---|---|
| (1) ప్రణాళిక అంతమున జాతీయాదాయము (కోట్ల రూ. లలో) | 10,800 | 13,480 | 17,260 | 21,680 | 27,270 |
| (2) నికరపు పెట్టుబడి మొత్తం (కోట్ల రూ. లలో) | 3,100 | 6,200 | 9,900 | 14,800 | 20,700 |
| (3) ప్రణాళిక అంతమున జాతీయాదాయమునందు పెట్టుబడి శాతము | 7.3 | 10.7 | 13.7 | 16.0 | 17.0 |

| | మొదటి ప్రణాళిక (1951–'56) | రెండవ ప్రణాళిక (1956–'61) | మూడవ ప్రణాళిక (1961–'66) | నాల్గవ ప్రణాళిక (1966–'71) | ఐదవ ప్రణాళిక (1971–'76) |
|---|---|---|---|---|---|
| (4) ప్రణాళిక అంతమున జనాభా (కోట్లలో) | 38.4 | 40.8 | 43.4 | 46.5 | 50.0 |
| (5) పెట్టుబడి పెరుగుదల — ఉత్పత్తి నిష్పత్తి | 1.8 : 1 | 2.3 : 1 | 2.6 : 1 | 3.4 : 1 | 3.7 : 1 |
| (6) ప్రణాళిక అంతమున తలసరి ఆదాయము (రూ. లలో) | 281 | 331 | 396 | 466 | 546 |

సవరించబడిన అంచనాల ప్రకారం జాతీయాదాయమైతే 1967–68 సం॥ నాటికీ, తలసరి ఆదాయమైతే 1973–74 సం॥ నాటికీ (మొదటి అంచనాలకు 4 సం॥లు ముందుగానే) రెట్టింపు కాగలవని పైపట్టికనుండి విశదమగుచున్నది.

## ఆర్థిక నిర్మాణమునందు మార్పులు

జాతీయాదాయమునందు పెరుగుదల సంభవించినకొలదీ ప్రజల ఆర్థికక్రియాకలాపశక్తిలోనూ, వివిధ వృత్తులందూ మార్పులు సంభవించడం సహజం. జాతీయాదాయము పెరిగినకొలదీ ప్రజల ప్రాథమిక అవసరాలుతీరి, క్రొత్త అవసరాలు వుత్పన్నమై, ఈ క్రొత్త అవసరాలను తీర్చడానికి పారిశ్రామికోత్పత్తులు పెంపొందవలసి యుంటుంది. ఈ విధముగా ఆర్థికవ్యవస్థ బహుముఖమై, ఉత్పత్తి సాధనాలు విస్తరించుతాయి. ఉత్పత్తి సాధనాలు విస్తరించినకొలదీ పరిశ్రమలందు నియమితులై యుండేవారి సంఖ్య క్రమక్రమంగా పెరిగి, వ్యవసాయము, తత్సంబంధిత పనులందు నియుమితులై యుండేవారి సంఖ్య తగ్గుతుంది. ప్రస్తుతం మన కార్మిక బలములో దాదాపు 70 శాతము వ్యవసాయము, తత్సంబంధిత వృత్తులందే నియమితులై యున్నారు. 1975–76 సం॥ నాటికి వీరిసంఖ్య 60 శాతమునకు పడిపోయి, పరిశ్రమలు, రవాణా, వార్తావాహక సౌకర్యాలు, వివిధ నిర్మాణ కార్యక్రమాలందు నియమితులైయుండే వారిసంఖ్య క్రమక్రమంగా పెరుగగలదు. ఈ లక్ష్యముతోనే ద్వితీయ ప్రణాళిక పెట్టుబడి కార్యక్రమం రూపొందించబడింది.

## భౌతిక, ఆర్థిక సాధనసంపదల "ప్లానింగ్"

అభివృద్ధి ప్రణాళికలను రూపొందించునపుడు మనకుగల వివిధ సాధన సంపదల—అంగబలము, అర్థబలము తదితర సాధనసంపదలు—యేర్పాటునందు యెట్టి మార్పులను తీసికొనివస్తే ఆశించిన సత్ఫలితాలు చేకూరుతవో జాగ్రత్తగా నిర్ణయించడం అవసరం. దీనినే "భౌతిక, ఆర్థిక సాధనసంపదల ప్లానింగ్" అని వ్యవహరిస్తారు. దేశ ఆర్థికవ్యవస్థ సమగ్రవికాసానికి భౌతిక, ఆర్థిక సాధన సంపదలు—ఇవి పరస్పర పూరకములు—సమన్వయ పరచబడి, జాగ్రత్తగా వినియోగించబడాలి.

## దీర్ఘకాలిక ప్రణాళికలు, వార్షిక ప్రణాళికలు

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక దీర్ఘకాల ఆర్థికాభివృద్ధిని దృష్టిలోకి తీసికొన్నమీదట, దానిలో ఒక భాగముగానే రూపొందించబడింది. ముఖ్యముగా పెద్దపెద్ద పెట్టుబడులు అవసరమయ్యే ప్రాతిపదిక పరిశ్రమలు, విద్యుచ్ఛక్తి, నీటిపారుదల ప్రాజెక్టులు మొదలగు రంగములందు దీర్ఘకాల ప్రయోజనాలను దృష్టిలోకి తీసికొనడం అవసరం.

ఒక పంచవర్ష ప్రణాళికను రూపొందించునపుడు దానిలో అంతర్భాగాలుగా వార్షిక ప్రణాళికలను తయారుచేయడంవల్ల అనేక ప్రయోజనాలున్నాయి. ప్రణాళిక అమలు జరిగేకొలదీ యేర్పడే పరిస్థితులు, అవసరాల దృష్ట్యా యెప్పటికప్పుడు తగిన మార్పులను చేయడానికి వార్షిక ప్రణాళికలు యెంతైనా అవసరం. వార్షిక ప్రణాళికలను తయారుచేయడంలో అంతకు పూర్వము సాధించబడిన అభివృద్ధి, వివిధ సాధనసంపదలందు సంభవించిన మార్పులు, క్రొత్త అవసరాలు మొదలగు ముఖ్యవిషయాలను దృష్టిలోకి తీసికొనవలసి యుంటుంది.

---

2 వ అధ్యాయము

# ద్వితీయ పంచవర్ష ప్రణాళిక
# ముఖ్యలక్ష్యములు—విధానములు

## సోషలిస్టు సామాజిక వ్యవస్థ

దేశంలో సోషలిస్టు సామాజిక వ్యవస్థను క్రమక్రమంగా అవతరింపజేసే వుద్దేశముతో ద్వితీయ ప్రణాళిక రూపొందించబడింది. ఇట్టి వ్యవస్థలో అభివృద్ధి అనేది యెవరో కొందరు వ్యక్తుల ప్రయోజనాలకొరకు గాకుండా, యావత్తు సమాజపు శ్రేయస్సుకొరకే సాధించడం జరుగుతుంది. ప్రజల జీవన ప్రమాణములను పెంపొందించి, అభివృద్ధికి తగిన అవకాశములులేక వెనుకబడియున్న ప్రజలకు తగిన అవకాశములను కల్పించడం; ఆర్థిక నిమ్నోన్నతములను సాధ్యమైనంతవరకు తొలగించి, దేశసంపద సర్వులకు సమానంగా వినియోగమగునట్లు శ్రద్ధవహించడం; ప్రజలందు భాగస్వామ్య మనస్తత్వమును పెంపొందించడం, యీ వ్యవస్థయొక్క ఆశయములు. భారత రాజ్యాంగమునందీఆశయములన్నీ పొందుపరచబడియున్నవి.

## లక్ష్యములు

సోషలిస్టు సామాజిక వ్యవస్థ స్థాపన ఆశయమునకు అనుగుణముగా ద్వితీయ పంచవర్ష ప్రణాళిక దిగువ లక్ష్యములతో రూపొందించబడింది.

(1) ప్రజల జీవనప్రమాణమును పెంపొందించుటకు జాతీయాదాయము నందు తగుమాత్రం పెరుగుదలను సాధించుట;

(2) ప్రాతిపదిక, భారీపరిశ్రమల విషయమై ప్రత్యేక ప్రాముఖ్యతనిస్తూ త్వరితగతిన పారిశ్రామికాభివృద్ధిని సాధించుట;

(3) విరివిగా ఉద్యోగావకాశములను కల్పించుట;

(4) ప్రజల ఆదాయము, సంపదలందు గల హెచ్చుతగ్గులను సవరించి, ఆర్థికశక్తిని సమానముగా పంచుట.

ఈ లక్ష్యములన్నీ అవినాభావసంబంధము గలవి. ప్రజల జీవన ప్రమాణము పెంపొందవలయునంటే విరివిగా వస్తూత్పత్తి జరగడం అవసరం. సత్వర పారిశ్రామికాభివృద్ధి జరిగితేనే వస్తూత్పత్తిని యెక్కువచేయడం సాధ్యమౌతుంది.

పారిశ్రామికాభివృద్ధి త్వరితగతిన సాగవలయునంటే ప్రాతిపదిక పరిశ్రమలను నెలకొల్పడం అవసరం. ప్రాతిపదిక పరిశ్రమలు పెంపొందినకొలదీ నిత్యవాడకం వస్తువుల గిరాకీ హెచ్చుతుంది. నిత్యవాడకం వస్తువులను విరివిగా, దేశావసరాలకు అనుగుణముగా వుత్పత్తిచేయడానికి కార్మికబలమును బహుళముగా నియమించే పరిశ్రమలను ప్రారంభించి, తద్వారా నిరుద్యోగ సమస్యను చాలవరకు పరిష్కరించ వీలున్నది.

## పారిశ్రామిక విధానము

ద్వితీయ పంచవర్ష ప్రణాళికక్రింద తలపెట్టబడిన వివిధ లక్ష్యాలను సక్రమంగా సాధించవలయునంటే, ప్రభుత్వం పారిశ్రామికాభివృద్ధియందు ప్రముఖ పాత్ర వహించవలసి యుంటుంది. ఈ ముఖ్యవిషయం దృష్ట్యా, 1956 సం॥ ఏప్రిల్‌లో ప్రభుత్వం నూతన పారిశ్రామిక విధాన తీర్మానమును ఆమోదించింది. దేశ పారిశ్రామికాభివృద్ధి కార్యక్రమంలో ప్రభుత్వం ప్రముఖపాత్ర వహించాలనీ, తదనుగుణముగా ప్రభుత్వరంగం విస్తరించి, ముఖ్యమైన ప్రాతిపదిక పరిశ్రమలు, కీలకపరిశ్రమలు ప్రభుత్వరంగమునందు చేర్చబడాలనీ ఈ తీర్మానము నిర్దేశిస్తున్నది. ఇతర పరిశ్రమలలో భారీయెత్తున పెట్టుబడి అవసరమై, ప్రైవేటు సంస్థల శక్తికి మించినవానినికూడా ప్రభుత్వరంగమే స్వీకరిస్తుంది.

నూతన పారిశ్రామిక విధాన తీర్మానములో పరిశ్రమల జాబితాలు రెండు చేర్చబడినాయి. మొదటి జాబితాలో చేర్చబడిన 17 పరిశ్రమల స్థాపన, ఉత్తరోత్తరా వాని అభివృద్ధి మొదలగు విషయాల బాధ్యత పూర్తిగా ప్రభుత్వానిదే. ఇక రెండవ జాబితాలో చేర్చబడిన పరిశ్రమలు క్రమక్రమంగా ప్రభుత్వ యాజమాన్యము క్రిందకు తీసుకొనిరాబడుతాయి. వీని నిర్వహణలో ప్రైవేటు పెట్టుబడికికూడా తగిన ప్రోత్సాహమివ్వబడవచ్చును. ఈ రెండు జాబితాలలోనివి గాకుండా మిగతా పరిశ్రమల నిర్వహణ, అభివృద్ధి ప్రైవేటు సంస్థలకే వదలి వేయబడుతుంది. కాని, అవసరమైతే ప్రభుత్వము వీని నిర్వహణయందుకూడా పాల్గొనవచ్చును.

నూతన పారిశ్రామిక విధానమునందు చేర్చబడిన పరిశ్రమల జాబితాలు పాఠకుల సౌకర్యార్థం దిగువ నివ్వబడినాయి.

## "ఎ" తరగతి పరిశ్రమల జాబితా

(1) ఆయుధములు, మందుగుండు, తదితర రక్షణశాఖ పరికరముల పరిశ్రమలు.

(2) అణుశక్తి.

(3) ఇనుము, ఉక్కు.

(4) ఇనుము, ఉక్కుల పోతవస్తువులు, పరికరములు.

(5) ఇనుము, ఉక్కుల వుత్పత్తికి, గనుల త్రవ్వకమునకు, యంత్ర పరికరముల తయారీకి అవసరమైన భారీయంత్రములు; కేంద్రప్రభుత్వముచే నిర్దేశింపబడే తదితర ప్రాతిపదిక పరిశ్రమలు.

(6) "హైడ్రాలిక్", "స్టీమ్‌టర్బైన్"లతో సహా భారీవిద్యుత్ ప్లాంటులు.

(7) బొగ్గు, లిగ్నైట్.

(8) ఖనిజ తైలములు.

(9) ఇనుము, మాంగనీసు, క్రోమియమ్, జిప్సమ్, గంధకము, బంగారము, వజ్రముల గనుల త్రవ్వకం;

(10) రాగి, సీసము, తగరము, మాలిబ్డినము గనుల త్రవ్వకం, వాని "ప్రాసెసింగ్".

(11) 1953 సం॥ అణుశక్తి ఆర్డరునందు వివరింపబడిన ఖనిజములు.

(12) విమానములు.

(13) విమాన రవాణా.

(14) రైల్వే రవాణా.

(15) నౌకా నిర్మాణము.

(16) టెలిఫోనులు, టెలిఫోను కేబుల్లు, టెలిగ్రాఫ్, వైర్లెస్ పరికరములు (రేడియో రిసీవింగ్ సెట్లు మినహా).

(17) విద్యుచ్ఛక్తి తయారీ, పంపకం.

"బి" తరగతి పరిశ్రమల జాబితా

(1) 1949 సం॥పు "ఖనిజముల కన్సెషన్" నిబంధనలందు నిర్వచింపబడిన "మైనర్" ఖనిజములు మినహా యితర ఖనిజములు.

(2) అల్యూమినము, "ఎ" తరగతి పరిశ్రమల జాబితాయందు చేర్చబడని తదితర "నాన్ ఫెర్రస్" లోహములు.

(3) యంత్ర పరికరములు.

(4) లోహ మిశ్రమములు, ఉక్కు పరికరములు.

(5) ఔషధములు, అద్దకపురంగులు, ప్లాస్టిక్ వస్తువుల తయారీ వంటి రసాయనిక పరిశ్రమలకు అవసరమైన ప్రాతిపదిక వస్తువులు.

(6) క్రిమిసంహారక మందులు, తదితర అత్యవసరపు ఔషధములు.

(7) ఎరువులు.

(8) సింథెటిక్ రబ్బరు.

(9) బొగ్గు కర్బనీకరణము.

(10) కెమికల్ పల్ప్.

(11) రోడ్డు రవాణా.

(12) సముద్ర రవాణా.

## కుటీర పరిశ్రమలు, చిన్నతరగతి పరిశ్రమలు

నూతన పారిశ్రామిక విధాన తీర్మానమునందు కుటీరపరిశ్రమలు, చిన్నతరగతి పరిశ్రమల ప్రాముఖ్యత విషయమై నొక్కి వక్కాణించబడింది. గ్రామీణ ప్రాంతములందు నిరుద్యోగ, నిర్వ్యాపారత్వములను తొలగించడానికీ, యింతవరకు సద్వినియోగము గాకుండా వృథాగా పోతున్న పెట్టుబడిని, ప్రజల నైపుణ్యమును సద్వినియోగపరచి, తద్వారా వారి జీవనప్రమాణములను పెంపొందించడానికీ కుటీరపరిశ్రమలు, తదితర చిన్నతరగతి పరిశ్రమలు పునరేర్పాటు గావించబడి, ఆధునిక పద్ధతులు ప్రవేశపెట్టబడుటకు అవసరమైన ఆర్థిక, తదితర సహాయములు సమకూర్చబడాలని ఈ తీర్మానమునందు వివరింపబడింది.

## అసమానత్వముల తగ్గింపు

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక అభ్యుదయకరమైన సామాజిక, ఆర్థిక విధానములకనుగుణముగా, సోషలిస్టు సామాజిక వ్యవస్థ స్థాపన లక్ష్యముతో రూపొందించబడింది. దేశమందున్న ఆర్థిక, సామాజిక నిమ్నోన్నతములను తొలగించడం పై విధానములందొకటి. ఆర్థిక అసమానత్వములను అనేక విధాల తొలగించవచ్చును. సమగ్రమైన పన్నుల పద్ధతిని ప్రవేశపెట్టి, వ్యక్తిగత ఆదాయములపై పన్నులను విధించుటకు బదులుగా ఖర్చులపై పన్నులు విధించుట; బహుమతులు, పెట్టుబడి లాభాలపై పన్నులను విధించుట; ప్రభుత్వ యాజమాన్యముక్రింద ఆర్థిక కార్యకలాపముల నిర్వహణ; సాంఘిక సేవా కార్యక్రమాల విస్తరణ; సహకార రంగ విస్తరణ; భూస్వామ్య పద్ధతి రద్దు; జాయింట్ స్టాక్ కంపెనీలు, మేనేంజిగ్ ఏజెన్సీల నిర్వహణ విధానమును సంస్కరించుట; ఇంపీరియల్ బ్యాంకు జాతీయకరణ మొదలగు విధానములద్వారా ఆర్థిక, సామాజిక అసమానత్వములను తగ్గించ వీలున్నది.

ఆర్థిక విధానము, పద్ధతులు

ప్రభుత్వము అనుసరించే ఆర్థిక విధానపు ఆశయం, ప్రణాళిక నిర్వహణకు అవసరమైన ఆర్థిక సాధనసంపదలను సమీకరించుటయే కాదు; యితర సాధన సంపదలు సక్రమముగా వినియోగమగునట్లు తగిన శ్రద్ధవహించుట కూడా అయి వున్నది. ఈ సందర్భములో ప్రభుత్వం రెండు పద్ధతులను అనుసరించవలసి యుంటుంది. మొదటిది, దేశమందు కొనసాగుతూవుండే ఆర్థిక క్రియా కలాపములను క్రమబద్ధంచేయడం; రెండవది, యెగుమతి దిగుమతులపై కంట్రోళ్లను విధించుట, పరిశ్రమలకు లైసెన్సింగు పద్ధతిని ప్రవేశపెట్టుట, వస్తువుల ధరలపై కంట్రోళ్లను విధించుట మొదలగు పద్ధతులను అనుసరించడం. విస్తృతమైన అభివృద్ధి ప్రణాళికలను అమలు జరుపునప్పుడు ఈ రెండు పద్ధతులనూ అనుసరించడం అవసరం కావచ్చును. ప్రణాళిక అమలు జరిగేకొలదీ వస్తువుల ధరలు పెరిగిపోకుండా అరికట్టడానికి ఆహారధాన్యాలు, తదితర నిత్యావసరకం వస్తువులను సమృద్ధిగా నిల్వచేయాలని ప్రణాళికా సమితి సిఫార్సు చేసింది.

---

## 3 వ అధ్యాయము

# ప్రణాళిక స్వరూపము

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక, తొలిప్రణాళిక కాలములో ప్రారంభించబడిన అభివృద్ధి కార్యక్రమములను కొనసాగించుటతోబాటు, పారిశ్రామికాభివృద్ధికి, ముఖ్యముగా భారీపరిశ్రమల స్థాపనకు, వీనికవసరమైన రవాణా సౌకర్యాల విస్తరణకు ప్రత్యేక ప్రాముఖ్యత నిస్తున్నది.

### వివిధ రంగములకు కేటాయింపులు

తొలి ప్రణాళికకు మొత్తము రూ. 2356 కోట్లు కేటాయించబడితే, ద్వితీయ ప్రణాళిక నిమిత్తం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలచే రూ. 4800 కోట్ల అభివృద్ధివ్యయము తలపెట్టబడింది. ఈ మొత్తములు యేయే రంగములకు యెంత చొప్పున కేటాయించబడిందీ దిగువ పట్టికయందు వివరించబడింది :—

(రూ. కోట్లలో)

| రంగము | ప్రథమ పంచవర్ష ప్రణాళిక | | ద్వితీయ పంచవర్ష ప్రణాళిక | |
|---|---|---|---|---|
| | కేటాయింపు మొత్తము | శాతము | కేటాయింపు మొత్తము | శాతము |
| (1) | (2) | (3) | (4) | (5) |
| 1. వ్యవసాయము, సమాజాభివృద్ధి కార్యక్రమములు | 357 | 15.1 | 568 | 11.8 |
| (a) వ్యవసాయము | 241 | 10 2 | 341 | 7.1 |
| వ్యవసాయ కార్యక్రమములు | 197 | 8.3 | 170 | 3.5 |
| పశుపోషణ | 22 | 1.0 | 56 | 1.1 |
| అడవులు | 10 | 0.4 | 47 | 1 0 |
| మత్స్యపరిశ్రమ | 4 | 0.2 | 12 | 0.3 |
| సహకారము | 7 | 0.3 | 47 | 1.0 |
| తదితరములు | 1 | — | 9 | 0.2 |

| (1) | (2) | (3) | (4) | (5) |
|---|---|---|---|---|
| (బి) సమాజవికాస, జాతీయవికాస కార్యక్రమములు | 90 | 3.8 | 200 | 4.1 |
| (సి) ఇతర కార్యక్రమములు | 26 | 1.1 | 27 | 0.6 |
| గ్రామ పంచాయితీలు | 11 | 0.5 | 12 | 0.3 |
| స్థానికాభివృద్ధి పనులు | 15 | 0.6 | 15 | 0.3 |
| 2. నీటిపారుదల, విద్యుచ్ఛక్తి | 661 | 28.1 | 913 | 19.0 |
| నీటిపారుదల | 384 | 16.3 | 381 | 7.9 |
| విద్యుచ్ఛక్తి | 260 | 11.1 | 427 | 8.9 |
| వరదల నివారణ, తదితర ప్రాజెక్టులు | 17 | 0.7 | 105 | 2.2 |
| 3. పరిశ్రమలు, గనుల త్రవ్వకం | 179 | 7.6 | 890 | 18.5 |
| పెద్దపరిశ్రమలు, మధ్యరకం పరిశ్రమలు | 148 | 6.3 | 617 | 12.9 |
| ఖనిజముల అభివృద్ధి | 1 | — | 73 | 1.5 |
| గ్రామ పరిశ్రమలు, చిన్న తరగతి పరిశ్రమలు | 30 | 1.3 | 200 | 4.1 |
| 4, రవాణా, వార్తా సౌకర్యాలు | 557 | 23.6 | 1385 | 28.9 |
| రైల్వేలు | 268 | 11.4 | 900 | 18.8 |
| రోడ్లు | 130 | 5.5 | 246 | 5.1 |
| రోడ్డు రవాణా | 12 | 0.5 | 17 | 0.4 |
| రేవులు, నౌకాశ్రయములు | 34 | 1.4 | 45 | 0.9 |
| షిప్పింగ్ | 26 | 1.1 | 48 | 1.0 |
| కాలువలద్వారా రవాణా | — | — | 3 | 0.1 |
| పౌరవిమానయానం | 24 | 1.0 | 43 | 0.9 |
| ఇతర రవాణాలు | 3 | 0.1 | 7 | 0.1 |
| తంతి, తపాలు సౌకర్యాలు | 50 | 2.2 | 63 | 1.3 |
| ఇతర వార్తా సౌకర్యాలు | 5 | 0.2 | 4 | 0.1 |
| బ్రాడ్కాస్టింగ్ | 5 | 0.2 | 9 | 0.2 |

| (1) | (2) | (3) | (4) | (5) |
|---|---|---|---|---|
| 5. సాంఘికసేవా కార్యక్రమాలు | 533 | 22.6 | 945 | 19.7 |
| విద్య | 164 | 7.0 | 307 | 6.4 |
| ఆరోగ్యం | 140 | 5.9 | 274 | 5.7 |
| గృహవసతి | 49 | 2.1 | 120 | 2.5 |
| వెనుకబడినవర్గాల సంక్షేమం | 32 | 1.3 | 91 | 1.9 |
| సాంఘిక సంక్షేమం | 5 | 0.2 | 29 | 0.6 |
| కార్మికులు, కార్మికసంక్షేమం | 7 | 0.3 | 29 | 0.6 |
| నిర్వాసుల పునరుద్ధరణ | 136 | 5.8 | 90 | 1.9 |
| విద్యావంతులందు నిరుద్యోగతను తొలగించడానికి ప్రత్యేక పథకములు | — | — | 5 | 0.1 |
| 6. తదితరములు | 69 | 3.0 | 99 | 2.1 |
| మొత్తము | 2,356 | 100.0 | 4,800 | 100.0 |

పై పట్టికయందు వివిధ అభివృద్ధి కార్యక్రమముల కేటాయింపులను పరిశీలించితే ప్రథమ, ద్వితీయ ప్రణాళికల మధ్య ప్రాధాన్యక్రమమందు వ్యత్యాసమున్నట్లు విశదము కాగలదు. ద్వితీయ ప్రణాళికలో పరిశ్రమలు, గనులత్రవ్వకం, రవాణా, వార్తావాహక సౌకర్యాల నిమిత్తం మొత్తపువ్యయములో దాదాపు సగభాగము వరకు కేటాయించడం జరిగింది. ఈ అంశములన్నింటికీ కలిపి తొలి ప్రణాళికలో కన్న ద్వితీయప్రణాళికలో దాదాపు నాలుగురెట్లు ధనము కేటాయించబడింది. ద్వితీయ ప్రణాళికలో పరిశ్రమలకు, రవాణా, వార్తా సౌకర్యాల అభివృద్ధికీ విశేషప్రాధాన్యమివ్వబడినప్పటికీ ఆహారధాన్యాలు, ముడివస్తువుల వుత్పత్తివిషయం నిర్లక్ష్యం చేయబడలేదు. మరికొంత కాలమువరకూ వ్యవసాయాభివృద్ధి కార్యక్రమం నిర్విరామంగా కొనసాగవలసియున్నది.

## రాష్ట్ర ప్రణాళికలు

ద్వితీయప్రణాళిక నిర్వహణ నిమిత్తం తలపెట్టబడిన అభివృద్ధి వ్యయము మొత్తము రూ. 4,800 కోట్లలో రూ. 2,241 కోట్లు రాష్ట్రప్రణాళికలకు

సంబంధించినది. వివిధ రాష్ట్రాల ప్రణాళికలకు కేటాయించబడిన సొమ్ము వివరములు దిగువ పట్టికయందివ్వబడినాయి :—

వివిధరాష్ట్రములకు కేటాయింపులు

| రాష్ట్రము | ప్రథమ ప్రణాళిక | ద్వితీయ ప్రణాళిక |
|---|---|---|
| | రూ. కోట్లలో | రూ. కోట్లలో |
| ఆంధ్ర ... ... | 75.9 | 119.0 |
| అస్సామ్ ... ... | 28.1 | 57.9 |
| బీహారు ... ... | 104.4 | 194.2 |
| బొంబాయి ... ... | 181.3 | 266.2 |
| మధ్యప్రదేష్ ... ... | 57.5 | 123.7 |
| మద్రాసు ... ... | 97.0 | 173.1 |
| ఒరిస్సా ... ... | 85.2 | 100.0 |
| పంజాబు ... ... | 124.0 | 126.3 |
| ఉత్తరప్రదేష్ ... ... | 165.9 | 253.1 |
| పశ్చిమ బెంగాల్ ... ... | 151.9 | 153.7 |
| పార్టు "ఎ" రాష్ట్రాల మొత్తం ... | 1,071.2 | 1,567.2 |
| హైదరాబాదు ... ... | 57.0 | 100.2 |
| మధ్య భారత్ ... ... | 36.1 | 67.3 |
| మైసూర్ ... ... | 53.2 | 80.6 |
| పెప్సూ ... ... | 39.2 | 36.3 |
| రాజస్థాన్ ... ... | 62.8 | 97.4 |
| సౌరాష్ట్ర ... ... | 29.8 | 47.7 |
| తిరువాన్కూరు-కొచ్చిన్ ... | 35.4 | 72.0 |
| జమ్ము-కాష్మీరు ... ... | 13.2 | 33.9 |
| పార్టు "బి" రాష్ట్రాల మొత్తం ... | 326.7 | 535.4 |

| రాష్ట్రము | | | ప్రథమ ప్రణాళిక | ద్వితీయ ప్రణాళిక |
|---|---|---|---|---|
| | | | రూ. కోట్లలో | రూ. కోట్లలో |
| అజ్మీరు | ... | ... | 3.6 | 7.9 |
| భోపాల్ | ... | ... | 9.3 | 14.3 |
| కూర్గు | ... | ... | 2.0 | 3.8 |
| ఢిల్లీ | ... | ... | 10.5 | 17.0 |
| హిమాచలప్రదేష్ | ... | ... | 7.5 | 14.7 |
| కచ్ | ... | ... | 4.8 | 7.9 |
| మణిపూర్ | ... | ... | 2.2 | 6.2 |
| త్రిపుర | ... | ... | 3.0 | 8.5 |
| వింధ్యప్రదేష్ | ... | ... | 9.3 | 24.9 |
| పార్టు "సి" రాష్ట్రముల మొత్తం... | | | 52.2 | 105.2 |
| అండమాన్, నికోబార్ ద్వీపములు | | | 1.5 | 5.9 |
| ఈశాన్య సరిహద్దు ప్రాంతము ... | | | 4.4 | 9.5 |
| పుదుచ్చేరి | ... | ... | 0.8 | 4.8 |
| మొత్తం ... | | | 6.7 | 20.2 |
| దామోదరలోయ కార్పొరేషన్‌లో కేంద్రప్రభుత్వపు వాటా | | | — | 12.2 |
| సమాజవికాస, జాతీయవికాస కార్యక్రమాలు | | | — | 0.7* |
| పూర్తి మొత్తము ... | | | 1,456.8 | 2,240.9 |

* ఇదిగాక ద్వితీయ ప్రణాళిక క్రింద సమాజవికాస, జాతీయవికాస కార్యక్రమముల నిమిత్తం వివిధరాష్ట్రములకు రూ. 187 కోట్లు కేటాయించడం జరిగింది.

ద్వితీయప్రణాళిక నిమిత్తము ప్రభుత్వాంగమందు తలపెట్టబడిన వ్యయము మొత్తము రూ. 4,800 కోట్లలో, రూ. 1,000 కోట్లు వర్తమాన అభివృద్ధి వ్యయమును, మిగతా రూ. 3,800 కోట్లు పెట్టుబడి వ్యయమును సూచించుతవి.

ఈ రెండు రకాల వ్యయములు వివిధశాఖలకు యెంతచొప్పున కేటాయించబడిందీ దిగువపట్టికయందు వివరించబడింది :—

(రూ. కోట్లలో)

| అంశము | పెట్టుబడి వ్యయము | వర్తమాన వ్యయము | మొత్తము |
|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) |
| I వ్యవసాయము, సమాజాభివృద్ధి కార్యక్రమములు ... | 338 | 230 | 568 |
| (1) వ్యవసాయము ... | 181 | 160 | 341 |
| (2) సమాజవికాస, జాతీయ వికాస కార్యక్రమాలు* | 157 | 70 | 227 |
| II నీటిపారుదల, విద్యుచ్ఛక్తి ... | 863 | 50 | 913 |
| (1) నీటిపారుదల, వరదల నివారణ ... | 456 | 30 | 486 |
| (2) విద్యుచ్ఛక్తి ... | 407 | 20 | 427 |
| III పరిశ్రమలు, గనులత్రవ్వకం ... | 790 | 100 | 890 |
| (1) పెద్ద పరిశ్రమలు, మధ్య రకం పరిశ్రమలు, గనుల త్రవ్వకం ... | 670 | 20 | 690 |
| (2) గ్రామపరిశ్రమలు, తదితర చిన్నరకం పరిశ్రమలు. | 120 | 80 | 200 |
| IV రవాణా, వార్తాసౌకర్యాలు ... | 1,335 | 50 | 1,385 |
| V సాంఘిక సేవా కార్యక్రమాలు... | 455 | 490 | 945 |
| VI తదితరములు ... | 19 | 80 | 99 |
| మొత్తం ... | 3,800 | 1,000 | 4,800 |

* స్థానికాభివృద్ధి పనులు, గ్రామపంచాయితీలతో సహా.

ప్రైవేటు రంగము

ద్వితీయ ప్రణాళిక కాలములో ప్రైవేటు రంగపు పెట్టుబడి మొత్తము రూ. 2,400 కోట్లవరకూ వుండవచ్చునని ఆశించబడుచున్నది. ఈ మొత్తము దిగువ వివరించబడినట్లు విభజించబడింది :—

(రూ. కోట్లలో)

| | | |
|---|---|---|
| (1) | పరిశ్రమలు, గనుల త్రవ్వకం ... | 575 |
| (2) | తోటలు, విద్యుచ్ఛక్తి పనులు, రైల్వేలు మినహా యితర రవాణా సౌకర్యాలు ... | 125 |
| (3) | నిర్మాణము ... ... ... | 1,000 |
| (4) | వ్యవసాయము, గ్రామపరిశ్రమలు, చిన్న తరగతి పరిశ్రమలు ... ... | 300 |
| (5) | స్టాకులు ... ... ... | 400 |
| | మొత్తము ... | 2,400 |

ద్వితీయ ప్రణాళిక కాలములో ప్రభుత్వ, ప్రైవేటు రంగముల పెట్టుబడుల మొత్తము రూ. 6,200 కోట్లవరకూ వుండవచ్చునని అంచనా వేయబడింది. ప్రథమ ప్రణాళిక కాలములో, ప్రభుత్వ, ప్రైవేటు పెట్టుబడులు 50 : 50 నిష్పత్తిలో నుండగా, ద్వితీయ ప్రణాళిక కాలములో 61 : 39 నిష్పత్తిలో వున్నాయి. ఈ విధముగా ప్రభుత్వరంగము క్రమక్రమంగా ప్రముఖపాత్రను వహించనున్నది.

## ఉత్పత్తి, అభివృద్ధి లక్ష్యములు

ద్వితీయ ప్రణాళిక కాలములో ప్రభుత్వ, ప్రైవేటు రంగములందు తలపెట్టబడిన పెట్టుబడుల ఫలితముగా సాధించబడనున్న ఉత్పత్తి, అభివృద్ధి లక్ష్యములు దిగువ పట్టికయందివ్వబడ్డాయి :—

ఉత్పత్తి, అభివృద్ధి లక్ష్యములు

| రంగము, అంశము | యూనిట్ | 1950–'51 | 1955–'56 | 1960–'61 | 1955–56 సం॥ 1960–61 సం॥ మధ్య అభివృద్ధి శాతము |
|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
| I వ్యవసాయము, సమాజాభివృద్ధి కార్యక్రమములు | | | | | |
| (1) ఆహారధాన్యములు | లక్షలటన్నులు | 540* | 650 | 750 | 15 |
| (2) ప్రత్తి | లక్షల బేళ్లు | 29 | 42 | 55 | 31 |
| (3) చెఱకు–బెల్లము | లక్షలటన్నులు | 56 | 58 | 71 | 22 |
| (4) నూనె విత్తులు | లక్షలటన్నులు | 51 | 55 | 70 | 27 |
| (5) జనపనార | లక్షల బేళ్లు | 33 | 40 | 50 | 25 |
| (6) తేయాకు | లక్షల పౌన్లు | 6,130 | 6,440 | 7,000 | 9 |
| (7) జాతీయ వికాస కార్యక్రమ బ్లాకులు | సంఖ్య | — | 500 | 3,800 | 660 |
| (8) సమాజాభి వృద్ధి బ్లాకులు | సంఖ్య | — | 622 | 1,120 | 80 |

*1949–'50 కు సంబంధించినది.

| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
|---|---|---|---|---|---|
| (9) సమాజవికాస, జాతీయవికాస కార్యక్రమాలవల్ల లాభము పొందిన జనాభా | లక్షల సంఖ్య | — | 800 | 3,250 | 306 |
| (10) గ్రామ పంచాయితీలు | వేల సంఖ్య | 83 | 118 | 200 | 70 |
| II నీటిపారుదల, విద్యుచ్ఛక్తి | | | | | |
| (1) నీటిపారుదల సౌకర్యముగల భూమి | లక్షల యెకరాలు | 510 | 670 | 880 | 31 |
| (2) విద్యుచ్ఛక్తి | లక్షలకిలోవాట్లు | 23 | 34 | 69 | 103 |
| III ఖనిజములు | | | | | |
| (1) ఇనుము | లక్షల టన్నులు | 30 | 43* | 125 | 191 |
| (2) బొగ్గు | లక్షల టన్నులు | 323† | 380† | 600† | 58 |
| IV పెద్దయెత్తు పరిశ్రమలు | | | | | |
| (1) ఉక్కు (ఫినిష్డ్) | లక్షల టన్నులు | 11 | 13 | 43 | 231 |
| (2) ఫౌండ్రీలకు విక్రయించడానికి తగిన యినుము | లక్షల టన్నులు | — | 3.8 | 7.5 | 97 |
| (3) అల్యూమినం | వేల టన్నులు | 3.7 | 7.5 | 25.0 | 233 |
| (4) భారీ ఉక్కు పరికరములు (అమ్మకానికి) | వేల టన్నులు | — | — | 12 | — |

*1954 క్యాలెండరు సం॥కు సంబంధించినది.

† క్యాలెండరు సం॥నకు సంబంధించిన అంకెలు.

| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
|---|---|---|---|---|---|
| (5) భారీ ఉక్కు పోత పరికరములు (అమ్మకానికి) | వేల టన్నులు | — | — | 15 | — |
| (6) ఉక్కు చట్రములు | వేల టన్నులు | వి.ల.* | 180 | 500 | 178 |
| (7) యంత్ర పరికరములు (విలువ) | లక్షల రూ.లలో | 31.8 | 75 | 300 | 300 |
| (8) సిమెంటు తయారీ యంత్రములు (విలువ) | లక్షల రూ.లలో | వి.ల.* | 56 | 200 | 257 |
| (9) పంచదార తయారీ యంత్రములు (విలువ) | లక్షలరూ.లలో | వి.ల.* | 28 | 250 | 779 |
| (10) వస్త్రముల తయారీ యంత్రములు (విలువ) | లక్షల రూ.లలో | వి.ల.* | 412 | 1,950 | 373 |
| (11) కాగితపు తయారీ యంత్రములు (విలువ) | లక్షల రూ.లలో | బ.స్వ.† | బ.స్వ.† | 400 | — |
| (12) సెంట్రిఫ్యూగల్ పంపులు | వేల సంఖ్య | 34 | 40 | 86 | 115 |
| (13) డీజెల్ యింజన్లు | వేలహార్సుపవరు | స.ల.‡ | 100 | 205 | 105 |
| (14) ఆటోమొబైల్ యింజన్లు | సంఖ్య | 16,500 | 25,000 | 57,000 | 128 |
| (15) రైలు యింజన్లు | సంఖ్య | 3 | 175 | 400 | 129 |
| (16) ట్రాక్టర్లు | సంఖ్య | — | — | 3,000 | — |
| (17) సిమెంటు | లక్షల టన్నులు | 27 | 43 | 130 | 202 |
| (18) ఎరువులు | | | | | |
| (ఎ) నత్రజని యెరువులు | వేల టన్నులు | 46 | 380 | 1,450 | 282 |

*వివరములు లభించలేదు.

† బహుస్వల్పము.

‡ సమాచారము లభించలేదు.

| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
|---|---|---|---|---|---|
| (బి) సూపర్ ఫాస్ఫేటు యెరువులు | వేల టన్నులు | 55 | 120 | 720 | 500 |
| (19) సల్ఫ్యూరిక్ యాసిడ్ | వేల టన్నులు | 99 | 170 | 470 | 176 |
| (20) సోడాయాష్ | వేల టన్నులు | 45 | 80 | 230 | 188 |
| (21) కాస్టిక్ సోడా | వేల టన్నులు | 11 | 36 | 135 | 275 |
| (22) శుద్ధిచేయబడిన పెట్రోలు | లక్షల టన్నులు | — | 36 | 43 | 19 |
| (23) ఎలక్ట్రిక్ ట్రాన్స్ఫార్మర్లు | వేల కె. వి. ఎ. | 179 | 540 | 1,360 | 151 |
| (24) ఎలక్ట్రిక్ కేబుల్సు | టన్నులు | 1,420 | 9,000 | 18,000 | 100 |
| (25) ఎలక్ట్రిక్ మోటార్లు | వేలహార్సుపవరు | 99 | 240 | 600 | 150 |
| (26) నూలువస్త్రములు | కోట్ల గజములు | 461.8 | 685.0 | 850.0 | 24 |
| (27) పంచదార | లక్షల టన్నులు | 11 | 17 | 23 | 35 |
| (28) కాగితము,అట్టలు | వేల టన్నులు | 114 | 200 | 350 | 75 |
| (29) బైస్కిల్లు | వేల సంఖ్య | 101 | 550 | 1,000 | 82 |
| (30) కుట్టుమిషన్లు | వేల సంఖ్య | 33 | 110 | 220 | 100 |
| (31) ఎలక్ట్రిక్ ఫాన్లు | వేల సంఖ్య | 194 | 275 | 600 | 118 |
| V రవాణా, వార్తా సౌకర్యాలు | | | | | |
| (ఎ) రైల్వేలు: | | | | | |
| (1) పాసింజెరు రైలు మైళ్లు | లక్షలలో | 950 | 1,080 | 1,240 | 15 |
| (2) సరకుల రవాణా | లక్షల టన్నులు | 910 | 1,200 | 1,810 | 51 |
| (బి) రోడ్లు: | | | | | |
| (1) జాతీయ రహదార్లు | వేల మైళ్లు | 12.3 | 12.9 | 13.8 | 7 |
| (2) తదితర రోడ్లు | వేల మైళ్లు | 97.0 | 107.0 | 125.0 | 17 |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
|---|---|---|---|---|---|
| (సి) షిప్పింగ్ : | | | | | |
| (1) కోస్తానౌకలు | లక్షల జి.ఆర్.టి. | 2.2 | 3.2 | 4.3 | 34 |
| (2) విదేశీ ప్రయాణ నౌకలు | లక్షల జి.ఆర్.టి. | 1.7 | 2.8 | 4.7 | 68 |
| (డి) నౌకాశ్రయములు : (నిర్వహణ శక్తి) | లక్షల టన్నులు | 200 | 250 | 325 | 30 |
| (ఇ) తంతి, తపాలా : | | | | | |
| (1) పోస్టాఫీసులు | వేల సంఖ్య | 36 | 55 | 75 | 36 |
| (2) టెలిగ్రాఫ్ ఆఫీసులు | వేల సంఖ్య | 3.6 | 4.9 | 6.3 | 28 |
| (3) టెలిఫోన్లు | వేల సంఖ్య | 168 | 270 | 450 | 67 |
| VI విద్య | | | | | |
| (1) వివిధ వయస్సుల బాల బాలికలలో స్కూళ్లకు వెళ్లుచున్న వారి శాతము : | | | | | |
| (ఎ) ప్రాథమికదశ | 6–11 సం॥ | 42.0 | 51.0 | 63.0 | — |
| (బి) మాధ్యమికదశ | 11–14 సం॥ | 14.0 | 19.0 | 22.5 | — |
| (సి) హయ్యరు సెకండరీ దశ | 14–17 సం॥ | 6.4 | 9.4 | 12.0 | — |
| (2) ప్రాథమిక ప్రాతిపదిక పాఠశాలలు | లక్షలు | 2.23 | 2.93 | 3.50 | 19 |
| (3) ప్రాథమిక/మాధ్యమిక పాఠశాలలో పాధ్యాయులు | లక్షలలో | 7.4 | 10.3 | 13.4 | 30 |
| (4) ఉపాధ్యాయుల తర్ఫీదు సంస్థలు | సంఖ్య | 835 | 1,136 | 1,412 | 24 |
| (5) ఉపాధ్యాయుల తర్ఫీదు సంస్థలందు ప్రవేశకుల సంఖ్య | వేలలో | 75.6 | 103.5 | 134.2 | 30 |

| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
|---|---|---|---|---|---|
| VII ఆరోగ్యము | | | | | |
| (1) వైద్య సంస్థలు | వేలలో | 8.6 | 10 | 12.6 | 26 |
| (2) ఆసుపత్రులలో మంచముల సంఖ్య | వేలలో | 113 | 125 | 155 | 24 |
| (3) డాక్టర్లు | వేలలో | 59 | 70 | 82.5 | 18 |
| (4) నర్సులు | వేలలో | 17 | 22 | 31 | 41 |
| (5) మంత్రసానులు | వేలలో | 18 | 26 | 32 | 23 |
| (6) నర్సు-దాయీలు | వేలలో | 4 | 6 | 41 | 583 |
| (7) ఆరోగ్య సహాయకులు, శానిటరీ యినస్పెక్టర్లు | వేలలో | 3.5 | 4 | 7 | 75 |

ద్వితీయ ప్రణాళిక క్రింద పారిశ్రామికాభివృద్ధికి, ముఖ్యముగా ప్రాతిపదిక పరిశ్రమల అభివృద్ధికి విశేషప్రాధాన్యమివ్వబడింది. ఏడాదికి 10 లక్షల టన్నుల ఉక్కును వుత్పత్తిచేయగల పెద్ద కర్మాగారములు మూడు నెలకొల్పబడనున్నాయి. ప్రస్తుతం పనిచేస్తున్న యెరువుల కర్మాగారముల వుత్పత్తి శక్తిని ఇతోధికంచేయుటతోబాటు క్రొత్తగా మరి మూడు కర్మాగారములు నెలకొల్పబడగలవు. సిమెంటు వుత్పత్తి ప్రస్తుతపు స్థాయి 43 లక్షల టన్నులనుండి 130 లక్షల టన్నులవరకూ; బొగ్గు వుత్పత్తి 380 లక్షల టన్నులనుండి 600 లక్షల టన్నులవరకూ పెంపొందించబడనున్నవి. రైల్వే యింజనుల వుత్పత్తి ప్రస్తుతపు స్థాయి 175 నుండి, ద్వితీయ ప్రణాళిక ముగియులోపల 400 వరకూ పెరుగగలదని ఆశించబడుచున్నది. ద్వితీయ ప్రణాళిక క్రింద వ్యవసాయోత్పత్తుల పెరుగుదల ప్రస్తుతానికి ·18 శాతముగా నిర్ణయించబడింది. ఈ లక్ష్యమును యితోధికము చేయడానికిగల అవకాశములు పరిశీలనలో వున్నాయి. వ్యవసాయోత్పత్తులను ఆశించిన మేరకు అధికముచేయడానికి అదనముగా 210 లక్షల యెకరముల భూమికి నీటిపారుదల సౌకర్యం కల్పించబడాలి. ఇక విద్యుచ్ఛక్తి వుత్పాదక శక్తి ప్రస్తుతపు స్థాయి 34 లక్షల కిలోవాట్లనుండి ద్వితీయ ప్రణాళిక ముగియునప్పటికి 69 లక్షల కిలోవాట్లవరకూ పెంపొందగలదని ఆశించబడుచున్నది.

ద్వితీయ ప్రణాళిక కాలములో సాంఘిక సంక్షేమ కార్యక్రమ విషయమై కూడ యితోధికమైన కృషి జరుపబడగలదు. ప్రణాళిక ముగియునప్పటికి 6-11 సం॥ల వయస్సుగల బాలబాలికలందు 63 శాతమునకు; 11-14 సం॥ల వయస్సుగల బాలబాలికలందు 23 శాతమునకు విద్యాసౌకర్యాలు కల్పించబడగలవు.

ప్రజలకు వైద్య సౌకర్యాలు యితోధికముగా లభించగలందులకై డాక్టర్లు, నర్సులు, శానిటరీ యినస్పెక్టర్లు, మొదలగు వైద్య సిబ్బంది విరివిగా తయారు చేయబడనున్నది.

### జాతీయాదాయపు పెరుగుదల

ద్వితీయ ప్రణాళిక కాలములో వివిధరంగములందు తలపెట్టబడిన అభివృద్ధి ఫలితముగా జాతీయాదాయమునందూ, తద్వారా తలసరి ఆదాయమునందూ తగు మాత్రం పెరుగుదల సంభవించగలదు. వీనికి సంబంధించిన వివరములు దిగువ పట్టికయందివ్వబడ్డాయి :—

(1952-53 సం॥ ధరల ప్రకారం ; రూ. కోట్లలో)

| రంగము | 1950-'51 | 1955-'56 | 1960-'61 | అభివృద్ధి శాతము 1951-'56 | అభివృద్ధి శాతము 1956-'61 |
|---|---|---|---|---|---|
| (1) వ్యవసాయము, తత్సంబంధితపనులు | 4,450 | 5,230 | 6,170 | 18 | 18 |
| (2) గనుల త్రవ్వకం | 80 | 95 | 150 | 19 | 58 |
| (3) ఫ్యాక్టరీ సంస్థలు | 590 | 840 | 1,380 | 43 | 64 |
| (4) వాణిజ్యము, రవాణా, వార్తా సౌకర్యాలు | 1,650 | 1,875 | 2,300 | 14 | 23 |
| (5) చిన్న పరిశ్రమలు | 740 | 840 | 1,085 | 14 | 30 |
| (6) నిర్మాణము | 180 | 220 | 295 | 22 | 34 |
| (7) వివిధవృత్తులు, ప్రభుత్వసర్వీసులు | 1,420 | 1,700 | 2,100 | 20 | 23 |
| (8) జాతీయోత్పత్తుల మొత్తము | 9,110 | 10,800 | 13,480 | 18 | 25 |
| (9) తలసరి ఆదాయం (రూ. లలో) | 253 | 281 | 331 | 11 | 18 |

ద్వితీయ ప్రణాళిక కాలములో జాతీయాదాయమునందు 25 శాతము, తలసరి ఆదాయమునందు 18 శాతము అభివృద్ధి సాధించబడగలదని పైపట్టిక విశదం చేస్తున్నది.

ఆర్థిక సాధన సంపదలు

ద్వితీయ ప్రణాళికక్రింద ప్రభుత్వరంగమునందు తలపెట్టబడిన ఖర్చు మొత్తము రూ. 4,800 కోట్లు యేవిధముగా సమకూర్చబడనున్నదీ దిగువ వివరింపబడింది :—

| | | (రూ. కోట్లలో) |
|---|---|---|
| (1) వర్తమాన ప్రభుత్వాదాయములనుండి మిగుళ్లు | ... | 800 |
| (ఎ) ప్రస్తుతపు పన్నులరేట్ల ప్రకారం | ... | 350 |
| (బి) అదనపు పన్నులద్వారా | ... | 450 |
| (2) ప్రజలనుండి ఋణాలు | ... ... | 1,200 |
| (ఎ) మార్కెట్టు ఋణాలద్వారా | ... | 700 |
| (బి) చిన్న మొత్తముల నిల్వలద్వారా | ... | 500 |
| (3) బడ్జెటునుండి యితర ఆదాయములు | ... | 400 |
| (ఎ) రైల్వేల వాటా | ... ... | 150 |
| (బి) ప్రావిడెంటు ఫండులు, తదితర డిపాజిట్లనుండి | | 250 |
| (4) విదేశాలనుండి సహాయం | ... ... | 800 |
| (5) లోటుబడ్జెటు విధానముద్వారా | ... ... | 1,200 |
| (6) భర్తీకాకుండా మిగిలినది | ... ... | 400 |
| మొత్తము | ... | 4,800 |

ప్రణాళిక నిర్వహణకు అవసరమైన మొత్తపు ఖర్చులో దాదాపు సగభాగం దేశీయ సాధన సంపదలద్వారానే— అదనపు పన్నులు, ప్రజలనుండి ఋణములు, తదితర బడ్జెటు ఆదాయములు—సేకరించబడవలసియుంటుందని పైపట్టిక విశదం చేస్తున్నది. మిగతా సొమ్ములో సగభాగం లోటుబడ్జెటు పద్ధతిద్వారానూ, 33 శాతము విదేశాలనుండి సహాయముద్వారానూ సేకరించబడవలసియున్నది. ఇవన్నీ పోగా మరి రూ. 400 కోట్లవరకూ భర్తీచేయబడవలసియుంటుంది. మరి

కొన్ని అదనపు పన్నులద్వారా గానీ, ప్రణాళిక కాలములో ప్రభుత్వముచే నెలకొల్పబడే పరిశ్రమలనుండి వచ్చే లాభములద్వారా గానీ, యీకొరతను భర్తీ చేయవలసియుంటుంది.

## విదేశీ మారకపు సాధన సంపదలు

ద్వితీయ ప్రణాళికలో పారిశ్రామికాభివృద్ధికి, ముఖ్యముగా ప్రాతిపదిక పరిశ్రమల అభివృద్ధికి విశేషప్రాధాన్యమివ్వబడినందువల్ల, విదేశీమారక ద్రవ్యమును యితోధికముగా వినియోగించవలసిన ఆవశ్యకత యేర్పడవచ్చును. ప్రభుత్వ, ప్రైవేటు రంగములందు తలపెట్టబడిన వివిధ అభివృద్ధి కార్యక్రమముల నిర్వహణ నిమిత్తం ఈ అయిదు సం॥లలో రూ. 2,150 కోట్ల విలువగల యంత్రములు, వాహకములు, ఇనుము, ఉక్కు, తదితర లోహములను దిగుమతి చేసికొనవలసి యుంటుంది.

ద్వితీయ ప్రణాళిక కాలములో యెగుమతి, దిగుమతుల ఫలితముగా వర్తమాన ఖాతాయందు రూ. 1,100 కోట్లవరకూ కొరత యేర్పడగలదని అంచనా. దీనిలో కొంతభాగమును మనకుగల స్టర్లింగు నిల్వలనుండి రూ. 200 కోట్ల మేరకు రాబట్టుటద్వారా తగ్గించ తలపెట్టబడింది. ప్రైవేటురంగమునందు విదేశీ పెట్టుబడి రూ. 100 కోట్లవరకూ రావచ్చుననుకొంటే, మిగతా రూ. 800 కోట్లను విదేశాలనుండి సహాయముద్వారా పొందవలసి యుంటుందన్నమాట. ప్రథమ ప్రణాళిక కాలములో వినియోగించబడకుండా మిగిలిపోయిన విదేశీ సహాయద్రవ్యం రూ. 94 కోట్లు, భిలాయ్, దుర్గాపూర్ ఉక్కుకర్మాగారముల నిమిత్తం యింతవరకూ సేకరించబడిన రూ. 76 కోట్లు పోగా విదేశాలనుండి యింకనూ రూ. 630 కోట్లవరకూ సహాయమును పొందవలసియుంటుంది. దీనికి సంబంధించిన యేర్పాట్లు చేయబడవలసియున్నది.

---

4 వ అధ్యాయము

# ఉద్యోగావకాశములు

ఉద్యోగావకాశముల కల్పన సమస్య, అభివృద్ధి కార్యక్రమంలో ఒక భాగమేనన్న విషయం సర్వత్రా అంగీకరించబడుతున్నది. ప్రజలకు చాలినన్ని ఉద్యోగావకాశములను కల్పించవలయునంటే, జాతీయ సాధనసంపదలను సక్రమముగా వినియోగించి, విరివిగా అభివృద్ధి కార్యక్రమాలను అమలు జరుపడం అవసరం.

## నిరుద్యోగ సమస్య

మన దేశంలో నిరుద్యోగ సమస్యను పరిష్కరించుటలో మనము మూడు రకాల వారిని దృష్టిలోకి తీసికొనవలసియుంటుంది. మొదటివారు, పట్టణ ప్రాంతాలందూ, గ్రామీణ ప్రాంతాలందూ ప్రస్తుతమున్న నిరుద్యోగులు; రెండవవారు, జనాభా పెరుగుదల ఫలితముగా ప్రతియేటా కార్మిక బలమునందు క్రొత్తగా చేరేవారు (వీరిసంఖ్య యేడాదికి 20 లక్షల చొప్పున వుంటున్నది); ఇక మూడవవారు, వ్యవసాయము, తదితర వృత్తులందు నియమితులైనప్పటికీ పూర్తిగా పనిపాటులు లేనివారు.

## నిరుద్యోగుల సంఖ్య

ద్వితీయ ప్రణాళిక కాలములో నిరుద్యోగ సమస్యను పూర్తిగా పరిష్కరించవలయునన్న యెన్ని ఉద్యోగావకాశములు కల్పించబడవలయునో దిగువ పట్టికయందు వివరింపబడింది:—

(లక్షలలో)

| | పట్టణ ప్రాంతములందు | గ్రామీణ ప్రాంతములందు | మొత్తము |
|---|---|---|---|
| (1) కార్మిక బలమునందు క్రొత్తగా చేరేవారు | 38 | 62 | 100 |
| (2) ఆదివరకేవున్న నిరుద్యోగులు | 25 | 28 | 53 |
| మొత్తము | 63 | 90 | 153 |

ద్వితీయ ప్రణాళిక కాలములో నిరుద్యోగ సమస్యను పూర్తిగా పరిష్కరించవలయునంటే మొత్తము ఒక కోటీ 53 లక్షల ఉద్యోగావకాశములను కల్పించవలయునన్నమాట. దీనిలో ఉద్యోగావకాశములు అవసరమయ్యే విద్యావంతుల సంఖ్య (దాదాపు 20 లక్షలు) కూడా చేరివున్నది. ప్రస్తుతం దేశంలో విద్యావంతులందు నిరుద్యోగులసంఖ్య దాదాపు 5.5 లక్షలనీ, రానున్న ఐదు సంవత్సరాలలో మరి 14.5 లక్షలమందైనా వుంటారనీ అంచనా వేయబడింది.

## సమస్యా పరిష్కారము

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక నిరుద్యోగ సమస్యను యే విధముగా పరిష్కరించనున్నది?

ప్రభుత్వరంగములో పెద్దపెద్ద పరిశ్రమలనేకం ప్రారంభించబడనున్నాయి. దీనితోబాటు ఆరోగ్యం, విద్య, వైజ్ఞానిక పరిశోధనలు, సాంఘిక సంక్షేమం మొదలయిన ముఖ్యరంగములందుకూడా పెద్ద మొత్తములు ఖర్చుపెట్టబడనున్నవి. ఈ భారీపెట్టుబడుల ఫలితముగా క్రొత్తగా అనేక ఉద్యోగావకాశములు కల్పించబడి, ప్రజల కొనుగోలుశక్తి హెచ్చి నిత్యావసరకం వస్తువులు విరివిగా వుత్పత్తి చేయబడవలసిన అవసరం యేర్పడుతుంది. నిత్యావసరకం వస్తువుల వుత్పత్తి, అనేకమందికి పనిపాటులు కల్పించగల కుటీర పరిశ్రమలు, తదితర చిన్నరకం పరిశ్రమలద్వారా కొనసాగించబడితే గ్రామీణ ఆర్థికవ్యవస్థకు పటిష్ఠత చేకూరుతుంది. ఇట్టి పరిశ్రమలకు ఆర్థిక, సాంకేతిక సహాయములనిచ్చుట ద్వారానూ, పరపతి సౌకర్యాలను, విక్రయ సౌకర్యాలను కల్పించుటద్వారానూ ప్రభుత్వం యథాశక్తి తోడ్పడగలదు.

## నూతన ఉద్యోగావకాశములు

ద్వితీయ ప్రణాళిక కాలములో ప్రభుత్వ, ప్రయివేటు రంగములందు యేర్పడగల ఉద్యోగావకాశముల వివరములు దిగువ పట్టికయందు యివ్వబడినాయి:—

| | | |
|---|---|---|
| | | (లక్షలలో) |
| (1) | నిర్మాణము ... | 21.00 |
| (2) | నీటిపారుదల, విద్యుచ్ఛక్తి ... | 0.51 |
| (3) | రైల్వేలు ... | 2.53 |
| (4) | ఇతర రవాణా, వార్తా సౌకర్యాలు ... | 1.80 |
| (5) | పరిశ్రమలు, ఖనిజముల అభివృద్ధి ... | 7.50 |
| (6) | కుటీర పరిశ్రమలు, తదితర చిన్నరకం పరిశ్రమలు | 4.50 |

(లక్షలలో)

| | | |
|---|---|---|
| (7) | అడవుల అభివృద్ధి, మత్స్యపరిశ్రమ, జాతీయ వికాస కార్యక్రమం, తత్సంబంధిత పథకములు... | 4.13 |
| (8) | విద్య ... | 3.10 |
| (9) | ఆరోగ్యం ... | 1.16 |
| (10) | తదితర సంఘసేవా కార్యక్రమాలు ... | 1.42 |
| (11) | ప్రభుత్వ సర్వీసులు ... | 4.34 |
| | పైవన్నీ కలిసి ... | 51.99 |
| (12) | వాణిజ్యము, వర్తకములతో సహా మిగతా రంగములు ... | 27.04 |
| | మొత్తము ... | 79.03 |

(దాదాపు 80 లక్షలు)

ద్వితీయ ప్రణాళిక కాలములో వ్యవసాయేతర రంగములందు దాదాపు 80 లక్షల వరకూ ఉద్యోగావకాశములు కల్పించబడనున్నాయని పైపట్టిక విశదం చేస్తున్నది. ఇవి గాకుండా బంజరు భూములను సాగుకు యోగ్యం చేయడం, చిన్ననీటిపారుదలపనులు, తోటపనులు మొదలగు కార్యక్రమాలందు మరి 16 లక్షల మందికి పనులు లభించగలవు. గ్రామీణ పరిశ్రమలు, తదితర చిన్నరకం పరిశ్రమలందు తలపెట్టబడిన అభివృద్ధి కార్యక్రమాలవల్ల పూర్తిగా పనిపాటులు లేనివారికి తగిన పనిపాటులు లభించగలవు.

## నిరుద్యోగ విద్యావంతులు

ఇక విద్యావంతులందు నిరుద్యోగుల విషయం తీసికొందాము. ద్వితీయ ప్రణాళిక కాలములో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలచే అమలు జరుపబడనున్న వివిధ రకాల అభివృద్ధి కార్యక్రమాలవల్లనేమి, రానున్న ఐదు సంవత్సరాలలో పదవీ విరమణలవల్ల యేర్పడే ఖాళీలవల్లనేమి దాదాపు 14.4 లక్షలమంది విద్యావంతులకు ఉద్యోగాలు లభించగలవని అంచనా వేయబడింది. వీరు గాకుండా మరి 2.4 లక్షలమందివరకూ చిన్నతరగతి పరిశ్రమలు, సహకార రవాణా సౌకర్యాలు, కృషిశిబిరాలు, తదితర తర్ఫీదు కేంద్రాలందు (వీని నిమిత్తం రూ. 130 కోట్లవరకూ పెట్టుబడి అవసరమౌతుందని అంచనా) తగిన పనులు చూపించబడవచ్చునని ప్రణాళికా సమితిచే నియమింపబడిన పరిశీలనా సంఘము సిఫార్సుచేసింది. విద్యావిధాన సంస్కరణలు, సాంకేతిక తర్ఫీదు సౌకర్యాలు, పాఠశాలలు, కళా

శాలలందు వృత్తి విద్యాసౌకర్యాలకల్పన మొదలగు దీర్ఘకాల చర్యల విషయమై కూడా ఈ పరిశీలనా సంఘం కొన్ని సిఫార్సులను చేసింది.

దేశంలో వెనుకబడిన ప్రాంతాలందు నిరుద్యోగ సమస్యా పరిష్కారమునకు తీసికొనదగిన ప్రత్యేక చర్యల విషయమై కూడా ప్రణాళికలో నొక్కి వక్కాణించబడింది.

ద్వితీయ ప్రణాళిక కాలములో తలపెట్టబడిన అభివృద్ధి కార్యక్రమాలవల్ల నిరుద్యోగ సమస్య పూర్తిగా పరిష్కారం కాజాలదని పై వివరాలనుండి విశద మగుచున్నది. భావి ప్రణాళికలందుకూడా ఈ సమస్య పరిష్కార విషయమై కృషిజరుగవలసియున్నది. ఏది యేమైనా ప్రభుత్వం ఈ విషయమై తన శక్తి వంచన లేకుండా కృషిచేస్తూనే వుండగలదు.

---



5 వ అధ్యాయము

# పరిపాలనా కర్తవ్యాలు, నిర్వహణ

ద్వితీయ ప్రణాళిక అమలు జరిగినకొలదీ, ప్రభుత్వ విధానములకు సంబంధించిన సమస్యలు తగ్గి, పరిపాలన, ఆర్థిక సమస్యలు తలయెత్తవచ్చును. ఈ సమస్యలెట్టివో, వీని పరిష్కార మార్గములు యెట్టివో తెలిసికొందాము.

## పరిపాలనా వ్యవస్థ కర్తవ్యాలు

ద్వితీయ ప్రణాళిక కాలములో పరిపాలనా వ్యవస్థ నిర్వహించవలసిన ముఖ్య కర్తవ్యాలేమో దిగువ వివరింపబడినాయి :—

(1) పరిపాలనలో నిజాయితీ వుండునట్లు శ్రద్ధవహించుట ;

(2) పరిపాలనా సిబ్బంది, సాంకేతిక సిబ్బందుల "కేడర్" (శ్రేణి) లను యేర్పాటు చేయుట ;

(3) భారీయెత్తున తర్ఫీదు కార్యక్రమాలను యేర్పాటుచేయుట, దేశంలోవున్న తర్ఫీదు సౌకర్యాలను సమీకరించుట ;

(4) పనులను నైపుణ్యముతో, యిలాంటి దుబారా సంభవించకుండా నిర్వర్తించుటకు అనువైన విధానములను రూపొందించి, అప్పుడప్పుడు పర్యవేక్షణలను, తనిఖీలను యేర్పాటు చేయుట ;

(5) వ్యవసాయం, సమాజవికాస కార్యక్రమాలు, జాతీయ వికాస కార్యక్రమాలు, గ్రామ పరిశ్రమలు, తదితర చిన్నరకం పరిశ్రమలకు అవసరమైన ఆర్థిక, సాంకేతిక, తదితర సహాయములను సమకూర్చుట ;

(6) వ్యవసాయం, సాంఘిక సేవా కార్యక్రమాలు, ప్రజలకు సన్నిహిత సంబంధముగల తదితర కార్యక్రమాల నిర్వహణలో ప్రజల సహాయ, సహకారములను సాధ్యమైనంత యెక్కువగా సేకరించుట ;

(7) ప్రభుత్వ పరిశ్రమలు, నదీలోయ ప్రాజెక్టులు, రవాణా సౌకర్యాలు మొదలగు భారీ కార్యక్రమాల నిర్వహణ సమగ్రముగా కొనసాగుటకు తగిన వ్యవస్థలను యేర్పాటు చేయుట ;



(8) అవసరమైన సాంకేతిక సిబ్బందినీ, నిర్వహణా సిబ్బందినీ సమకూర్చి, తద్వారా ఆర్థిక వ్యవస్థయందలి సహకార రంగమును పటిష్ఠము చేయుట; సహకార, ఆర్థిక, విక్రయ సౌకర్యాలకు తగిన సంస్థలను యేర్పాటుచేయుట.

పరిపాలనా వ్యవస్థ నిర్వహించవలసిన పనులందు ముఖ్యమైనవి మాత్రమే పైన వివరింపబడినాయి. ఈ కర్తవ్యాల సక్రమ నిర్వహణకు ప్రభుత్వవిధానములు, వివిధ అభివృద్ధి కార్యక్రమాలు సమన్వయపరచబడి అమలు జరుపబడటం యెంతైనా అవసరం.

## అవినీతి నిర్మూలన

పరిపాలనలో అవినీతివల్ల అరిష్టాలు అనేకం సంభవించుతవి. పైగా, ప్రభుత్వంపట్ల ప్రజలకుగల విశ్వాసం సడలిపోయే ప్రమాదమున్నది. పరిపాలనా నిర్వహణలో అవినీతిని సమూలంగా తొలగించడానికి నిర్విరామముగా కృషిజరుగవలసియున్నది. అవినీతికి కారణములు యేమిటో తెలిసికొని, ప్రభుత్వశాఖలందెచ్చటైనా అవినీతి పద్ధతులేమైనా అనుసరించబడుతూవుంటే, వానిని కనిపెట్టి, వానికి బాధ్యులైనవారిపై తగిన చర్యలను తీసికొనే నిమిత్తం కేంద్ర దేశీయ వ్యవహారాల మంత్రిత్వశాఖలో ప్రత్యేకశాఖ యొకటి యేర్పాటుచేయబడింది. రాష్ట్ర ప్రభుత్వాలందూ, ప్రధానప్రభుత్వ పరిశ్రమలందూ ఇట్టి శాఖలు యేర్పాటుచేయబడాలని సిఫార్సు చేయబడింది.

## నైపుణ్యము, పొదుపుల ఆవశ్యకత

ద్వితీయ ప్రణాళిక కాలములో ప్రభుత్వశాఖలు వివిధ అభివృద్ధి కార్యక్రమాల నిమిత్తం పెద్దపెద్ద మొత్తములను ఖర్చుపెట్టవలసి యుంటుంది. ప్రజాధనమును ఖర్చుపెట్టుటలో యెట్టి జాగ్రత్తను తీసికొనవలసిందీ ప్రత్యేకించి చెప్పనవసరంలేదు. ప్రజాధనము యేమాత్రం దుర్వినియోగము గాకుండా, ఆశించిన సత్ఫలితాలను సాధించుటకు ప్రతిశాఖ తగు విధానములను రూపొందించి, అమలు జరుపాలి. ప్రణాళికయందు చేర్చబడిన వివిధ అభివృద్ధి కార్యక్రమాల నిర్వహణలో యేలాంటి దుబారా సంభవించకుండా, సాధ్యమైనంత పొదుపుగా పనులు కొనసాగగలందులకు జాతీయాభివృద్ధి సమితిచే ఇటీవలనే ప్రత్యేక సంఘమొకటి యేర్పాటుచేయబడింది. ఈ సంఘముయొక్క కర్తవ్యాలు దిగువ వివరించబడినాయి :—

(1) కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలచే అమలు జరుపబడుచున్న వివిధప్రాజెక్టులందు దర్యాప్తులను, పరిశీలనలను జరిపించుట ;



(2) ప్రాజెక్టుల నిర్వహణలో యేమాత్రం దుబారా సంభవించకుండా, సమర్థముగా పనులు జరుగుటకు తగిన పద్ధతులను, విధానములను, ప్రమాణములను రూపొందించుట ;

(3) ప్రతి ప్రాజెక్టులో, దాని నిర్వహణకు సంబంధించిన శాఖలందు నిపుణతతో లెక్కల తనిఖీ జరిపించేందుకు తగిన యంత్రాంగమును యేర్పాటు చేయుట ;

(4) ప్రణాళికయందు చేర్చబడిన వివిధ అభివృద్ధి కార్యక్రమాలపై సమర్పించబడే నివేదికలను యెప్పటికప్పుడు పరిశీలించి, వానియందివ్వబడిన సూచనలను అమలు జరుపుట ;

(5) మొత్తంమీద ద్వితీయ ప్రణాళిక నిర్వహణ పొదుపుగానూ, నిపుణతతోనూ, సమర్థముగానూ జరుగుటకు జాతీయాభివృద్ధి సమితిచే చేయబడే ప్రతిపాదనలను అమలు జరుపుట.

## పరిపాలనా సిబ్బంది, నిర్వహణ సిబ్బంది శ్రేణులు

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలములో ప్రభుత్వ పరిపాలనా శాఖలు గురుతరబాధ్యతలనేకం స్వీకరించవలసి యుంటుంది. ఈ అవశ్యకత దృష్ట్యా, ప్రస్తుతమున్న పరిపాలనా సిబ్బంది, నిర్వహణ సిబ్బందులు పటిష్ఠమొనర్చబడాలనీ, అవసరమైనప్పుడల్లా నూతన సిబ్బందిని చేర్చుకొని, ఖాయపు ప్రాతిపదికపై సిబ్బంది శ్రేణులను ("కేడర్") యేర్పాటుచేయాలనీ ప్రణాళికా సమితి సిఫార్సుచేసింది. రాష్ట్రప్రభుత్వాలందు సాంకేతిక సిబ్బంది చాలినంతగా లేనందువల్ల, ఆలిండియా సర్వీసులను, "జాయింట్ కేడర్"లను యేర్పాటుచేసి, వానినుండి అవసరమైన ఉద్యోగులను రాష్ట్రాలకు కేటాయించడం జరగాలని సూచించబడింది. ప్రయివేటు రంగమునకు అవసరమైన నిర్వహణ సిబ్బంది, సాంకేతిక, తదితర ఉద్యోగులను యెప్పటికప్పుడు సమకూర్చడానికి పారిశ్రామిక నిర్వహణ సర్వీసు నొకదానిని యేర్పాటుచేయాలనికూడా నిశ్చయించబడింది.

## తర్ఫీదు సమస్యలు

ప్రణాళిక జయప్రదనిర్వహణకు ఆర్థిక సాధనసంపదలతోబాటు, వివిధ రకాల విద్యలందు తర్ఫీదుపొందిన సిబ్బందికూడా సమృద్ధిగా కావలసియుంటుందని వేరే చెప్పనవసరంలేదు. ప్రణాళికయందు చేర్చబడిన వివిధ అభివృద్ధి కార్యక్రమాలు యేలాంటి అవకతవకలులేకుండా సక్రమంగా, సమర్థముగా అమలు జరుగవలయునంటే యెప్పటికప్పుడు వివిధ రకాల సాంకేతిక సిబ్బంది లభ్యమౌతూవుండాలి. తొలి పంచవర్ష ప్రణాళిక కాలములో ఇంజనీరులు, మెకానిక్కులు, తత్సంబంధిత సిబ్బంది అవసరాలకు తగినట్లుగా లేదని [illegible]ింది.





ఈ విషయం దృష్ట్యా, ద్వితీయ ప్రణాళికలో సాంకేతిక విద్యావ్యాప్తికి రూ. 50 కోట్లు కేటాయించడం జరిగింది. 1960-'61 సం|| (ద్వితీయప్రణాళిక తుది సం.) నాటికి దేశంలో సాంకేతిక విద్యాసంస్థల సంఖ్య 128 నుండి 155 వరకు పెరుగ గలదనీ, ఇంజనీరింగ్ పట్టభద్రుల సంఖ్య 3,600 నుండి 4,500 వరకూ, ఇంజనీరింగ్ డిప్లొమాహోల్డర్ల సంఖ్య 4,900 నుండి 6,500 వరకూ పెంపొందగలదనీ ఆశించబడుచున్నది. వీరుగాకుండా, మెకానిక్కులు, ఫోర్‌మన్‌లు, క్రాఫ్ట్సమన్‌లు మొదలగు వారి తర్ఫీదు నిమిత్తమూ, భూసార రక్షణ, అడవుల అభివృద్ధి, మత్స్య పరిశ్రమ, సహకారసంఘాలు, గ్రామపరిశ్రమలు, చిన్న తరగతి పరిశ్రమల నిర్వహణకు అవసరమైన ఉద్యోగుల తర్ఫీదు నిమిత్తమూ ప్రత్యేక తర్ఫీదు సంస్థలు కొన్ని ప్రారంభించబడనున్నాయి. ఆరోగ్యం, విద్య, పారిశుధ్యము, వ్యవసాయం, జాతీయవికాస కార్యక్రమాలు, సమాజవికాస కార్యక్రమాల నిర్వహణకు అవసరమైన సిబ్బంది తర్ఫీదుకు కూడా తగిన యేర్పాట్లు చేయబడనున్నాయి.

ఇంజనీరింగ్, టెక్నాలజీ, వైద్యంవంటి ముఖ్యరంగములందు ఉన్నతశిక్షణ సౌకర్యాలను కల్పించడానికి బాగా ధనము అవసరమన్న విషయం యెల్లరూ యెరిగినదే. ఇట్టివాని నిమిత్తం క్రొత్త సంస్థలను నెలకొల్పడంకన్న, వున్న సంస్థలనే సాధ్యమైనంతవరకూ విస్తరింపజేయడం మంచిది. అనివార్యములైన పరిస్థితులలో క్రొత్త సంస్థలను నెలకొల్పవచ్చును.

### జిల్లా అభివృద్ధి కార్యక్రమాల నిర్వహణ, పరిపాలన

దేశ పరిపాలనా వ్యవస్థలో మొదటినుండీ జిల్లా ముఖ్యకేంద్రముగా వుంటూ వచ్చింది. జిల్లా పరిపాలనలో అభివృద్ధి కార్యక్రమాలకు క్రమక్రమంగా ప్రాముఖ్యమివ్వబడుతున్నది. ఈ విషయందృష్ట్యా జిల్లా పరిపాలనా వ్యవస్థను పునరేర్పాటు గావించి, సోషలిస్టు సామాజికవ్యవస్థ ఆశయాలకనుగుణముగా తగిన వ్యవస్థను రూపొందించవలసిన ఆవశ్యకత యెంతైనా వున్నది.

తొలి ప్రణాళిక కాలములో దాదాపు రాష్ట్రాలన్నింటిలోనూ జిల్లా అభివృద్ధి (సలహా) సంఘాలనేవి యేర్పాటు చేయబడ్డాయి. ప్రభుత్వ ప్రతినిధులు, అనధికార ప్రముఖులూ సభ్యులుగా గల ఈ సంఘాలు, జిల్లాకు సంబంధించిన అభివృద్ధి కార్యక్రమాలను రూపొందించి, అమలు జరుపుతాయి. జిల్లాలో సుసంఘటితమైన ప్రజాస్వామిక పరిపాలనా వ్యవస్థను యేర్పాటు చేయవలసిన ఆవశ్యకత ఇప్పుడిప్పుడే గుర్తించబడుతున్నది. ఈ వ్యవస్థలో గ్రామ పంచాయితీలకు ముఖ్యమైన పాత్ర వున్నది.

### గ్రామ పంచాయితీలు

ద్వితీయ ప్రణాళిక నిర్వహణలో గ్రామ పంచాయితీలకు ప్రముఖ పాత్ర వున్నది. ...స్థాయిలో అభివృద్ధి కార్యక్రమాలను రూపొందించి, అమలు



జరుపడం; గ్రామీణ ప్రజల సంక్షేమం, భూసంస్కరణలు, భూముల నిర్వహణ మొదలగు విషయాల బాధ్యత గ్రామ పంచాయితీలకే అప్పగించబడింది. గ్రామ పంచాయితీలు తమ విధులను సక్రమముగా, సమర్థముగా నిర్వహించవలయునన్న గ్రామసీమల సరిహద్దులను పునర్విమర్శించి, తగిన సర్దుబాటులను చేయడం యెంతైనా అవసరం. దీనికి తగిన యేర్పాట్లు చేయబడుతున్నాయి. గ్రామ పంచాయితీలు జరిపే కృషిని, సమాజ వికాస కార్యక్రమాలను సన్నిహితం చేయడం మంచిదని సూచించబడింది.

## ప్రజల సహకారం

ప్రజాస్వామిక సూత్రాలకనుగుణముగా అమలు జరుపబడే అభివృద్ధి ప్రణాళికలు జయప్రదం కావలయునంటే ప్రజలు ఉత్సాహంతో ముందుకు వచ్చి, యథాశక్తి తమ సహాయ సహకారములనివ్వడం యెంతైనా అవసరం. తొలి ప్రణాళిక కాలములో ప్రజలు ఉత్సాహంతో యథాశక్తి సహకరించారు. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలోకూడా ప్రజలు స్వయంగా పాల్గొనగల కార్యక్రమాలనేకం చేర్చబడినాయి.

గత మూడు నాలుగు సంవత్సరాలలో స్థానికాభివృద్ధిపనుల పథకం ప్రజలను విశేషంగా ఆకర్షించింది. గ్రామీణ ప్రాంతాల అభివృద్ధికి తలపెట్టబడిన ఈ పథకము, సమాజవికాస, జాతీయవికాస కార్యక్రమాలు ప్రజలనెంతగానో ఆకర్షించాయి. ద్వితీయ ప్రణాళికలో స్థానికాభివృద్ధి కార్యక్రమాల నిమిత్తం రూ. 15 కోట్లు, ప్రజల సహకారమును సమీకరించడానికి ప్రత్యేకముగా రూపొందించబడిన పథకముల నిమిత్తం రూ. 5 కోట్లు ప్రత్యేకించడం జరిగింది. అభివృద్ధి కార్యక్రమాల నిర్వహణలో సామాన్య ప్రజలుకూడా యథాశక్తి పాల్గొనగలందులకై రాష్ట్రప్రణాళికలు జిల్లా, తాలూకా, గ్రామ స్థాయి ప్రణాళికలుగా విభజించబడి, ఆయా స్థాయిలందు అభివృద్ధి సంఘాలు యేర్పాటు చేయబడాలని ప్రణాళికా సమితి సిఫార్సుచేసింది. ఈ సంఘాలు తమ ప్రాంతాలనుండి యెన్నికైన ప్రజాప్రతినిధులను, నిపుణాలను సంప్రదించి, అవసరమైన సలహాలను, సహకారమునూ పొందవచ్చును.

స్థానికాభివృద్ధిపనులు, తదితర గ్రామీణ పునర్నిర్మాణ కార్యక్రమముల నిర్వహణలో భారత సేవక్ సమాజ్, భారత స్కౌట్లు వంటి స్వచ్ఛంద సంస్థల సహాయ, సహకారములను పొందవచ్చును. జాతీయాభ్యుదయ కార్యక్రమములందు యువతీ యువకులుకూడా పాల్గొనగలందులకై నేషనల్ కేడెట్ కోర్, యువజన సంఘాలు కృషిచేస్తున్నవి. శ్రమదానం చేయలేనివారు చిన్న మొత్తాల పొదుపు ఉద్యమమునందు పాల్గొని, ప్రణాళిక నిర్వహణను యథాశక్తి సహాయపడవచ్చును.



ప్రణాళికకు ప్రచారం

ప్రణాళిక జయప్రద నిర్వహణకు, దాని ఆశయములేమో, వివిధ రంగములందు అది సాధించనున్న అభివృద్ధి యెట్టిదో, దానివలన సామాన్యప్రజానీకమునకు కలిగేలాభములెట్టివో మొదలగు విషయాలన్నీ ప్రజలకు చక్కగా తెలిసియుండటం అవసరం. ప్రణాళిక ప్రచారం నిమిత్తం కేంద్రప్రభుత్వము రూ. 7 కోట్లు, రాష్ట్రప్రభుత్వాలు రూ. 6 కోట్లు ప్రత్యేకించాయి. ఈ మొత్తముల సహాయముతో, దేశమందలి ముఖ్యనగరములందు సమాచార కేంద్రాలను యేర్పాటు చేయడం; ప్రణాళికకు సంబంధించిన వివిధ అంశములపై సాహిత్యాన్ని తయారు చేయడం, ఫిలిములను తయారుచేయడం; రేడియో కార్యక్రమాలు, సంచార ప్రదర్శనములద్వారా ప్రచారం సాగించడం; పత్రికలను, పుస్తకాలను ప్రచురించడం మొదలగు పనులు నిర్వహించబడనున్నవి. దాదాపు 72,000 గ్రామాలలో రేడియోసెట్లను నెలకొల్పవలయుననే ఆలోచనకూడా వున్నది. ప్రణాళికకు సంబంధించిన సాహిత్యం ఇంగ్లీషు, హిందీ భాషలలోనే గాకుండా ముఖ్య ప్రాంతీయభాషలందుకూడా ప్రచురించబడనున్నది. ఇవిగాకుండా, ప్రణాళిక ప్రధానలక్ష్యాలను వివరించే "యోజనా" అనే పత్రిక ఇంగ్లీషు, హిందీ భాషలందు ప్రచురించబడనున్నది.

---



6 వ అధ్యాయము

# వ్యవసాయము

తొలి ప్రణాళిక కాలములో ఆహారధాన్యాలు, తదితర ముడివస్తువుల వుత్పత్తిలో విశేషమైన పెరుగుదల సాధించబడింది. ఇంతమాత్రంచేత మనము వ్యవసాయోత్పత్తుల విషయమై ఉపేక్ష జేయడానికి వీలులేదు. జనాభా పెరుగుదల దృష్ట్యానూ, ప్రకృతి సంబంధమైన విపత్తులు యేవైనా సంభవిస్తే వెంటనే అదుకొనవలసిన అవశ్యకత దృష్ట్యానూ వ్యవసాయోత్పత్తి కార్యక్రమం మరికొంత కాలంపాటు నిర్విరామంగా కొనసాగడం యెంతైనా అవసరం. అయితే ధాన్యాల ఉత్పత్తి విషయమై ఇకముందు విశేషమైన ప్రాముఖ్యము యివ్వనవసరం లేదని భావించబడుచున్నది. వ్యవసాయోత్పత్తులందు బహుముఖమైన అభివృద్ధిని సాధించుటయే మన లక్ష్యమై యున్నది.

ద్వితీయ ప్రణాళికలో వ్యవసాయాభివృద్ధి నిమిత్తము మొత్తం రూ. 341 కోట్లు కేటాయించబడింది. సమాజవికాస, జాతీయవికాస కార్యక్రమప్రాంతాలందు వ్యవసాయోత్పత్తులకు కేటాయించబడిన సొమ్ము ఈ మొత్తమందు చేర్చబడలేదు.

ద్వితీయ ప్రణాళిక కాలములో వ్యవసాయోత్పత్తులందు తలపెట్టబడిన లక్ష్యముల వివరములు దిగువ పట్టికయందు యివ్వబడినాయి :—

ఉత్పత్తి లక్ష్యములు

| అంశము | యూనిట్ | 1955–56 లో ఉత్పత్తి | అదనపు ఉత్పత్తి | 1960–61 నాటికి ఉత్పత్తి | వృద్ధి శాతము |
|---|---|---|---|---|---|
| ఆహారధాన్యాలు | లక్షల టన్నులు | 650 | 100 | 750 | 15 |
| నూనెవిత్తులు ... | లక్షల టన్నులు | 55 | 15 | 70 | 27 |
| బెల్లపు చెరకు ... | లక్షల టన్నులు | 58 | 13 | 71 | 22 |
| ప్రత్తి ... | లక్షల బేళ్లు | 42 | 13 | 55 | 31 |
| జనపనార ... | లక్షల బేళ్లు | 40 | 10 | 50 | 25 |
| కొబ్బరి (నూనె) | లక్షల టన్నులు | 1.3 | 0.8 | 2.1 | 62 |
| వక్కలు ... | లక్షల మణుగులు | 22.0 | 5.0 | 27.0 | 23 |
| లక్క ... | లక్షల మణుగులు | 12.0 | 4.0 | 16.0 | 33 |
| పొగాకు ... | లక్షల టన్నులు | 2.5 | — | 2.5 | — |
| మిరియాలు ... | వేల మణుగులు | 26.0 | 6.0 | 32.0 | 23 |
| జీడిపప్పు ... | వేల టన్నులు | 60.0 | 20.0 | 80.0 | 33 |
| తేయాకు ... | లక్షల పౌనులు | 6440 | 560 | 7,0[illegible] | 9 |

పై పట్టికయందు వివరింపబడిన వివిధ లక్ష్యములకు సంబంధించిన సూచీ సంఖ్యలు దిగువ పట్టికయందివ్వబడినాయి (1949-50 సం॥ ప్రాతిపదికగా) :—

| అంశము | | 1950-'51 | 1955-'56 | 1960-'61 |
|---|---|---|---|---|
| ఆహారధాన్యాలు | ... | 91 | 111 | 129 |
| నూనె విత్తులు | ... | 99 | 108 | 137 |
| బెల్లపు చెరకు | ... | 114 | 118 | 144 |
| ప్రత్తి | ... | 106 | 162 | 213 |
| జనపనార | ... | 109 | 136 | 194 |
| ఇతరపంటలు (తోటలతో సహా) | | 105 | 125 | 136 |
| ఆహారేతర ధాన్యాల మొత్తము | | 106 | 121 | 148 |
| అన్నివస్తువులు | ... | 96 | 115 | 135 |

ద్వితీయ ప్రణాళిక అమలు జరిగే కొలదీ నిత్యావసరం వస్తువుల ధరలు పెరిగిపోకుండా అరికట్టడానికి ఆహారధాన్యాలు, తదితర ముడివస్తువుల వుత్పత్తిని పై పట్టికయందు వివరించబడినదానికన్న మరికొంత యెక్కువ చేయాలని తలపెట్టబడింది. వీలైతే ఆహారధాన్యాలను, తదితర ముడివస్తువులను విదేశాలకు యెగుమతిచేసి, తద్వారా విదేశీమారక ద్రవ్యమును సమకూర్చుకొనడానికి కూడా కృషిజరుగవలసియున్నది.

రానున్న ఐదారు సంవత్సరాలలో ఆహారధాన్యాల వుత్పత్తి దాదాపు ఒక కోటి టన్నులమేరకు పెంచబడాలని ప్రణాళిక లక్షిస్తున్నది. ప్రస్తుతం దేశంలో ఒక్కొక్కవ్యక్తి (వయోజనుడు) రోజుకు 17.2 ఔన్సుల ఆహారధాన్యాలను వాడుతున్నాడు. ద్వితీయ ప్రణాళిక ముగియుసరికి ఈ వాడకం 18.3 ఔన్సుల వరకూ పెరుగుతుందని అంచనా. అదేవిధముగా పంచదార వాడకమైతే 1.4 ఔన్సులనుండి ప్రణాళిక ముగియునప్పటికి 1.7 ఔన్సులవరకూ పెరుగగలదని ఆశించబడుచున్నది.

ద్వితీయ ప్రణాళిక కాలములో వ్యవసాయ వుత్పత్తులందు లక్షించబడుచున్న పెరుగుదల దిగువ అభివృద్ధి కార్యక్రమాలద్వారా సాధించబడనున్నది :—

| | | (లక్షల టన్నులు) |
|---|---|---|
| పెద్ద నీటిపారుదల పనులద్వారా | ... | 24 |
| చిన్న నీటిపారుదల పనులద్వారా | ... | 18 |
| ఎరువుల వాడకముద్వారా | ... | 25 |
| మేలుజాతి విత్తనాల వినియోగంద్వారా | ... | 10 |
| బంజరు భూములను బాగుచేయడం, భూముల అభివృద్ధిద్వారా | | 8 |
| వ్యవసాయ పద్ధతులందు అభివృద్ధిద్వారా | ... | 15 |
| మొత్తము | ... | 100.0 |



ఇక నీటిపారుదల సౌకర్యాల విషయం తీసికొందాము. ద్వితీయ ప్రణాళిక కాలములో అదనముగా 210 లక్షల యెకరాల భూమికి—పెద్ద నీటిపారుదల పనులు, మధ్యరకం నీటిపారుదల పనులద్వారా 120 లక్షల యెకరాలకు, చిన్న రకం నీటిపారుదల పనులద్వారా 90 లక్షల యెకరాలకు—నీటిపారుదల సౌకర్యాలు కల్పించాలని తలపెట్టబడింది. రసాయనిక ఎరువుల సప్లయి, 1955 సం॥లో 610,000 టన్నులనుండి 1960 సం॥ నాటికి 18 లక్షల టన్నుల వరకూ పెంపొందించబడాలనీ, పచ్చియెరువుల వాడకం కూడా బాగా ప్రోత్సహించబడాలనీ సంకల్పించబడింది.

రాష్ట్రాల వ్యవసాయాభివృద్ధి పథకములక్రింద, మేలుజాతి విత్తనాల వుత్పత్తి నిమిత్తం 3,000 వ్యవసాయ క్షేత్రాలను (వీని విస్తీర్ణం 93,000 యెకరాలు) ప్రారంభించాలని తలపెట్టబడింది. దేశమందలి ప్రతి వికాస కార్యక్రమప్రాంతమూ ఒక విత్తనాల వుత్పత్తి కేంద్రమును, విత్తనాల స్టోరును కలిగియుండాలి.

ద్వితీయ ప్రణాళిక కాలములో కేంద్ర, రాష్ట్ర ట్రాక్టరు సంస్థలద్వారానూ, తదితర శాఖలద్వారానూ దాదాపు 15 లక్షల యెకరాల బంజరుభూమి సాగుకు యోగ్యము చేయబడాలనీ, 20 లక్షల యెకరాల ప్రాంతములో భూమి అభివృద్ధి పనులు కొనసాగించబడాలనీ నిర్ణయించబడింది.

రాష్ట్రాల వ్యవసాయ ప్రణాళికల క్రింద, ప్రస్తుతమున్న పండ్లతోటలలో 5 లక్షల యెకరాల తోటలను బాగుచేయడానికీ, మరి 2 లక్షల యెకరాల ప్రాంతములో క్రొత్త తోటలను వేయడానికీ కృషి జరుగగలదు. పట్టణప్రాంతాలందు కాయగూరల వుత్పత్తికి, పండ్లతోటల అభివృద్ధికి తగిన ప్రోత్సాహ మివ్వబడగలదు. దీనితోబాటు పుష్టికరములైన ఫలములను, కాయలను వూరవేయడం, వానిని డబ్బాలందు భద్రపరచడానికి సంబంధించిన పరిశ్రమకు కూడా తగిన పోత్సాహమివ్వబడగలదు.

## వ్యవసాయ పరిశోధనలు

ద్వితీయ ప్రణాళికలో వ్యవసాయ పరిశోధనల నిమిత్తం రూ. 14 కోట్లు కేటాయించబడింది. రాష్ట్ర వ్యవసాయ ప్రణాళికలందుకూడా పరిశోధనా కార్యక్రమాలు అనేకం చేర్చబడినాయి. భారత వ్యవసాయ పరిశోధనా సంస్థ, కేంద్ర బంగాళాదుంపల పరిశోధనా సంస్థ, బియ్యపు పరిశోధనా సంస్థ, చెరకు పంట పరిశోధనా సంస్థ, కేంద్ర ప్రభుత్వముచే తదితర వాణిజ్యపంటల నిమిత్తం యేర్పాటుచేయబడిన వివిధసంఘాలుకూడా తమ రంగములందు పరిశోధనా కార్యక్రమాలను రూపొందించాయి. వ్యవసాయమునకు సంబంధించిన ఆర్థికాది విషయాలను గురించి పరిశోధనలను జరిపే మరి రెండు సంస్థలను ప్రారంభించాలని కూడా తలపెట్టబడింది.



## వ్యవసాయ విద్య

ఇటీవలననే బీహారు, రాజస్థాన్, తిరువాంకూర్-కొచ్చిన్ రాష్ట్రములందు ప్రారంభించబడిన వ్యవసాయకళాశాలతో సహా ప్రస్తుతం దేశము మొత్తంమీద 28 వ్యవసాయ కళాశాలలున్నాయి. త్వరలోనే మధ్యప్రదేశ్‌లో మరి రెండు వ్యవసాయ కళాశాలలు ప్రారంభించబడనున్నాయి. ద్వితీయ ప్రణాళిక కాలములో వ్యవసాయాభివృద్ధి కార్యక్రమాలు జయప్రదంగా కొనసాగడానికి అవసరమయ్యే వ్యవసాయ పట్టభద్రులను (కనీసం 6,500 మంది అవసరమౌతారని అంచనా వేయబడింది) ఈ సంస్థలు అందజేయగలవని ఆశించవచ్చును. గ్రామ సేవకుల తర్ఫీదు నిమిత్తం ప్రస్తుతం 54 ప్రాతిపదిక వ్యవసాయ పాఠశాలలు, 44 వికాస కేంద్రాలు నిర్వహించబడుచున్నాయి. ద్వితీయ ప్రణాళిక కాలములో మరి 25 ప్రాతిపదిక వ్యవసాయ పాఠశాలలను, 21 వికాస కేంద్రాలను ప్రారంభించ సంకల్పించబడింది.

## భూసంస్కరణలు

వ్యవసాయాభివృద్ధి కార్యక్రమమందు భూసంస్కరణలకు ముఖ్యమైన పాత్ర వున్నదన్న విషయం అందరికీ తెలిసినదే. తొలి పంచవర్ష ప్రణాళిక కాలములో దాదాపు రాష్ట్రాలన్నింటిలో దళారీల విధానం రద్దుచేయబడింది; కౌలుదార్లకు తగిన భద్రత కల్పించబడింది; కౌలురేట్లు న్యాయమైన స్థాయికి తగ్గించబడినాయి. కౌలుదారులకు యజమానత్వపు హక్కులనిచ్చే విషయంలో మాత్రం అభివృద్ధి ఆశించినంత త్వరగా లేదనియే చెప్పాలి.

తొలి ప్రణాళిక కాలములో కొన్ని రాష్ట్రాలందు మాత్రమే వ్యక్తిగత భూవసతికి గరిష్ట పరిమితిని నిర్ణయించడం జరిగింది. ద్వితీయ ప్రణాళిక కాలములో ఈ విషయమై తీవ్రతరమైన కృషిజరుగగలదు. ఎవరికీ ఒక కుటుంబ కమతానికి మూడురెట్లకు మించిన భూమివుండరాదనీ, కుటుంబ కమతమనేది నిర్ణీత ఆదాయమునిచ్చే లాభసాటి కమతమై యుండాలనీ నిర్ణయించబడింది. ఈ పరిమితి రాష్ట్రాలన్నింటిలోనూ ఒకేవిధముగా వుండాలనే నిర్దేశన లేదు. ప్రాంతీయ పరిస్థితులనుబట్టి ఇది వేరువేరుగా వుండవచ్చును. కుటుంబ కమత మంటే యెంతో ఆయా రాష్ట్రాలకనుగుణముగా నిర్దేశించడానికి ప్రవీణుల సంఘమొకటి నియమించబడాలని సూచించబడింది. నిర్దేశింపబడిన గరిష్ట పరిమితికి మించివుండే భూములు ప్రభుత్వముచే స్వాధీనపరచుకొనబడి (వీనికి న్యాయమైన నష్టపరిహారం చెల్లించబడుతుంది) భూస్వాములచే తొలగించబడిన కౌలుదారులకు, భూవసతిలేని పేదకూలీలకు పంచిపెట్టబడుతవి.

...ళిక కాలములో చిన్నచిన్న భూఖండాలను సుసంఘటితం చేయ ద... ...షిజరిగింది. ఈ విషయంలో ఇంకనూ కృషిజరుగవలసియున్నది.



భూమినిర్వహణచట్టము విషయమైకూడా కొంతకృషి జరిగింది. ప్రారంభములో భూమి నిర్వహణకు సంబంధించిన చట్టమును సమాజ వికాస, జాతీయ వికాస కార్యక్రమ ప్రాంతాలందు ప్రవేశపెట్టాలని ప్రతిపాదించబడింది.

## సహకారోద్యమము

గ్రామీణ ఆర్థిక వ్యవస్థను పునరేర్పాటు గావించి, పటిష్ఠమొనర్చుటలో సహకారోద్యమం యెంతైనా తోడ్పడగలదు. ఈ వుద్యమపు అంతిమ లక్ష్యం, సహకార గ్రామ నిర్వహణ వ్యవస్థయే. ఇట్టి వ్యవస్థలో, వ్యవసాయోత్పత్తులు, గ్రామీణపరిశ్రమలు, వాణిజ్య వర్తకాలు మొదలగునవన్నీ సహకారసంఘాల ద్వారానే కొనసాగింపబడుతూవుంటవి. గ్రామీణ పరపతి, మార్కెటింగ్ సౌకర్యాలను అభివృద్ధిచేయడానికి తగిన చర్యలు తీసికొనబడనున్నాయి. పారిశ్రామిక సహకార సంఘాలు, గృహనిర్మాణ సహకార సంఘాలు, కార్మిక సహకార సంఘాలవంటి ఇతర సహకార సంఘాలు కూడా యేర్పాటు చేయబడాలని సిఫార్సు చేయబడింది.

ద్వితీయ ప్రణాళికలో సహకారోద్యమవ్యాప్తి క్రింద 10,400 పెద్ద తరగతి పరపతి సంఘాలు, 1,800 ప్రాథమిక మార్కెటింగ్ సంఘాలు, 350 గిడ్డంగులు యేర్పాటుచేయబడనున్నాయి. ఇవిగాకుండా, భారీయెత్తు సహకార సంఘాలచే 5,500 గిడ్డంగులు నిర్వహించబడనున్నవి.

## సమాజాభివృద్ధి కార్యక్రమాలు

తొలి ప్రణాళిక కాలములో ప్రారంభించబడిన సమాజ వికాస, జాతీయ వికాస కార్యక్రమాలవల్ల గణనీయమైన సత్ఫలితాలు సాధించబడినాయి. ద్వితీయ ప్రణాళిక ముగియునప్పటికి జాతీయ వికాస కార్యక్రమం దేశవ్యాప్తం చేయబడాలనీ, ఈ కార్యక్రమం అమలు జరిగే ప్రాంతంలో కొంత భాగమందు (దాదాపు 40 శాతము) సమాజ వికాస కార్యక్రమంక్రింద తీవ్రతరమైన అభివృద్ధి జరగాలనీ తలపెట్టబడింది. మొత్తంమీద ద్వితీయ ప్రణాళిక కాలములో అదనముగా 3,800 జాతీయవికాస కార్యక్రమ బ్లాకులు ప్రారంభించబడి, వీనిలో 1,120 బ్లాకులు దరిమిలా సమాజాభివృద్ధి కార్యక్రమ బ్లాకులుగా మార్చబడనున్నాయి. ఈ కార్యక్రమాలకు రూ. 200 కోట్లు ప్రత్యేకించడం జరిగింది.

## పశుపోషణ

ద్వితీయ ప్రణాళికలో పశుపోషణ, పాడిపరిశ్రమల అభివృద్ధికి రూ. 56 కోట్లు కేటాయించబడింది. ఈ మొత్తముతో 1,258 కీలకగ్రామాలు, 245 కృత్రిమ పశూత్పత్తి కేంద్రాలు, 254 వికాసకేంద్రాలు, 1,90[illegible]లలు

ప్రారంభించబడనున్నాయి. పశువులకు తరచుగా వచ్చే దొమ్మవ్యాధి, మొదలగు వ్యాధుల నిర్మూలనకు దేశవ్యాప్తముగా కృషిజరుపబడగలదు.

పట్టణ ప్రాంతాలందు పరిశుభ్రమైన పాలను సప్లయి చేసేందుకు 36 పాల సప్లయి పథకములను, 12 సహకార మీగడ తయారీ కేంద్రాలను, 7 పాలపొడి యంత్రాలను ప్రారంభించాలని సంకల్పించబడింది. మేలుజాతి పశువుల వుత్పత్తిని ప్రోత్సహించే నిమిత్తం ప్రత్యేకంగా కొన్ని ఫారములను యేర్పాటు చేయాలనే ఆలోచనకూడా వున్నది. మేలుజాతి గొర్రెలు, కోళ్ల పెంపకానికి కూడా కొన్ని పథకములు రూపొందించబడ్డాయి. పశుపోషణ, పశూత్పత్తి మొదలగు వానికి సంబంధించిన పరిశోధనలను సాగించే నిమిత్తం కూడా ఒక కార్యక్రమం రూపొందించబడింది.

## అడవులు

ద్వితీయ ప్రణాళికలో అడవుల అభివృద్ధి, భూసార రక్షణ కార్యక్రమాల నిమిత్తం వరుసగా రూ. 27 కోట్లు, రూ. 20 కోట్లు కేటాయించడం జరిగింది. (తొలిప్రణాళికలో ఈ రెండింటికీ కలిపి రూ. 13 కోట్లు మాత్రమే కేటాయించబడింది.) అడవుల అభివృద్ధి, భూసారరక్షణ కార్యక్రమాలందు: (1) ఇటీవలనే ప్రభుత్వ యాజమాన్యము క్రిందికి తీసుకురాబడిన 380,000 యెకరముల తక్కువ తరగతి అడవులను బాగుచేయుట; (2) కాల్వల ఒడ్డున, ముఖ్యమైన రోడ్డుల కిరువైపులా చెట్లనునాటుట; (3) వాణిజ్య రీత్యా ముఖ్యమైన టేకు వంటి చెట్లను 50,000 యెకరముల అడవులందు నాటుట; (4) 13,000 యెకరాలందు నీలితుమ్మబంక చెట్లను నాటుట; (5) దాదాపు 2,000 యెకరాలందు ఔషధములకుపయోగపడే మొక్కలను వేయుట; (6) దాదాపు 50,000 యెకరాలందు అగ్గిపుల్లల తయారీకి పనికివచ్చే కొయ్యనివ్వగల చెట్లను నాటుట (7) అడవి ప్రాంతాలందు దాదాపు 7,400 మైళ్ల నిడివిగల రోడ్లను నిర్మించుట; (8) కలపను బాగుచేశే యంత్రములను నెలకొల్పుట; (9) అరణ్యముల సర్వే జరిపించుట; మొదలగు పనులు చేరివున్నాయి.

అటవీ సంపదకు సంబంధించిన పరిశోధనలను విస్తృతముగా కొనసాగించే నిమిత్తం డేరాడూన్, కోయంబత్తూరు, బెంగుళూర్ సంస్థలు అనేక పథకములను రూపొందించాయి. అడవుల అభివృద్ధి, నిర్వహణ, లెక్కల సేకరణల విషయమై కృషిచేసేందుకు ప్రత్యేక సంఘమొకటి యేర్పాటుచేయబడనున్నది.

## భూసార రక్షణ

ద్వితీయ ప్రణాళిక కాలములో, దాదాపు 30 లక్షల యెకరములకు భూ ... ల్పించుటకు కృషిజరుగనున్నది. భూసార రక్షణకు విరివిగా



అడవులను వేయడం, అడవులందు అగ్నిప్రమాదాలు సంభవించకుండా తగిన జాగ్రత్తలను తీసికొనడం మొదలగు పనులు జరుపబడనున్నవి.

## వ్యవసాయ కార్మికులు

ద్వితీయ ప్రణాళికలో, భూములులేని వ్యవసాయ కార్మికుల పునరుద్ధరణ విషయమై తగిన ప్రాముఖ్యమివ్వబడింది. వీరి పునరుద్ధరణ నిమిత్తం అనేక పథకములు అమలుజరుపబడనున్నాయి. గ్రామీణ ప్రాంతములందలి కుటుంబాలలో దాదాపు 30 శాతము వ్యవసాయ కార్మికులే. భూసవతికి గరిష్ఠ పరిమితిని నిర్ణయించడంవల్ల లభించే భూములు, ఆచార్య వినోబాజీచే భూదానయజ్ఞము క్రింద దానముగా స్వీకరించబడిన భూములు బాగుచేయబడినమీదట వ్యవసాయ కూలీలకు, వారి కుటుంబాలనుబట్టి పంచిపెట్టాలని సంకల్పించబడింది. భూములులేని వ్యవసాయ కార్మికులనందరినీ సహకార సంఘాలుగా యేర్పరిచి, వారికి లాభదాయకములైన పనిపాటులనివ్వగల కుటీర పరిశ్రమలను విరివిగా నెలకొల్పవలయుననే ఆలోచనకూడా వున్నది.

పెక్కు రాష్ట్రాలలో, భూములు లేని వ్యవసాయ కార్మికులకు తగిన భూవసతిని, ఇండ్లస్థలములను కేటాయించడానికి అవసరమైన శాసనములిదివరకే ప్రవేశపెట్టబడినాయి. ఇట్టి వారికి తగిన భూవసతిని, నివేశస్థలాలను సమకూర్చే బాధ్యతను గ్రామస్థులే స్వీకరించాలని ప్రణాళికాసమితి సిఫార్సు చేసింది. కనీస కూలీ చట్టము అమలులో లేని ప్రాంతాలందు అట్టి చట్టమును సాధ్యమైనంత త్వరలో ప్రవేశపెట్టాలనికూడా సిఫార్సు చేయబడింది.

---

## 7 వ అధ్యాయము

# నీటిపారుదల, విద్యుచ్ఛక్తి

ఒక దేశపు ఆర్థికవ్యవస్థ సమగ్ర వికాసానికి, ఆ దేశమందుగల భూమి, జల, విద్యుచ్ఛక్తి సాధనసంపదలు సక్రమంగా వినియోగించబడటం యెంతైనా అవసరం. ఈ అవశ్యకతదృష్ట్యా ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో నీటిపారుదల, విద్యుచ్ఛక్తి కార్యక్రమాలకు ప్రత్యేక ప్రాధాన్యమివ్వబడింది. మనకుగల జల-విద్యుత్సాధన సంపదలందు బహుక్రొద్ది భాగముమాత్రమే పూర్తి వినియోగమునకు తీసికొనిరాబడినవి. వీని సక్రమ వినియోగమునకు సంబంధించిన దర్యాప్తులు యింకా కొనసాగుతూనే వున్నాయి.

### నీటిపారుదల

1950-51 సం॥ నాటికి దేశము మొత్తంమీద నీటిపారుదల సౌకర్యంగల భూమి 5.15 కోట్ల యెకరాలని అంచనా వేయబడింది. దేశము మొత్తంమీద సాగుచేయబడుతున్న భూమిలో ఇది 16 శాతము మాత్రమే. తొలి ప్రణాళిక కాలములో జరిగిన కృషిఫలితముగా మరి 1.63 కోట్ల యెకరాలకు నీటిపారుదల సౌకర్యం కల్పించబడింది.

ద్వితీయ ప్రణాళిక కాలములో, తొలిప్రణాళికక్రింద ప్రారంభించబడి యింకనూ పూర్తికావలసియున్న నీటిపారుదల ప్రాజెక్టులను కొనసాగించుటతో బాటు క్రొత్తగా 195 ప్రాజెక్టులను ప్రారంభించాలని తలపెట్టబడింది. వీనిలో అత్యధికభాగం మధ్యతరగతి, చిన్నతరగతి ప్రాజెక్టులే గాబట్టి, సత్వరముగా ఫలితముల నివ్వగలవని ఆశించబడుచున్నది. ఈ క్రొత్త ప్రాజెక్టుల వల్లగానీ, తొలి ప్రణాళిక కాలములో ప్రారంభించబడి, త్వరలోనే పూర్తిచేయబడనున్న ప్రాజెక్టుల వల్లగానీ మరి 2.1 కోట్ల యెకరాలకు నీటిపారుదల సౌకర్యం లభించగలదు. దేశము మొత్తంమీద సాగుక్రిందవున్న భూమిలో నీటిపారుదల సౌకర్యముగల భూమి 1955-56 సం॥లో 20 శాతమునుండి 1960-61 సం॥నాటికి 27 శాతము వరకైనా పెరుగగలదని ఆశించబడుచున్నది.

ద్వితీయ ప్రణాళిక క్రింద నీటిపారుదల ప్రాజెక్టుల నిమిత్తం రూ. 416 కోట్లు కేటాయించబడింది. ఇది గాకుండా, అదనముగా 3,581 గొట్టపు బావులను నిర్మించడానికి (వీనివల్ల 9,16,000 యెకరాలకు నీటిపారుదల సౌకర్యం లభించగలదు) ప్రత్యేకముగా రూ. 20 కోట్లు కేటాయించడం జరిగింది.

### విద్యుచ్ఛక్తి

1951 సం॥ మార్చినాటికి దేశము మొత్తముమీద గల విద్యుదుత్పాదక యంత్రమ[illegible]క్షల కిలోవాట్లని అంచనా వేయబడింది. తొలిప్రణాళిక



కాలములో అదనముగా 11 లక్షల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి వుత్పత్తికి తగిన యేర్పాట్లుచేయబడి, 3,700 గ్రామాలకు, చిన్నపట్టణాలకు విద్యుద్దీప సౌకర్యం కల్పించబడింది. తలసరి విద్యుచ్ఛక్తి వినియోగము 1950-51 సం॥లో 14 యూనిట్లనుండి 1955-56 సం॥నాటికి 25 యూనిట్లవరకూ పెరిగింది.

ద్వితీయ ప్రణాళిక కాలములో విద్యుచ్ఛక్తి ఉత్పాదకశక్తిని 34 లక్షల కిలోవాట్లనుండి 69 లక్షల కిలోవాట్లకు పెంపొందించాలని తలపెట్టబడింది. ఈ అదనపుశక్తి ప్రభుత్వ, ప్రయివేటు రంగములందు గల హైడ్రో, థర్మల్ ప్లాంటుల ద్వారా సాధించబడవలసియున్నది. ప్రణాళికలో విద్యుదుత్పత్తి కార్యక్రమాల నిమిత్తం ప్రభుత్వరంగమునందు రూ. 427 కోట్లు, ప్రయివేటు రంగమునందు రూ. 42 కోట్లు కేటాయించడం జరిగింది.

ద్వితీయ ప్రణాళిక ముగియునప్పటికి మరి 18,000 గ్రామాలకు, చిన్నచిన్న పట్టణాలకు విద్యుద్దీప సౌకర్యం యేర్పాటుచేయబడగలదు. తలసరి వినియోగము 1960-61 సం॥ నాటికి 50 యూనిట్లవరకు పెరుగగలదని ఆశించబడుచున్నది.

## వరదల నివారణ

ద్వితీయప్రణాళికలో వరదల నివారణకొరకు కూడా కొన్ని పథకములు రూపొందించబడినాయి. ప్రతియేటా వరదలవల్ల కలుగుతూవున్న భీభత్సం, జననష్టం, ఆస్తినష్టములను గురించి అందరికీ తెలిసియేయున్నది. భావిలో ఇలాంటి ప్రమాదాలు రాకుండా అరికట్టేనిమిత్తం 1954 సం॥లో కేంద్ర వరదల నివారణా సంఘమనేది యేర్పాటుచేయబడింది. వివిధ రాష్ట్ర ప్రభుత్వాలచే ప్రతిపాదించబడిన వరదల నివారణ ప్రాజెక్టులను పరిశీలించి, వానిని సమన్వయ పరిచి, దేశముమొత్తమునకు తగిన కార్యక్రమాలను రూపొందించడం ఈ సంఘముచేసే పనులు. వరదల నివారణకు సంబంధించిన వివరాలు ఇంకా సేకరించబడుతున్నాయి. ఈలోగా అత్యవసర ప్రాంతాలందు రక్షణ చర్యలు తీసికొనబడగలవు. ద్వితీయప్రణాళికలో వరదల నివారణ కార్యక్రమాల నిమిత్తం రూ. 60 కోట్లు ప్రత్యేకించబడింది.

## ప్రజల సహకారం

నీటిపారుదల, వరదల నివారణ కార్యక్రమాలందు ప్రజలు స్వయముగా పాల్గొని సహకరించే అవకాశములు అనేకం వున్నాయి. తొలిప్రణాళిక కాలములో ఈ విషయంలో కొంత అనుభవం సంపాదించబడింది. కోసీనది వరదలను అరికట్టడానికి ఆప్రాంతపు ప్రజలు చూపిన ఉత్సాహం, చేసిన కృషి ప్రశంసనీయమైనవి. ద్వితీయప్రణాళికలో మధ్యతరగతి, చిన్నతరగతి నీటిపారుదల పథకములనేకం చేర్చబడినాయి. ప్రజలు యథాశక్తి సహకరించి కృషిచేయడానికివి అనేక అవకాశములనివ్వగలవు.



## 8 వ అధ్యాయము

# పరిశ్రమలు, ఖనిజములు

తొలి పంచవర్ష ప్రణాళిక కాలములో పారిశ్రామిక రంగమందు గణనీయమైన అభివృద్ధి సాధించబడింది. పారిశ్రామికోత్పత్తుల సూచీ సంఖ్య 1950 సం॥లో 105 నుండి (1946 సం॥లో ఇది 100 గా తీసికొనబడింది) 1951 సం॥ నాటికి 117.2 కు; 1952 సం॥ నాటికి 128.9 కి; 1953 సం॥ నాటికి 135.3 కు; 1954 సం॥ నాటికి 146.6 కు; 1955 సం॥ నాటికి 161.5 పెరిగింది. ప్రభుత్వ రంగములో పరిశ్రమలనేకం ప్రారంభించబడి, పూర్తిచేయబడినాయి. తొలిప్రణాళికలో పారిశ్రామికాభివృద్ధికి తలపెట్టబడిన పెట్టుబడి ఆశించినదానికి 40 శాతము మేరకు తగ్గినప్పటికీ, మొత్తంమీద ప్రశంసనీయమైన అభివృద్ధి సాధించబడిందని చెప్పక తప్పదు.

ప్రయివేటు రంగములో క్రొత్త పరిశ్రమలకైతేనేమి, పాతవాని ఆధునికీకరణకైతేనేమి తొలిప్రణాళికలో మొత్తంమీద రూ. 463 కోట్లవరకూ పెట్టుబడి తలపెట్టబడింది. అయితే ప్రణాళిక పూర్తియగునప్పటికీరంగములో మొత్తం రూ. 340 కోట్లవరకూ పెట్టుబడి పెట్టబడిందని ఇటీవలి అంచనాలవల్ల తేలింది.

తొలి ప్రణాళిక కాలములో తలపెట్టబడిన ఉత్పత్తి లక్ష్యములందు కొన్నింటిని—ముఖ్యముగా నూలువస్త్రాలు, పంచదార, వనస్పతి నూనెల విషయంలో—అధిగమించడం జరిగింది. ఇక సిమెంటు, కాగితము, సోడా యాష్, కాస్టిక్ సోడా, తదితర రసాయనిక ద్రవ్యముల వుత్పత్తి లక్ష్యములను చాలావరకు సాధించడం జరిగింది. ప్రయివేటురంగములో అల్యూమినం, నత్రజని యెరువుల వుత్పత్తి, ప్రభుత్వరంగములో లఘు ఇంజినీరింగ్ పరిశ్రమలు—డీజెల్ ఇంజనులు, పంపులు, రేడియోలు, బ్యాటరీలు, ఎలక్ట్రిక్ లాంపులు, మొదలగునవి—వుత్పత్తులందు ఆశించినంతగా అభివృద్ధి సాధించబడలేదనియే చెప్పవలసియున్నది. దేశంలో వీనికి గిరాకీ యెక్కువగా లేనందువల్లనే వుత్పత్తిలక్ష్యాలు సాధించబడలేదని కనుగొనబడింది.

తొలి ప్రణాళిక కాలములో భారీయంత్రాల వుత్పత్తియందేమి, పారిశ్రామిక యంత్రాగారముల నిర్మాణమునందేమి అమూల్యమైన అనుభవం సంపాదించబడింది. ద్వితీయ ప్రణాళిక కాలంలో భారీయంత్రపరిశ్రమల అభివృద్ధికి, తదితర ప్రాతిపదిక పరిశ్రమల [illegible]కీ ఈ అనుభవం యెంతైనా సహాయపడగలదు. నూతన పారి



శ్రామిక విధాన తీర్మానమునందు—దీనినిగురించి రెండవ అధ్యాయమునందు వివరింపబడింది—ప్రభుత్వరంగ విస్తరణ, ప్రాతిపదిక, భారీపరిశ్రమల అభివృద్ధి మొదలగు విషయాలనుగురించి ప్రత్యేకించి ప్రస్తావించబడింది. ద్వితీయ ప్రణాళిక క్రింద పారిశ్రామికాభివృద్ధి కార్యక్రమం ఈ తీర్మానమును అనుసరించియే రూపొందించబడింది. భారీయంత్రముల పరిశ్రమలు, తదితర ప్రాతిపదిక పరిశ్రమల అభివృద్ధి బాధ్యత ప్రభుత్వరంగమే స్వీకరించుతుంది. నిత్యావాడకం వస్తువుల వుత్పత్తి ప్రధానముగా కుటీర పరిశ్రమలు, తదితర చిన్నరకం పరిశ్రమల ద్వారా కొనసాగించబడుతుంది. ఉత్పత్తి వస్తువులు, లఘు ఇంజనీరింగ్, తదితర పరిశ్రమల అభివృద్ధి ప్రయివేటురంగమునకు వదలివేయబడింది.

## ప్రభుత్వరంగము

ఇనుము, ఉక్కు:— ప్రభుత్వరంగమునందు చేపట్టబడనున్న ముఖ్య పరిశ్రమలలో ఇనుము, ఉక్కులకు ప్రత్యేక ప్రాధాన్యమివ్వబడింది. ద్వితీయ ప్రణాళిక కాలములో ఒరిస్సారాష్ట్రములో రూర్కేలావద్ద, మధ్యప్రదేశ్‌రాష్ట్రములో భిలాయ్‌వద్ద, పశ్చిమబెంగాలు రాష్ట్రములో దుర్గాపూర్ వద్ద వరుసగా రూ. 128 కోట్లు, రూ. 110 కోట్లు, రూ. 115 కోట్ల ఖర్చుతో, ఒక్కొక్కటీ పదిలక్షల టన్నుల వుక్కును వుత్పత్తిచేయగల కర్మాగారములు నెలకొల్పబడ నున్నాయి. వీనిలో ఒక కర్మాగారం 350,000 టన్నుల ఇనుమును (ఫౌండ్రీలకు పనికివచ్చే ఇనుము) కూడా వుత్పత్తి చేయడానికి వీలుగా నిర్మించబడగలదు. ఇక మైసూర్‌లో భద్రావతి వద్దనున్న ఇనుము, ఉక్కు కర్మాగారపు వుత్పత్తిశక్తి 100,000 టన్నులకు పెంపొందించబడాలని నిశ్చయించబడింది. పైన వివరింప బడిన మూడు వుక్కుకర్మాగారములకు రూ. 350 కోట్లు, మైసూర్ కర్మాగార మునకు రూ. 6 కోట్లు కేటాయించబడినవి. వీని నిమిత్తం రూ. 75 కోట్లవరకూ విదేశీ సహాయము లభించగలదని ఆశించబడుచున్నది.

## భారీ ఇంజనీరింగ్ పరిశ్రమలు

ద్వితీయ ప్రణాళికలో భారీ ఇంజనీరింగ్ పరిశ్రమల అభివృద్ధికి రూపొందించబడిన కార్యక్రమములో, చిత్తరంజన్ వద్ద భారీ వుక్కు ఫౌండ్రీ నిర్మాణము, మరి మూడు ఫౌండ్రీల నిర్మాణము; జాతీయ పారిశ్రామిక పురోభివృద్ధి సంస్థ ఆధ్వర్యంక్రింద "స్ట్రిక్చరల్ షాపులు", "ఫోర్జెస్" పరిశ్రమలు మొదలగునవి చేరియున్నాయి.

## భారీవిద్యుత్పరికరములు

భారీ విద్యుత్పరికరముల వుత్పత్తికి ఒక బ్రిటిష్‌కంపెనీతో చేసికొనబడిన ఒడంబడిక పూర్తియైనది. వీని నిమిత్తం రూ. 25 కోట్ల ఖర్చుతో ... సొంటు



నిర్మించబడగలదు. ద్వితీయ ప్రణాళిక ముగియులోపలే ఈ ప్లాంటు ట్రాన్సుఫార్మర్లు, మోటార్లు, స్విచ్ గేర్లు, మొదలగు భారీ విద్యుత్పరికరములను వుత్పత్తిచేయగలదని ఆశించబడుచున్నది.

## యంత్ర పరికరములు

హిందుస్తాన్ యంత్రపరికరముల కర్మాగారపు వుత్పత్తిశక్తిని పెంపొందించాలని తలపెట్టబడింది. ఈ కర్మాగారము యికముందు పెద్దసైజు పనిముట్లను, "మిల్లింగ్" యంత్రాలను, "డ్రిల్లింగ్" యంత్రాలనుకూడా వుత్పత్తిచేయగలదు.

రైలు ఇంజెనులు, నౌకలు, రైలుపెట్టెలు :—చిత్తరంజన్ రైలు ఇంజెనుల కర్మాగారపు వుత్పత్తిశక్తి క్రమక్రమంగా పెంపొందించబడనున్నది. ఇక ముందు ఈ కర్మాగారము యేడాదికి 300 రైలు ఇంజెనులను తయారుచేయగలదు. విశాఖపట్టణం వద్దనున్న హిందుస్తాన్ నౌకానిర్మాణకేంద్రము 6 పూర్వపురకపు నౌకలను, 4 క్రొత్తరకపు నౌకలను వుత్పత్తిచేయుటకు వీలుగా విస్తరింపజేయబడనున్నది. ఒక మెట్టరేవును, మరొక నౌకానిర్మాణకేంద్రమును యేర్పాటుచేయాలనే ఆలోచనగూడా వున్నది. ఇక పెరంబూర్ వద్దనున్న ఇంటెగ్రల్ కోచ్ ఫ్యాక్టరీ 1957 సం|| నుండి యేడాదికి 350 రైలుపెట్టెలను వుత్పత్తిచేయగలదు. ఒక "మీటర్ గేజి" రైలుపెట్టెల ఫ్యాక్టరీకూడా నెలకొల్పబడనున్నది.

లిగ్నైటు ప్రాజెక్టు :—దక్షిణార్కాట్ జిల్లాలో నైవెలీ అనుచోట సాలుకు 35 లక్షల టన్నుల లిగ్నైటును వెలికితీయగల బహుళార్థసాధక ప్రాజెక్టు నొకదానిని నెలకొల్పాలని తలపెట్టబడింది.

ఎరువులు :—ద్వితీయప్రణాళిక కాలములో యెరువుల వుత్పత్తిని ఇతోధికముచేయడానికి మరిమూడు క్రొత్తఫ్యాక్టరీలను (ద. ఆర్కాట్ జిల్లాలో ఒకటి నంగల్ వద్ద ఒకటి, రూర్కేలావద్ద మూడవది) నెలకొల్పాలని నిశ్చయించబడింది.

ఇతర పరిశ్రమలు :—ప్రస్తుతం పనిచేస్తున్న డి. డి. టి. ప్లాంటు, ఆంటి-బయోటిక్ ఫ్యాక్టరీ, హిందుస్తాన్ కేబుల్స్ కర్మాగారము, నేషనల్ ఇన్స్ట్రుమెంట్సు ఫ్యాక్టరీ, ఇండియన్ టెలిఫోన్ ఇండస్ట్రీస్ మొదలైనవాని వుత్పత్తిశక్తి ఇతోధికము చేయబడనున్నది. తిరువాంకూర్-కొచ్చిన్ రాష్ట్రములో రెండవ డి. డి. టి. ఫ్యాక్టరీ నెలకొల్పబడనున్నది. సెక్యూరిటీ పేపరు, బాండు పేపరులను తయారుచేసే మిల్లు నొకదానిని నెలకొల్పవలయునని సంకల్పించబడింది.

పైవిగాకుండా, రాష్ట్రప్రభుత్వాలచే అనేక పారిశ్రామిక పథకాలు రూపొందించబడినాయి. జాతీయ పారిశ్రామికాభివృద్ధి సంఘముకూడా విస్తృతమైన [illegible]మును రూపొందించింది.



## ప్రయివేటు రంగము

దేశపు పారిశ్రామికాభివృద్ధి కార్యక్రమంలో ప్రయివేటురంగమునకు ప్రముఖమైన పాత్ర యివ్వబడింది. టాటా ఇనుము ఉక్కు కర్మాగారము, భారతీయ ఇనుము ఉక్కు కంపెనీల ఉత్పత్తిశక్తిని 12.5 లక్షల టన్నులనుండి, 23 లక్షల టన్నులవరకూ పెంపొందించాలని తలపెట్టబడింది. వీనితోబాటు అల్యూమినము, సిమెంటు, మోటారుకారులు, సైకిళ్లు, కుట్టుమిషన్లు, రసాయనిక పదార్థాలు, పేపరు, పేపరుబోర్డు, పంచదార, వనస్పతి నూనెలు, మిల్లుగుడ్డలు, ఔషధాలు మొదలగు పరిశ్రమలందుకూడా విశేషమైన అభివృద్ధి సాధించబడనున్నది.

ద్వితీయ ప్రణాళిక కాలములో ప్రభుత్వ, ప్రయివేటు రంగములందు పారిశ్రామికాభివృద్ధికి తీవ్రమైన, బహుముఖమైన కృషి జరుగనున్నది. కొన్ని ముఖ్య పరిశ్రమల ఉత్పత్తి లక్ష్యములు దిగువ పట్టికయందివ్వబడినాయి :—

| పరిశ్రమ | యూనిట్ | 1955–'56 ఉత్పత్తి శక్తి | 1955–'56 ఉత్పత్తి అంచనా | 1960–'61 (లక్ష్యము) ఉత్పత్తి శక్తి | 1960–'61 (లక్ష్యము) ఉత్పత్తి అంచనా |
|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
| 1. ఇనుము, ఉక్కు | | | | | |
| (ఎ) ఫినిష్డ్‌స్టీల్ | వేల టన్నులు | 1,300 | 1,300 | 4,080 | 4,300 |
| (బి) ఫౌండ్రీలకు తగిన ఇనుము | వేల టన్నులు | 380 | 380 | 980 | 750 |
| 2. యంత్రముల కూర్పు | టన్నులు | 2,26,000 | 1,80,000 | 5,00,000 | 5,00,000 |
| 3. హెవీఫౌండ్రీ, ఫోర్జింగ్ షాపులు | | | | | |
| (ఎ) ఉక్కు ఫౌండ్రీ | టన్నులు | — | — | 15,000 | 15,000 |
| (బి) ఫోర్జింగ్ షాపులు | టన్నులు | — | — | 12,000 | 12,000 |
| (సి) పోతఇనుము ఫౌండ్రీలు | టన్నులు | — | — | 10,000 | 10,000 |

4

| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
|---|---|---|---|---|---|
| 4. ఫెర్రోమాంగనీసు | టన్నులు | 28,000 | సమాచారము లభించలేదు | 1,71,800 | 1,60,000 |
| 5. అల్యూమినము | టన్నులు | 7,500 | 7,500 | 30,000 | 25,000 |
| 6. రైలు ఇంజెనులు | సంఖ్య | 175 | 175 | 400 | 400 |
| 7. మోటారు కారులు | సంఖ్య | 29,000 | 25,000 | 59,000 | 57,000 |
| 8. భారీ రసాయనిక వస్తువులు | | | | | |
| (ఎ) సల్ఫ్యూరిక్ ఆసిడ్ | వేల టన్నులు | 242 | 170 | 500 | 470 |
| (బి) సోడాయాష్ | టన్నులు | 90,000 | 80,000 | 2,53,000 | 2,30,000* |
| (సి) కాస్టిక్ సోడా | టన్నులు | 44,000 | 36,000 | 1,50,000 | 1,35,000* |
| 9. రసాయనిక యెరువులు | | | | | |
| (ఎ) నత్రజని యెరువులు | టన్నులు | 85,000 | 77,000 | 3,82,000 | 2,90,000 |
| (బి) ఫాస్ఫాటిక్ యెరువులు | టన్నులు | 35,000 | 20,000 | 1,20,000 | 1,20,000 |
| 10. నౌకానిర్మాణము | జి. ఆర్. టి. | — | 50,000 1951–'56 | — | 90,000 ('56–'61) |
| 11. సిమెంటు | వేల టన్నులు | 4,930 | 4,600 | 16,000 | 13,000 |
| 12. రిఫ్రాక్టరీలు | టన్నులు | 4,44,000 | 2,80,000 | 10,00,000 | 8,00,000 |
| 13. పెట్రోలియం శుద్ధి | లక్షల టన్నులు | 36.25 | 36 | 43 | 43 |

* ఇది మొత్తపు వుత్పత్తి. దీనిలో కొంతభాగము యితర రసాయనిక పదార్థాల వుత్పత్తికి వినియోగింపబడవలసియున్నది. ఇదిపోగా అమ్మకానికి 1,85,000 టను[illegible]యాష్, 1,06,000 టన్నుల కాస్టిక్ సోడా లభ్యము కాగలదు.



| (1) | (2) | (3) | (4) | (5) | (6) |
|---|---|---|---|---|---|
| 14. పేపరు, పేపర్ బోర్డు | వేల టన్నులు | 210 | 200 | 450 | 350 |
| 15. న్యూస్‌ప్రింటు | టన్నులు | 30,000 | 42,000 | 60,000 | 60,000 |
| 16. రేయాన్ | | | | | |
| (ఎ) రేయాన్ ఫిలమెంటు | లక్షల పౌనులు | 223 | 157 | 683 | 680 |
| (బి) స్టేపుల్ ఫైబర్ | లక్షల పౌనులు | 160 | 132 | 320 | 320 |
| (సి) కెమికల్ పల్ప్ | వేల టన్నులు | — | — | 30.0 | 30.0 |
| 17. డీజెల్ ఇంజెనులు (50 హార్సు పవర్ లోపు) | హార్స్‌పవర్ | 2,00,000 | 1,00,000 | 2,20,000 | 20,05,000 |
| 18. సైకిళ్లు | వేల సంఖ్య | 760 | 550 | 895 | 1,000* |
| 19. ఎలక్ట్రిక్ మోటార్లు (200 హార్సు పవర్ లోపు) | హార్సుపవర్ | 2,63,000 | 2,71,000 | 6,00,000 | 6,00,000 |
| 20. ఎ. సి. యస్. ఆర్. కండక్టర్లు | టన్నులు | 13,370 | 8,730 | 21,570 | 18,000 |

* ఇదిగాకుండా వికేంద్రీకృత రంగమునందు 2,50,000 సైకిళ్లు వుత్పత్తి చేయబడగలవని ఆశించబడుచున్నది. దీనితో సహా సైకిళ్ల మొత్తపు వుత్పత్తి 12,50,000 వరకూ వుంటుంది.

## ఖనిజములు

. బొగ్గు:—ద్వితీయ ప్రణాళికలో పారిశ్రామికాభివృద్ధికి ప్రత్యేక ప్రాముఖ్యత యివ్వబడినందువల్ల దేశంలో ఖనిజముల అభివృద్ధికికూడా విశేషమైన కృషి జరుగవలసియున్నది. పరిశ్రమల—ముఖ్యముగా ఇనుము, వుక్కు పరిశ్రమలు—అభివృద్ధికి అత్యవసరమైన వానిలో బొగ్గు ముఖ్యమైనది. వంటచెరకుగానేమి, ముడి వస్తువుగానేమి బొగ్గుకుగల ప్రాముఖ్యతయెట్టిదో యెల్లరూ యెరిగి[illegible]తీయ ప్రణాళిక కాలములో బొగ్గు వుత్పత్తి ప్రస్తుతపు స్థాయి 380 ల[illegible].

ప్రణాళిక ముగియుసరికి 600 లక్షల టన్నులకు పెంపొందించబడనున్నది. ఈ పెరుగుదలను సాధించడానికి ప్రస్తుతం పనిచేస్తున్న బొగ్గు గనులను అభివృద్ధి చేయడంతో బాటు, క్రొత్తవానిని ప్రారంభించవలసియుంటుంది.

ఉక్కు-కర్మాగారములకు అవసరమైన పరిశుభ్రమైన బొగ్గును యెప్పటికప్పుడు సప్లయిచేసే నిమిత్తం మరికొన్ని "కోల్ వాషరీ"లను నెలకొల్పాలని నిశ్చయించబడింది.

ఇతర ఖనిజములు :—ఇతర ఖనిజములందు ముఖ్యమైనవాని వుత్పత్తి లక్ష్యములు (1960-'61 సం॥కు సంబంధించినవి) దిగువ వివరింపబడినాయి :—

| | | |
|---|---|---|
| ఇనుము | ... | 125 లక్షల టన్నులు |
| మాంగనీసు | ... | 20 లక్షల టన్నులు |
| లైమ్‌స్టోన్ | ... | 233 లక్షల టన్నులు |
| జిప్సమ్ | ... | 197 లక్షల టన్నులు |
| బాక్సైట్ | ... | 1.75 లక్షల టన్నులు |

ప్రారంభములో బొగ్గు, ఖనిజతైలములు మాత్రమే ప్రభుత్వ రంగమునకు ప్రత్యేకించడం జరిగింది. తరువాత నూతన పారిశ్రామిక విధాన తీర్మానము ప్రకారం మరికొన్ని ముఖ్య ఖనిజములు ప్రభుత్వరంగపు పరిశ్రమల పట్టికయందు చేర్చబడినాయి. ప్రభుత్వరంగములో రాగిగనులు, వజ్రపుగనుల త్రవ్వకానికి కూడా తగిన పథకములు రూపొందించబడుతున్నాయి.

నూనె గనులు :—దేశమునందున్న తైల సాధన సంపదల అభివృద్ధికి, అన్వేషణకు ద్వితీయ ప్రణాళిక కాలములో ప్రత్యేక కృషి జరుపబడనున్నది. జ్వాలాముఖి, కాంబే ప్రాంతములందు "డ్రిల్లింగ్" పనులు చురుకుగా కొనసాగించబడుతున్నాయి. ఈ ప్రాంతములందు నూనెగనులున్నాయని కనుగొనబడింది. నూనెగనుల అన్వేషణ, పరిశోధనలను కొనసాగించడానికి అవసరమైన సాంకేతిక సిబ్బందికి మనదేశంలోనూ, విదేశాలలోనూ తర్ఫీదునిచ్చే నిమిత్తం తగిన చర్యలు తీసికొనబడగలవు. ద్వితీయ ప్రణాళికలో నూనెగనుల అన్వేషణ, సాంకేతిక సిబ్బంది తర్ఫీదు కార్యక్రమాల నిమిత్తం రూ. 11.5 కోట్లు కేటాయించబడింది. అవసరమైతే మరికొంత ధనము కేటాయించబడగలదు.

---



## 9 వ అధ్యాయము

# గ్రామపరిశ్రమలు, చిన్నరకం పరిశ్రమలు

ద్వితీయప్రణాళిక ప్రధానలక్ష్యములందు, ప్రజలకు బహుళముగా పనిపాటులను కల్పించడం ఒకటి. చిన్నరకం పరిశ్రమలు, కుటీరపరిశ్రమలు అట్టే ఖర్చు అవసరములేకుండానే గ్రామీణ ప్రాంతాలందు అనేకమందికి చక్కని జీవనోపాధినివ్వగల పనిపాటులను కల్పించగలవన్న విషయం యెల్లరూ యెరిగినదే. అసలు గ్రామీణ ఆర్థికవ్యవస్థ సమగ్రవికాసానికి కుటీరపరిశ్రమలు, తదితర చిన్నరకం పరిశ్రమలు అభివృద్ధిచేయబడటం యెంతైనా అవసరం. ఈ ఆవశ్యకత దృష్ట్యా, ద్వితీయ ప్రణాళికలో గ్రామపరిశ్రమలు, చిన్నరకపు పరిశ్రమల అభివృద్ధికి ప్రత్యేక ప్రాముఖ్యం యివ్వబడిందంటే ఆశ్చర్యంలేదు.

గ్రామీణ ఆర్థికవ్యవస్థ అభివృద్ధిచెందినకొలదీ గ్రామీణ పరిశ్రమలందు ఆధునికపద్ధతులు, ఆధునిక పరికరములు ప్రవేశపెట్టబడి, ప్రజల అవసరాలకనుగుణముగా వస్తూత్పత్తి జరుగుతుంది. చిన్నరకపు పరిశ్రమలు ఒకప్రక్క వ్యవసాయముతోనూ, మరోప్రక్క పెద్దయెత్తు పరిశ్రమలతోనూ సన్నిహితముగా మెలగుతూ అభివృద్ధి గాంచవలసి యుంటుంది.

తొలిప్రణాళిక కాలములో చిన్నరకం పరిశ్రమల అభివృద్ధికి రెండు ముఖ్యచర్యలు తీసికొనబడ్డాయి—(1) చేనేతపరిశ్రమ, ఖాదీపరిశ్రమ, గ్రామపరిశ్రమలు, చేతిపనులు, పట్టుపరిశ్రమ, త్రాటిపరిశ్రమ మొదలగువానికి అఖిల భారత సంస్థలు నెలకొల్పబడటం ; (2) కొన్నిరకముల సరకులను కేవలం గ్రామపరిశ్రమలు, తదితర చిన్నరకం పరిశ్రమల నిమిత్తమే కొనడానికి ప్రభుత్వం నిర్ణయించడం. ఈ రెండు చర్యలవల్ల చేనేత, ఖాదీవంటి ముఖ్య గ్రామపరిశ్రమల వుత్పత్తి ఇతోధికమై, గ్రామీణ ప్రాంతాలందు అనేకమందికి లాభదాయకములైన పనిపాటులు కల్పించబడినాయి.

### గ్రామపరిశ్రమలు, చిన్నరకం పరిశ్రమల సంఘము

గ్రామపరిశ్రమలు, చిన్నరకం పరిశ్రమల అభివృద్ధికి తగిన సూచనలనిచ్చి, ద్వితీయప్రణాళికక్రింద వానినిమిత్తం రూపొందించబడిన కార్యక్రమాలను సమీక్షించే నిమిత్తం ప్రణాళికాసమితిచే 1955 జూన్‌లో నియమింపబడిన ఈ సంఘము (దీనినే కార్వేసంఘమని వ్యవహరించుతారు) కొన్ని పథకములను తయారుచేసింది. చిన్నరకం పరిశ్రమలు విజయవంతముగా నిర్వహించబడటానికి ఈ సంఘము కొన్ని



సిఫార్సులను చేసింది. చిన్నరకం పరిశ్రమలకు కొన్నివస్తువుల వుత్పత్తిని ప్రత్యేకించడం; పెద్దరకం పరిశ్రమలపై సెస్సును విధించి, తద్వారా వసూలైన సొమ్మును చిన్నతరగతి పరిశ్రమల అభివృద్ధికి వినియోగించడం; చిన్నతరగతి పరిశ్రమలకు "సబ్సిడీ"లనివ్వడం; అమ్మకాలపై రిబేట్లనివ్వడం; వీని అభివృద్ధికి అవసరమైన ఆర్థిక, సాంకేతిక, మార్కెటింగ్ సౌకర్యాలను సమకూర్చడం మొదలగునవి కార్వేసంఘము చేసిన సిఫార్సులందు ముఖ్యమైనవి.

కుటీరపరిశ్రమలు, చిన్నరకం పరిశ్రమల అభివృద్ధిపట్ల ప్రభుత్వవిధాన మెట్టిదైయుండాలో నూతన పారిశ్రామిక విధాన తీర్మానమునందు వివరింపబడింది. కుటీరపరిశ్రమలు, చిన్నరకం పరిశ్రమల అభివృద్ధికి, పెద్దతరగతి పరిశ్రమల వుత్పత్తులకు పరిమితులను నిర్దేశించడం, "సబ్సిడీ"లను "రిబేట్ల" నివ్వడం వంటి చర్యలను తీసికొనుటతోబాటు, అవి ఆర్థికముగా స్వయంసమృద్ధతను పొందుటకు ప్రభుత్వం కృషిచేయాలని నూతన పారిశ్రామిక విధాన తీర్మానము నిర్దేశిస్తున్నది. పారిశ్రామిక సహకార సంఘాలు, ముఖ్యముగా వస్తువుల సరఫరా, మార్కెటింగ్ సహకార సంఘాలు విరివిగా నెలకొల్పబడుటకు ప్రభుత్వం తగిన ప్రోత్సాహమునివ్వాలనికూడా పై తీర్మానము నిర్దేశిస్తున్నది.

కేటాయింపులు

ద్వితీయప్రణాళిక క్రింద కుటీర పరిశ్రమలు, చిన్నరకపు పరిశ్రమల అభివృద్ధి నిమిత్తం రూ. 200 కోట్లు కేటాయించబడింది. ఈ మొత్తము యేయే పరిశ్రమలకు యెంతచొప్పున విభజించబడిందీ దిగువ వివరింపబడింది :—

| పరిశ్రమ | | | రూ. కోట్లలో |
|---|---|---|---|
| 1. చేనేతపరిశ్రమ | | | |
| నూలు నేత పరిశ్రమ | ... | ... | 56.0 |
| పట్టు నేత పరిశ్రమ | ... | ... | 1.5 |
| వున్ని నేత పరిశ్రమ | ... | ... | 2.0 |
| | | | 59.5 |
| 2. ఖాదీపరిశ్రమ | | | |
| వున్ని నేత | ... | ... | 1.9 |
| నూలువడకుట, ఖాదీ | ... | ... | 14.8 |
| | | | 16.7 |



| పరిశ్రమ | | | రూ. కోట్లలో |
|---|---|---|---|
| 3. గ్రామ పరిశ్రమలు | | | |
| వడ్లదంపుడు పరిశ్రమ | ... | ... | 5.0 |
| గానుగ నూనె పరిశ్రమ | ... | ... | 6.7 |
| చెప్పులు, తోళ్లపదును పరిశ్రమ | ... | ... | 5.0 |
| బెల్లము, ఖండసారీ పరిశ్రమ | ... | ... | 7.0 |
| నిప్పుపుల్లల (కుటీర) పరిశ్రమ | ... | ... | 1.1 |
| ఇతర గ్రామపరిశ్రమలు | ... | ... | 14.0 |
| | | | 38.8 |
| 4. చేతి పనులు | ... | ... | 9.0 |
| 5. చిన్నరకపు పరిశ్రమలు | ... | ... | 55.0 |
| 6. తదితర పరిశ్రమలు | | | |
| పట్టు పరిశ్రమ | ... | ... | 5.0 |
| త్రాటి పరిశ్రమ | ... | ... | 1.0 |
| 7. సామాన్య పథకములు | | | |
| నిర్వహణ, పరిశోధనలు, వగైరా | | ... | 15.0 |
| | | మొత్తము | 200.0 |

పై కేటాయింపులందు అంబర్ చర్ఖా కార్యక్రమ విషయం చేర్చబడలేదు. ప్రస్తుతం అంబర్ చర్ఖాయొక్క సాధ్యాసాధ్యతలను గురించి పరిశీలనలు జరుప బడుచున్నాయి. ఇవి పూర్తియైన పిదప దీని వ్యాప్తికి తగిన కార్యక్రమం రూపొందించబడి, అవసరమైన సొమ్ము కేటాయింపు జరుగగలదు.

అభివృద్ధి కార్యక్రమాలు

చేనేత, ఖాదీ పరిశ్రమ :—కార్వేసంఘము సమర్పించిన నివేదికప్రకారము చేనేతపరిశ్రమ 1960–'61 సం॥ నాటికి దాదాపు 170 కోట్ల గజముల గుడ్డను వుత్పత్తి చేయవలసియుంటుంది. ఈ లక్ష్యసాధనకు, యింతవరకూ పనిపాటులు లేకుండా వున్న మగ్గములన్నీ పూర్తివినియోగమునకు తేబడుటతో బాటు, క్రొత్త మగ్గములు ప్రవేశపెట్టబడి, అవి ఇతోధికముగా పనిచేయవలసి యుంటుంది. ఒంటి కదురు చరఖాలస్థానే అంబర్ చర్ఖావంటి యెక్కువకదుర్లు [illegible]లు

విరివిగా వుపయోగించబడాలి. అంబర్ చర్ఖాకు సంబంధించిన సాంకేతిక, అర్థికాది విషయాల పరిశీలన జరుగుచున్నది.

<u>గ్రామ పరిశ్రమలు</u> :—గ్రామ పరిశ్రమల అభివృద్ధికి కార్వేసంఘము అనేక సూచనలను చేసింది. ఉదాహరణకు, వడ్లదంపుడు పరిశ్రమ దెబ్బతినకుండా, గ్రామసీమల అవసరాలకు తగినట్లుగా అభివృద్ధి గాంచవలయునంటే, ఇకముందు క్రొత్తమిల్లుల యేర్పాటును నిషేధించాలనేది ఈ సూచనలందొకటి. ఇక గానుగనూనెల పరిశ్రమాభివృద్ధికి, పాతగానుగలస్థానే వార్థాగానుగలు ప్రవేశపెట్టబడాలనీ, నూనెమిల్లుల విస్తరణపై నిషేధం విధించబడాలనీ సూచన చేయబడింది. గ్రామీణ ప్రాంతాలందు అవసరమయ్యే చెప్పులు, తదితర చర్మపు వస్తువుల వుత్పత్తిబాధ్యత కుటీరపరిశ్రమలకే వదలివేయబడాలని కూడా ఒక సూచన చేయబడింది. అలాగే నిప్పుపుల్లలలో అత్యధికభాగం చిన్నతరగతి పరిశ్రమల ద్వారానే వుత్పత్తి చేయబడాలి. తేనెటీగెల పెంపకం, తాటిబెల్లపు తయారీ, చేతికాగితము, సబ్బులతయారీ, నాజూకైన మట్టివస్తువుల తయారీవంటి క్రొత్త గ్రామపరిశ్రమల అభివృద్ధికి కూడా కృషి జరుగవలసియున్నది.

<u>చేతిపనులు</u> :—ఆటవస్తువులు, బొమ్మలు, రాతివస్తువులు, లోహపువస్తువులు, లక్కవస్తువులు మొదలగు చేతిపని వస్తువుల తయారీని అభివృద్ధిచేసి, తద్వారా ప్రజలకు సరసమైన ధరలకు నాణ్యమైన చేతిపనితనం గల వస్తువులను సప్లయిచేయగలందులకై వివిధ రాష్ట్రములందు తర్ఫీదు-ఉత్పత్తి కేంద్రాలు నెలకొల్పబడాలని నిశ్చయించబడింది. అంతర్జాతీయ ప్రఖ్యాతిగల ప్రత్యేక చేతిపని వస్తువుల విక్రయమును పెంపొందించే నిమిత్తం ముఖ్యకేంద్రాలలో ప్రదర్శనశాలలు, విక్రయశాలలు నెలకొల్పబడాలని సంకల్పించబడింది. అంతర్జాతీయ ప్రదర్శనములందు, వేడుకలందు మేలైన చేతిపని వస్తువులు ప్రదర్శించబడుటకు తగిన యేర్పాట్లు చేయబడనున్నాయి.

<u>చిన్నరకపు పరిశ్రమలు</u> :—ఐదులక్షల రూపాయలకు లోపు పెట్టుబడికలిగి, విద్యుచ్ఛక్తిని వుపయోగించేటట్లయితే 50 మందిగానీ అంతకు తక్కువమంది గానీ పనివారలను నియమించే పరిశ్రమలను "చిన్నరకపు పరిశ్రమ"లుగా వ్యవహరించాలని అఖిలభారత చిన్నపరిశ్రమల సంఘము నిర్వచించింది. ఇట్టి పరిశ్రమల అభివృద్ధికి విస్తృతమైన కార్యక్రమమొకటి రూపొందించబడింది. బొంబాయి, కలకత్తా, మద్రాసు, ఢిల్లీ నగరములందు జాతీయ చిన్నపరిశ్రమల సంస్థయొక్క శాఖలను యేర్పాటు చేయాలని తలపెట్టబడింది. చిన్నరకం పరిశ్రమలకు అవసరమైన సాంకేతిక సహాయమునివ్వడానికి ప్రారంభించబడిన సర్వీసు సంస్థలు ప్ర[illegible]కు పనిచేస్తున్నాయి. వీనిని 20 దాకా పెంచాలని నిశ్చయించ



బడింది. చిన్న పరిశ్రమలకు సరసమైన మార్కెటింగ్ సౌకర్యాలు కూడా పెంపొందించబడగలవు.

పారిశ్రామిక యెస్టేటులు :—దేశంలో ముఖ్యప్రాంతాలలో పారిశ్రామిక యెస్టేటులను నెలకొల్పే నిమిత్తం ద్వితీయ ప్రణాళికలో రూ. 10 కోట్లు కేటాయించబడింది. చిన్నరకపు పరిశ్రమల అభివృద్ధికి ఇట్టి యేర్పాట్లు యెంతైనా తోడ్పడగలవు. పరస్పర సంబంధముగల చిన్నరకం పరిశ్రమలు కొన్ని కలసి, తమకు అవసరమైన సౌకర్యాలుగల—మంచిస్థలము, విద్యుచ్ఛక్తి, మంచినీటి సప్లయి, గ్యాసు తదితర సౌకర్యాలు—ప్రాంతాలను యెన్నికచేసికొని, చిన్న చిన్న పారిశ్రామిక యెస్టేటులను యేర్పాటు చేసికొనగలందులకే ఈ పథకము తలపెట్టబడింది. వీని యేర్పాటుకు అవసరమైన ఆర్థిక, తదితర సహాయములను ప్రభుత్వమునుండి పొందవచ్చును.

ప్రాటి పరిశ్రమ :—ఈ పరిశ్రమాభివృద్ధికి కేంద్ర పరిశోధనా సంస్థను నెలకొల్పడానికి, విక్రయసంస్థను యేర్పాటుచేయడానికి, సహకార పద్ధతులపై మార్కెటింగ్ సౌకర్యాలను కల్పించడానికి కృషి జరుగనున్నది.

## కార్యక్రమాల నిర్వహణ

గ్రామ పరిశ్రమలు, తదితర చిన్నరకం పరిశ్రమల అభివృద్ధికి రూపొందించ బడిన వివిధ కార్యక్రమాల సక్రమ నిర్వహణ నిమిత్తం రాష్ట్రములందుగల పరిశ్రమ శాఖలను పటిష్ఠము చేయాలనీ, వివిధ చేతిపనులందు నియమితులైన పనివారలకు తర్ఫీదు కేంద్రాలను యేర్పాటుచేయాలనీ, ప్రణాళికా సమితి నొక్కి-వక్కాణించింది. కేంద్రములో గ్రామపరిశ్రమల నిమిత్తం ఒక ప్రత్యేకమంత్రిత్వ శాఖ యేర్పాటు చేయబడాలనీ, అఖిల భారత సంఘాల ఛేర్మనులు సభ్యులుగాగల సమన్వయ సంఘమొకటి యేర్పాటు చేయబడాలనీ కార్వే సంఘము సిఫార్సు చేసింది.



10 వ అధ్యాయము

# రవాణా, వార్తావాహక సౌకర్యాలు

ఒక దేశపు సర్వతోముఖాభివృద్ధికి చక్కగా సమన్వయపరచబడిన, సమర్థమైన రవాణా సౌకర్యాలుండాలన్నవిషయం యెల్లరూ యెరిగినదే. తొలి పంచవర్ష ప్రణాళిక రూపొందించబడుటకు ముందు యుద్ధకాలంలోనూ, యుద్ధాత్పూర్వమూ దేశమందున్న రవాణా సౌకర్యాలన్నీ చిరకాల వినియోగం వల్ల బాగా దెబ్బతినివున్నాయి. అందువల్ల తొలి ప్రణాళిక కాలములో, ముఖ్యముగా వీని పునరుద్ధరణకే శ్రద్ధవహించవలసి వచ్చినది. ద్వితీయ ప్రణాళిక కాలంలో, తొలిప్రణాళిలో ప్రారంభించబడిన పునరుద్ధరణ కార్యక్రమాలందు పూర్తి గానివానిని కొనసాగించుటతోబాటు, రవాణా సౌకర్యాలన్నీ, ముఖ్యముగా రైల్వేలు విస్తృతము చేయబడనున్నవి. వివిధ రవాణా సౌకర్యాల మధ్య సమన్వయమును పెంపొందించడానికి కూడా కృషి జరుగనున్నది.

ద్వితీయ ప్రణాళిక క్రింద రవాణా, వార్తావాహక సౌకర్యాల నిమిత్తం రూ. 1385 కోట్లు కేటాయించబడింది. ఈ మొత్తము వివిధ అంశములకు యే విధముగా విభజించబడిందీ దిగువ తెలియజేయబడింది:—

| | | (రూ. కోట్లలో) |
|---|---|---|
| రైల్వేలు | ... | 900 |
| రోడ్లు, రోడ్డురవాణా, యాత్రికుల సౌకర్యాలు | ... | 266 |
| "షిప్పింగ్", నౌకాశ్రయములు, లైటు హౌసులు, కాల్వలద్వారా రవాణా | ... | 100 |
| పౌర విమాన యానము | ... | 43 |
| వార్తావాహక సౌకర్యాలు, "బ్రాడ్ కాస్టింగ్" | ... | 76 |
| | మొత్తము | 1385 కోట్లు |



## రైల్వేలు

దాదాపు రూ. 970 కోట్ల పెట్టుబడి, 35,000 మైళ్ల నిడివి మార్గములుగల భారత రైల్వే వ్యవస్థ, ప్రభుత్వఆధ్వర్యముక్రింద నిర్వహించబడుచున్న వ్యవస్థలన్నింటిలోకి పెద్దది. జాతీయ ఆర్థిక వ్యవస్థయొక్క ప్రధానాంగములందు రైల్వేవ్యవస్థ ఒకటియంటే అతిశయోక్తి కాదు. ద్వితీయ ప్రణాళిక కాలములో మన రైల్వేలు ఇతోధికముగా సరకుల రవాణానూ, ప్రయాణీకుల సౌకర్యాలను నిర్వహించవలసి యుంటుంది. తొలిప్రణాళిక కాలములో ప్రారంభించబడిన రైల్వేఆస్తుల పునరుద్ధరణ, ఆధునికీకరణ కార్యక్రమాలు ద్వితీయ ప్రణాళికలో కూడా కొనసాగవలసియుంటుంది. కాగా, ద్వితీయ ప్రణాళికలో పారిశ్రామికోత్పత్తుల అభివృద్ధి, ఆహారధాన్యాలు, తదితర ముడివస్తువుల వుత్పత్తుల పెరుగుదల ఫలితముగా సరకుల రవాణా 1955-'56 సం॥లో 12 కోట్ల టన్నుల నుండి 1960-'61 సం॥ నాటికి 18.1 కోట్ల టన్నులవరకూ పెరుగుతుందని అంచనా. మన రైల్వేలు ఈ అవసరానికి తగినట్లుగా అభివృద్ధి చేయబడవలసిన అవశ్యకత యెంతైనా వున్నది. అయితే, ద్వితీయ ప్రణాళిక క్రింద రైల్వేల అభివృద్ధికి ఇంతవరకు కేటాయించబడిన సొమ్ముతో ఇవి యింత "ట్రాఫిక్కు"ను నిర్వహించలేవనీ, ఇంజెనులు, రైలుపెట్టెలు, వ్యాగనుల విషయములో 10 శాతము, లైనులవిషయంలో 5 శాతము కొరత యేర్పడవచ్చునని భావించబడుచున్నది.

ద్వితీయ ప్రణాళిక కాలములో ప్రయాణీకుల రద్దీని తగ్గించడానికి, ముఖ్యముగా మూడవతరగతి ప్రయాణీకులకు ఇతోధికమైన సౌకర్యాలను కల్పించడానికి తగినచర్యలు తీసికొనబడనున్నాయి. దాదాపు 842 మైళ్ల నిడివిగల నూతనమార్గాలు—వీనిని పారిశ్రామిక ప్రాంతాలందు, అత్యవసరముగా రైలు సౌకర్యం అవసరమైన ప్రాంతాలందు వేయవలసియుంటుంది—నిర్మించడానికి తగిన యేర్పాట్లు చేయబడినాయి.

రైల్వేల అభివృద్ధి కార్యక్రమమునందు లైనులవిస్తరణకు, విద్యుద్దీపముల యేర్పాటుకు, సిగ్నలింగ్ సౌకర్యాల అభివృద్ధికి ప్రత్యేక ప్రాముఖ్యమివ్వబడింది. ద్వితీయ ప్రణాళిక ముగియులోపల 1607 మైళ్ల నిడివిగల రైలు మార్గము "డబుల్ లైన్" మార్గముగాను, 265 మైళ్ల "మీటర్ గేజి" మార్గము, "బ్రాడ్ గేజి" మార్గముగానూ మార్చబడనున్నవి. దాదాపు 826 మైళ్ల మార్గమందు విద్యుద్దీపములు అమర్చబడనున్నాయి. 1293 మైళ్ల నిడివిగల మార్గములందు "డీజెల్" ఇంజెనులను ప్రవేశపెట్టడానికి నిర్ణయం జరిగింది. ప్రయాణీకుల రద్దీ యెక్కువగా వుండే పెద్దపెద్ద రైలుస్టేషన్లవద్ద "ఆటోమేటిక్ సిగ్నలింగ్" యేర్పాట్లు ప్రవేశపెట్టబడనున్నాయి.



ఇక రైలుఇంజనులు, రైలుపెట్టెలు, వ్యాగనుల విషయం. ద్వితీయ ప్రణాళిక కాలములో 2,258 రైలు ఇంజన్లు, 1,07,247 వ్యాగనులు, 11,364 రైలు పెట్టెలు సేకరించబడగలవు. వీనిలో 1352 రైలు ఇంజన్లు, 23,852 వ్యాగనులు, 6,447 రైలుపెట్టెలు, ఆదివరలో దీర్ఘకాలం పనిచేయడంవల్ల అరిగిపోయి, పాత బడిన వానిస్థానే ప్రవేశపెట్టబడనున్నాయి.

రైలు ఇంజన్లు, పెట్టెలు, వ్యాగనుల సంఖ్య పెరిగినకొలదీ వాని నిర్వహణకు అదనముగా షెడ్డులను, వర్క్‌షాపులను నిర్మించవలసియుంటుంది. ప్రస్తుతం పనిచేస్తున్న వర్క్‌షాపులను, షెడ్డులను విస్తృతం చేయడంతోబాటు ద్వితీయ ప్రణాళిక కాలములో క్రొత్తగా మరికొన్ని షెడ్డులు, వర్క్‌షాపులు నెలకొల్ప బడనున్నాయి. మీటర్‌గేజి రైలుపెట్టెలను నిర్మించే కర్మాగారము నొకదానిని నెలకొల్పడానికి, పెరంబూర్ వద్దనున్న "ఇంటెగ్రల్ కోచ్" ఫ్యాక్టరీలో "ఫర్నిషింగ్ యూనిట్"ను నెలకొల్పడానికి కూడా తగిన చర్యలు తీసికొన బడనున్నాయి.

చిత్తరంజన్ రైలు ఇంజనుల కర్మాగారము, "టెల్కో" కర్మాగారముల వుత్పత్తి శక్తి ఇతోధికము చేయబడనున్నది. ప్రస్తుతమీకర్మాగారములు 175 ఇంజనులను వుత్పత్తిచేయుచున్నవి. ఇకముందివి యేడాదికి 400 ఇంజన్లు వుత్పత్తి చేయగలవు. ద్వితీయ ప్రణాళిక కాలములో రైలు ఇంజన్లు, రైలు పెట్టెలు, వ్యాగనుల విషయంలో స్వయంసమృద్ధతను సాధించుటకు ఇతోధిక మైన కృషి జరుగగలదు. ప్రణాళిక ముగియునప్పటికి రైలుపెట్టెల వుత్పత్తి 1260 నుండి 1800 వరకూ, వ్యాగనుల వుత్పత్తి 13,526 నుండి 25,000 వరకూ పెరుగగలదని ఆశించబడుచున్నది.

## రోడ్లు

తొలి పంచవర్ష ప్రణాళిక ప్రారంభమగునప్పటికి దేశంలో 97,000 మైళ్ల నిడివిగల కంకరరోడ్లు, 1,47,000 మైళ్ల నిడివిగల మామూలు రోడ్లు వుండేవి. తొలి ప్రణాళిక ముగియునప్పటికి 10,000 మైళ్ల నిడివిగల మేలైకపు రోడ్లు, 20,000 మైళ్ల నిడివిగల మామూలు రోడ్లు నిర్మించబడటంతోబాటు, మరి 10,000 మైళ్ల నిడివిగల రోడ్లు "అప్‌గ్రేడ్" చేయబడినాయి. ద్వితీయ ప్రణాళికలో రోడ్ల అభివృద్ధి నిమిత్తం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలచే రూ. 246 కోట్లు కేటాయించబడింది. ఇదిగాకుండా, కేంద్ర రోడ్ల నిధినుండి రూ. 25 కోట్లు లభించగలదు. ఈ పెట్టుబడితో నాగపూర్ ప్రణాళిక (దేశంలోని వ్యవసాయ ప్రాంతాలందు గ్రామాలన్నింటికీ 5 మైళ్లలోపల మెయిన్‌రోడ్డు వుండేటట్లు రోడ్ల అభివృద్ధి కార్యక్రమం నిర్వహించబడాలని 1943 సం॥లో రూపొందించబడిన నాగపూర్ ప్రణాళిక నిర్దేశిస్తున్నది) లక్ష్యము చాలవరకు సాధించ[illegible]గలదని చెప్పవచ్చును.



ఇక జాతీయ రహదారుల విషయం. జాతీయ రహదారుల అభివృద్ధికి ద్వితీయ ప్రణాళికలో రూ. 55 కోట్లు ప్రత్యేకించబడింది. తొలి ప్రణాళిక క్రింద ప్రారంభించబడిన పనులను కొనసాగించుటతో బాటు, ద్వితీయ ప్రణాళికలో ముఖ్య రహదారులను కలుపుతూ 600 మైళ్ల నిడివిగల రోడ్లు వేయబడనున్నాయి; 60 పెద్ద వంతెనలు నిర్మించబడనున్నాయి; 1700 మైళ్ల నిడివిగల రోడ్లు బాగుచేయబడనున్నాయి.

తొలి ప్రణాళిక కాలములో కేంద్ర ప్రభుత్వం జాతీయ రహదారులతో బాటు మరికొన్ని ముఖ్యమైన రోడ్లను నిర్మించ ప్రారంభించింది. ఈ పనులు ద్వితీయ ప్రణాళిక కాలములో కూడా కొనసాగింపబడగలవు. వీనిలో ముఖ్యమైనవి, పాస్సి-బద్దార్‌పూర్ రోడ్డు, పశ్చిమకోస్తా రోడ్డు, పఠాన్‌కోటతో పుధాంపూర్‌ను కలుపుతూ యిదివరకేవున్న రోడ్డుతో బాటు మరొక రోడ్డూ, రాష్ట్రాలను కలుపుతూ 1954 సం॥లో ప్రారంభించబడిన ఇతర ముఖ్యమైన రోడ్లు మొదలైనవాని నిర్మాణము కూడా చురుకుగా సాగుతున్నది.

ఇక రాష్ట్రీయ రహదారుల విషయం. ద్వితీయ ప్రణాళికలో రాష్ట్రీయ రహదారుల అభివృద్ధి నిమిత్తం రూ. 164 కోట్లు కేటాయించడం జరిగింది. ఈ సొమ్ముతో దాదాపు 18,000 మైళ్ల నిడివిగల రాష్ట్రీయ రహదారులు నిర్మింపబడనున్నాయి. వివిధ రాష్ట్రములలో జాతీయం చేయబడిన రోడ్డు రవాణా సౌకర్యాల అభివృద్ధి నిమిత్తం రూ. 13.5 కోట్లు (రైల్వేలు వీని నిమిత్తం దాదాపు రూ. 10 కోట్లు ప్రత్యేకించాయి) కేటాయించబడింది. ఢిల్లీనగరపు రవాణాసౌకర్యాల అభివృద్ధి నిమిత్తం రూ. 3 కోట్లు ప్రత్యేకించడం జరిగింది.

ప్రస్తుతం సరకుల రవాణాలో అత్యధిక భాగమూ, ప్రయాణీకుల రవాణా సౌకర్యాలలో దాదాపు మూడుపాళ్లూ ప్రయివేటు కంపెనీల చేతులలోనే వున్నాయి. ప్రయాణీకుల రవాణా సౌకర్యాలు క్రమక్రమంగా జాతీయం చేయబడాలనీ, సరకుల రవాణా మాత్రం మరికొంత కాలం ప్రయివేటు కంపెనీల చేతులలోనే వుండవచ్చునని ప్రణాళికా సమితి సిఫార్సు చేసింది.

## యాత్రీకుల సౌకర్యాలు

దేశంలో చూడదగిన ప్రాంతాలకు యాత్రలను ప్రోత్సహించే నిమిత్తం యాత్రీకులకు అవసరమైన సౌకర్యాలను—వసతి, రవాణా సౌకర్యాలు, వినోద కాలక్షేపములు, ముఖ్యస్థలాలకు సంబంధించిన సాహిత్యం సప్లయి మొదలైనవి—కల్పించడానికి ద్వితీయ ప్రణాళికలో ఒక కార్యక్రమం రూపొందించబడింది.

## నౌకా నిర్మాణము

తొలి ప్రణాళిక ప్రారంభమగునప్పటికి దేశములోని నౌకల టన్నేజి మొత్తము దాదాపు 3,90,000 గా వున్నది. తొలి ప్రణాళికలో [illegible]న్నేజిని

ఆరులక్షలదాకా పెంచడానికి కృషిజరిగింది. ద్వితీయ ప్రణాళిక కాలములో దీనిని మరి మూడులక్షల టన్నుల మేరకు అధికం చేయ తలపెట్టబడింది. ఈ ప్రణాళికలో నౌకా నిర్మాణాభివృద్ధికి కేటాయించబడిన మొత్తం రూ. 45 కోట్లలో (ప్రయివేటు కంపెనీలు దాదాపు రూ. 10 కోట్ల వరకూ పెట్టుబడి పెట్టగలవు) రూ. 20 కోట్లు ఈస్టరన్ షిప్పింగ్ కార్పొరేషన్‌కు పెట్టుబడిగానూ, మిగతాది మరొక కార్పొరేషన్‌ను నెలకొల్పడానికీ, కొంతభాగం ప్రయివేటు కంపెనీల విస్తరణకు వినియోగించబడగలదు.

## ఓడరేవులు, నౌకాశ్రయములు

ఓడరేవులు, నౌకాశ్రయముల అభివృద్ధికి తొలి ప్రణాళికలో ప్రారంభించ బడిన ముఖ్యమైన పనులను కొనసాగించుటతోబాటు, ద్వితీయ ప్రణాళికలో పారిశ్రామికాభివృద్ధి ఫలితముగా యేర్పడనున్న అవసరాలను తీర్చగలందులకై నౌకాశ్రయములను, ఓడరేవులను ఇతోధికముగా విస్తరింపజేసి, ఆధునిక పరికరాలను అమర్చడం జరుగుతుంది. పెద్దపెద్ద నౌకాశ్రయాల అభివృద్ధి నిమిత్తం ద్వితీయ ప్రణాళికలో రూ. 40 కోట్లు ప్రత్యేకించబడింది. చిన్న ఓడ రేవుల నిమిత్తమైతే రూ. 5 కోట్లు ప్రత్యేకించబడింది. ఈ కార్యక్రమంక్రింద పారాదీప్, మంగుళూర్, మాల్పే, ట్యూటికోరిన్ మొదలగు చిన్న రేవులు అభివృద్ధి చేయబడగలవు. లైటుహౌసుల నిర్మాణానికి, వున్నవానికి ఆధునిక పరికరములను అమర్చడానికి కూడా ప్రణాళికలో కొంత సొమ్ము ప్రత్యేకించ బడింది.

## జలమార్గాల అభివృద్ధి

ద్వితీయ ప్రణాళికలో దేశంలోని జలమార్గాల అభివృద్ధికి రూ. 3 కోట్లు కేటాయించబడింది. ఈ మొత్తములో బకింగ్‌హామ్ కాలువ అభివృద్ధికి రూ. 115 లక్షలు, పశ్చిమకోస్తా కాలువల అభివృద్ధికి రూ. 43 లక్షలు వ్యయము చేయబడగలదు. మిగతా సొమ్ము గంగా, బ్రహ్మపుత్రా నదీప్రాంతపు జలమార్గాల అభివృద్ధికి (దీని నిమిత్తం ప్రత్యేక సంఘమొకటి తొలి ప్రణాళిక కాలములోనే నెలకొల్పబడింది) వినియోగింపబడగలదు.

## పౌరవిమానయానము

ద్వితీయ ప్రణాళికలో పౌర విమాన యాన సౌకర్యాల అభివృద్ధికి రూ. 12.5 కోట్లు, విమాన యాన కార్పొరేషనుల అభివృద్ధి నిమిత్తం రూ. 30.5 కోట్లు కేటాయించబడినది.

ద్వితీయ ప్రణాళిక కాలములో నూతనముగా యెనిమిది విమానాశ్రయములు నిర్మించబడనున్నాయి. ఈ విమానాశ్రయములవద్ద రేడియో కమ్యూనికేషన్ సౌక[illegible] తదితర ఆధునిక సౌకర్యాలు యేర్పాటు చేయబడగలవు. విమాన



యాన కార్పొరేషనులకు "ఆపరేషనల్" సౌకర్యాల నిమిత్తం త్వరలోనే మరి కొన్ని విమానాలు ఖరీదు చేయబడనున్నాయి.

వార్తా సౌకర్యాలు

ద్వితీయ ప్రణాళికలో వార్తావాహక సౌకర్యాల అభివృద్ధి కార్యక్రమం క్రింద 20,000 క్రొత్తపోస్టాఫీసులు, 1,400 టెలిగ్రాఫ్ ఆఫీసులు, 1,200 "పబ్లిక్ కాల్" ఆఫీసులు ప్రారంభించబడి, 1,80,000 టెలిఫోనులు యేర్పాటు చేయబడనున్నాయి. దేశంలో ట్రంకు టెలిఫోను సౌకర్యాల విస్తరణకు కూడా ఒక కార్యక్రమం రూపొందించబడింది. బొంబాయి, ఢిల్లీ, కలకత్తాలనూ, ఢిల్లీ, అమృత్‌సర్‌లనూ, అంబాలా, సిమ్లాలనూ, ఠాణా, పూనాలనూ కలుపుతూ "అండర్‌గ్రౌండ్ కేబుల్లు" యేర్పాటుకు సంబంధించిన పనులు త్వరలోనే ప్రారంభించబడనున్నాయి.

బ్రాడ్‌కాస్టింగ్

తొలి ప్రణాళికలో బ్రాడ్ కాస్టింగ్ సౌకర్యాల అభివృద్ధికి ప్రశంసనీయమైన కృషి జరిగింది. ప్రతిభాషా ప్రాంతానికీ ఒక రేడియో స్టేషను యేర్పాటు చేయబడి, దేశంలోని సమస్తప్రాంతాల ప్రజలకు రేడియో శ్రవణసౌకర్యం కల్పించబడింది.

ఇక ద్వితీయ ప్రణాళికలో, క్రొత్తగా రేడియో స్టేషనులను యేర్పాటుచేయడానికిగాకుండా, ప్రస్తుతం పనిచేస్తున్న స్టేషనుల విస్తరణకు ప్రత్యేక ప్రాముఖ్యమివ్వబడింది. దేశంలోని భాషాప్రాంతాలన్నింటికీ ప్రసార సౌకర్యాలను ఇతోధికం చేయడానికి కొన్ని ముఖ్యప్రాంతాలందు "షార్ట్ వేవ్ ట్రాన్సుమిటర్"లు నెలకొల్పబడనున్నాయి. ఢిల్లీ రేడియో కేంద్రములో నిర్వహించబడే జాతీయ కార్యక్రమాలను వినే సౌకర్యం యావద్దేశానికీ కల్పించే నిమిత్తం ఢిల్లీవద్ద మరొక 100 కిలోవాట్ "షార్ట్ వేవ్ ట్రాన్సుమిటర్", 100 కిలోవాట్ "మీడియం వేవ్ ట్రాన్సుమిటర్"లు యేర్పాటుచేయబడనున్నాయి. వీనితోబాటు కలకత్తా, బొంబాయి, మద్రాసు రేడియో స్టేషనులవద్ద అదనముగా 50 కిలోవాట్ "షార్ట్ వేవ్ ట్రాన్సుమిటర్"లు నెలకొల్పబడగలవు. ఇక, విదేశాలలో నివశించే భారతీయులకు ఇతోధికముగా రేడియో కార్యక్రమ శ్రవణసౌకర్యాలను కల్పించే నిమిత్తం ఢిల్లీవద్ద మరిరెండు 100 కిలోవాట్ "షార్ట్ వేవ్ ట్రాన్సుమిటర్"లు యేర్పాటుచేయబడనున్నవి.

మన దేశంలో టెలివిజను సౌకర్యం విషయమై కూడా కొంత కృషి జరుగనున్నది. తరువాత, గ్రామీణప్రజలందు రేడియో కార్యక్రమాలపట్ల ఉత్సాహమును పెంపొందించు నిమిత్తం, వేయికిమించి జనాభా గల గ్రామాలకు కమ్యూనిటీ రిసీవర్లు సప్లయిచేయబడనున్నవి.

11 వ అధ్యాయము

# విద్య, వైజ్ఞానిక పరిశోధనలు

ఒక దేశపు సర్వతోముఖాభివృద్ధికి రూపొందించబడే ప్రణాళికలందు విద్యాభివృద్ధికి, వైజ్ఞానిక పరిశోధనలకు ప్రత్యేక ప్రాముఖ్యమునివ్వడం యెంతైనా అవసరం.

తొలి ప్రణాళికలో విద్యాభివృద్ధి కార్యక్రమాల నిమిత్తం రూ. 169 కోట్లు కేటాయించబడగా, ద్వితీయ ప్రణాళికలో వీని నిమిత్తం రూ. 307 కోట్లు కేటాయించడం జరిగింది. ఈ మొత్తములు యేయే రంగములకు యెంతచొప్పున ప్రత్యేకించబడిందీ దిగువ వివరించడమైనది :—

| | తొలి ప్రణాళిక (రూ. కోట్లలో) | ద్వితీయ ప్రణాళిక (రూ. కోట్లలో) |
|---|---|---|
| ప్రాథమిక విద్య ... | 93 | 89 |
| మాధ్యమిక విద్య ... | 22 | 51 |
| యూనివర్సిటీ విద్య ... | 15 | 57 |
| సాంకేతిక, వృత్తి సంబంధ విద్యలు | 23 | 48 |
| సాంఘిక విద్య ... | 5 | 5 |
| వివిధ విద్యాభివృద్ధి కార్యక్రమాల నిర్వహణ, తదితరములు ... | 11 | 57 |
| మొత్తము ... | 169 | 307 |

ద్వితీయ ప్రణాళికలో విద్యాభివృద్ధి కార్యక్రమాలకు కేటాయించబడిన మొత్తము, తొలి ప్రణాళికలో వీని నిమిత్తం కేటాయించబడినదానికి దాదాపు రెట్టింపని పైపట్టిక విశదంచేస్తున్నది.

## ప్రాథమిక విద్య

ద్వితీయ ప్రణాళిక ముగియునప్పటికి, 6–11 సం॥ వయస్సుగల బాలబాలికలందు 63 శాతమునకు, 11–14 సం॥ వయస్సుగల బాలబాలికలందు 23 శాతమునకు విద్యాసౌకర్యాలు కల్పించబడగలవు. ఈ లక్ష్యసాధనకు క్రొత్తగా 53,000 ప్రా[illegible] (జూనియర్) పాఠశాలలు, 3,500 "మిడిల్" (సీనియర్) పాఠశాలలు



ప్రారంభించబడగలవు. వీనిలో 28,400 పాఠశాలలు ప్రాతిపదిక విద్యా పాఠశాలలై యుండగలవు.

మాధ్యమిక విద్య

మాధ్యమిక విద్యా కమీషన్ చేసిన సిఫార్సుల ప్రకారం, మాధ్యమిక విద్యను పునరేర్పాటుగావించే కార్యక్రమం తొలి ప్రణాళిక కాలములోనే ప్రారంభించబడింది. ద్వితీయ ప్రణాళిక కాలములో ఈ కార్యక్రమం మరింత చురుకుగా కొనసాగింపబడగలదు. విద్యార్థుల విభిన్న అభిరుచులకు అనుగుణముగా వివిధ రకాల కోర్సులను నిర్వహించే బహుళార్థ సాధక పాఠశాలలు ప్రస్తుతం 250 మాత్రమే వున్నాయి. ద్వితీయ ప్రణాళిక ముగియులోపల వీని సంఖ్య 1187 వరకూ పెంపొందగలదు. వీనితోబాటు 1200 సామాన్య పాఠశాలలు హైయర్-సెకండరీ పాఠశాలలుగా మార్చబడనున్నాయి. ఇక విద్యార్థుల సంఖ్యయైతే 1955-'56 సం॥లో 23 లక్షలనుండి 1960-'61 సం॥ నాటికి 31 లక్షలవరకూ పెరుగగలదని ఆశించబడుచున్నది.

వ్యవసాయ విద్య

మాధ్యమిక విద్యా పాఠశాలలందు వ్యవసాయవిద్యకు కూడా తగిన ప్రాముఖ్యమివ్వబడాలనే సూచనకు అనుగుణముగా గ్రామీణ మాధ్యమిక పాఠశాలలందు 200 వ్యవసాయ కోర్సులను యేర్పాటు చేయాలని తలపెట్టబడింది. మాధ్యమిక విద్యను పూర్తిచేసిన తరువాత వ్యవసాయేతర వృత్తులందు జీవనోపాధిని సంపాదించుకొన కోరికగల విద్యార్థుల సౌకర్యార్థం 90 జూనియర్ టెక్నికల్ పాఠశాలలు ప్రారంభించబడనున్నాయి.

యూనివర్సిటీ విద్య

ద్వితీయ ప్రణాళికలో యూనివర్సిటీ విద్య నిమిత్తము రూ. 57 కోట్లు ప్రత్యేకించబడింది. ఈ సొమ్ము, యూనివర్సిటీ విద్యాప్రమాణములను పెంపొందించడానికీ, ఇతోధికముగా సాంకేతిక, వైజ్ఞానిక కోర్సులను ప్రారంభించడానికీ వినియోగింపబడగలదు.

సాంకేతిక విద్య

ద్వితీయ ప్రణాళిక క్రింద అమలు జరుగనున్న వివిధ అభివృద్ధి కార్యక్రమాల కొరకు సాంకేతిక విద్యాప్రవీణులు, తదితర సిబ్బంది విశేషంగా అవసరమౌతారు. ఇట్టివారిని విరివిగా తయారుచేసే నిమిత్తం దేశపు ఉత్తర, పశ్చిమ, దక్షిణ ప్రాంతాలందు మూడు ఉన్నత సాంకేతిక విద్యాసంస్థలను ప్రారంభించడానికి తగిన యేర్పాట్లు జరుగుతున్నాయి. మనకు ఫోర్మన్ల కొరత కూడా మిక్కుటముగా నున్నది. ఈ కొరతను తీర్చడానికి ముఖ్యపరిశ్రమల సహకారముతో ఫోర్మన్ల తర్ఫీదు నిమిత్తం విస్తృతమైన స్కీము యొకటి తలపెట్టబడింది. సాంకేతిక విద్యా





బోధకుల నిమిత్తం "రిఫ్రెషర్ కోర్సులు" యేర్పాటుచేయబడనున్నాయి. తరువాత "ప్రింటింగ్ టెక్నాలజీ"లో శిక్షణనిచ్చే సంస్థకూడా ప్రారంభించబడనున్నది. ధన్‌బాద్‌వద్దనున్న "ఇండియన్ స్కూల్ ఆఫ్ మైన్స్", "ఇండియన్ స్కూల్ ఆఫ్ అప్లయిడ్ జియాలజీ" సంస్థలను విస్తృతపరచి, "మైనింగ్ ఇంజనీరింగ్", తత్సంబంధిత విషయములందు అదనపు తర్ఫీదు సౌకర్యాలను కల్పించడానికి తగిన యేర్పాట్లు జరుగుతున్నాయి. ఈ విధముగా మొత్తంమీద ఇంజనీరింగ్ సంస్థలసంఖ్య 1955-'56 సం॥లో 128 నుండి, ద్వితీయ ప్రణాళిక ముగియుసరికి 158 వరకూ పెరుగగలదనీ; పోస్టుగ్రాడ్యుయేట్ రిసర్చికోర్సులందు 570 మంది, డిగ్రీకోర్సులందు 7,550 మందీ, డిప్లొమా కోర్సులందు 11,300 మందీ, జూనియర్ టెక్నికల్ పాఠశాలలందు 5,400 మందీ చేర్చుకొనబడగలరనీ ఆశించబడుచున్నది.

## సాంఘిక విద్య

ప్రజల ఆర్థిక, సాంఘిక అభ్యుదయమునకు సాంఘిక విద్యావ్యాప్తి యెంతైనా తోడ్పడగలదు. ద్వితీయ ప్రణాళికలో సాంఘిక విద్యావ్యాప్తి నిమిత్తం చేర్చబడిన పథకములందు, అక్షరజ్ఞాన కేంద్రాలను, సాంఘికవిద్యా కేంద్రాలను ప్రారంభించడం; సాంఘికవిద్యా కార్యకర్తల తర్ఫీదుకు తగిన సౌకర్యాలను యేర్పాటు చేయడం; సాంఘికవిద్యను బోధించే పుస్తకములను, కరపత్రములను విరివిగా ప్రచురించడం; దృశ్య-శ్రవణ విద్యా పరికరముల సహాయముతో వయోజన విద్యావ్యాప్తికి కృషిచేయడం; జనతా కళాశాలలను, పుస్తకాలయములను ప్రారంభించడం మొదలగునవి చేరివున్నాయి.

సాంఘికవిద్యలో వున్నతశిక్షణనిచ్చే గ్రామీణ సంస్థలను పదింటిని ప్రారంభించాలని నిర్ణయించబడింది. ఇక, మంచి తెలివితేటలున్నప్పటికీ ధనాభావమువల్ల ఉన్నత సాంఘికవిద్యాభ్యాసమునకు పోజాలని విద్యార్థులకు స్కాలర్‌షిప్పులు అనేకం యేర్పాటు చేయబడినాయి. దేశమందలి వివిధ భాషల అభివృద్ధికీ, సంగీతము, చిత్రలేఖనం మొదలగు లలితకళల అభివృద్ధికీ, తదితర సాంస్కృతిక కార్యకలాపములకూ తగినచర్యలు తీసికొనబడనున్నాయి.

ఉపాధ్యాయుల తర్ఫీదు సౌకర్యాలను, వారి జీతములను పెంచడానికి కూడా ద్వితీయ ప్రణాళికక్రింద తగిన యేర్పాట్లు చేయబడనున్నాయి. ప్రాథమికోపాధ్యాయుల జీతాల పెంపుదలవల్ల యేర్పడే అదనపుఖర్చులో సగభాగము వరకూ కేంద్ర ప్రభుత్వమే భరించగలదు.

## వైజ్ఞానిక పరిశోధనలు

తొలి ప్రణాళిక కాలములో దేశమందు వివిధ ప్రాంతాలలో జాతీయ పరిశోధనా శాలలనూ, తదితర పరిశోధనా సంస్థలనూ నెలకొల్పడానికి విశే



షంగా కృషిజరిగింది. ఇక ద్వితీయ ప్రణాళిక కాలములో పరిశోధనా సౌకర్యాలను విస్తృతం చేయడానికీ; జాతీయ పరిశోధనాశాలలందు నియమితులైన పరిశోధకుల కృషినీ, వివిధ విశ్వవిద్యాలయములందు, తదితర పరిశోధనా సంస్థలందూ నియమితులైనవారి కృషినీ సమన్వయపరిచి, వీని ఫలితాలను దేశాభ్యుదయమునకు సద్వినియోగం చేయడానికీ విశేషమైన కృషి జరుగనున్నది. ఈ కార్యక్రమ నిర్వహణలో ప్రణాళికా సమితికి తోడ్పడే నిమిత్తం ఇటీవలనే విజ్ఞాన శాస్త్రవేత్తల సంఘమొకటి నియమింపబడింది.

వైజ్ఞానిక, పారిశ్రామిక పరిశోధనా సమితి ఆధ్వర్యముక్రింద జరుగనున్న వివిధ పరిశోధనల నిమిత్తం ద్వితీయ ప్రణాళికలో రూ. 20 కోట్లు ప్రత్యేకించబడింది. ఈ సమితి తొలిప్రణాళిక కాలములో వైజ్ఞానిక, సాంకేతిక పరిశోధనలనేకం జరిపించింది. ద్వితీయ ప్రణాళిక కాలములో వాయుశక్తి, ఔషధముల తయారీకి పనికివచ్చే మొక్కల విషయమై విస్తృతముగా పరిశోధనలను సాగించే పరిశోధనా కేంద్రాలను నెలకొల్పవలయునని తలపెట్టబడింది. ఇనుము కరిగించుటలో "కోకింగ్" బొగ్గుకు బదులు "నాన్-కోకింగ్" బొగ్గును వుపయోగించుటకుగల సాధ్యాసాధ్యతలను గురించి పరిశీలనలు జరుపబడనున్నాయి. ఇవి గాకుండా, ఆధునిక వైజ్ఞానిక, సాంకేతిక, ఇంజనీరింగ్ విషయాలను గురించి కూడా పరిశోధనలు విరివిగా కొనసాగింపబడనున్నాయి.

అణుశక్తిశాఖ నిర్వహించనున్న పరిశోధలకు ద్వితీయ ప్రణాళికలో కొంత సొమ్ము కేటాయించబడింది. భారత వైజ్ఞానిక సంస్థ, బోస్ పరిశోధనా సంస్థ, "బొటానికల్", "జూవలాజికల్", "జియలాజికల్" సర్వేశాఖలు కొనసాగించనున్న పరిశోధనలకుకూడా తగినయేర్పాట్లు చేయబడినాయి.

ప్రజలకు శాస్త్రవిజ్ఞాన విషయాలను అందజేసి, తద్వారా వారిలో వైజ్ఞానిక దృక్పథమును పెంపొందించడానికి కృషిచేసే ఇండియన్ సైన్సు కాంగ్రెసు, నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్సెస్ వంటి సంస్థలకు విరివిగా గ్రాంటులు యివ్వ జడగలవు.

గ్రామీణ ప్రాంతాలందు 90 మొదలు 100 వరకు విజ్ఞానమందిరాలు నెలకొల్పబడుటకు తగినయేర్పాట్లు చేయబడనున్నాయి. ఈ సంస్థలు, గ్రామీణులకు శాస్త్రవిజ్ఞాన విషయాలను, నిత్యజీవితములో వాని ప్రాముఖ్యతను బోధించి, వారినిమిత్తం అమలుజరుపబడుచున్న వ్యవసాయ, ఆరోగ్య, పారిశుధ్య కార్యక్రమాలనుండి వారు ఇతోధికమైన ప్రయోజనాలను పొందుటకు తోడ్పడగలవు.

తూనికలు, కొలతల ప్రమాణీకరణ విధానమునందు తొలిచర్యగా, ద్వితీయ ప్రణాళిక కాలములో దశాంశనాణెములు ప్రవేశపెట్టబడి, క్రమంగా వ్యాప్తికి తీసికొనిరాబడగలవు.

---



12 వ అధ్యాయము

# సాంఘిక సంక్షేమ కార్యక్రమాలు

ప్రజల సర్వతోముఖాభ్యుదయమునందు సాంఘిక సంక్షేమ కార్యక్రమాలకు గల ప్రాముఖ్యత యెట్టిదో యెల్లరూ యెరిగినదే. ద్వితీయ ప్రణాళికలో సాంఘిక సంక్షేమ కార్యక్రమాల నిమిత్తం రూ. 635 కోట్లు కేటాయించడం జరిగింది. విద్యాభివృద్ధి కార్యక్రమాల నిమిత్తం ప్రత్యేకించబడిన సొమ్ము ఈ మొత్తమందు చేర్చబడలేదు. తొలి ప్రణాళికలో కేటాయించబడిన మొత్తమునకు ఇది రెట్టింపు అయినప్పటికీ మన అవసరాల దృష్ట్యా యిది తక్కువేనని చెప్పవలసి యున్నది. అయినా, వివిధ రాష్ట్రప్రభుత్వాలు సాంఘిక సంక్షేమం నిమిత్తం జరుపనున్న కృషి, అధికార, అనధికార సంస్థలు, వ్యక్తుల కృషికి తోడైతే ఈ రంగమునందు గణనీయమైన అభివృద్ధిని సాధించగలమని ఆశించవచ్చును.

## ఆరోగ్యము

ద్వితీయ ప్రణాళికలో చేర్చబడిన ఆరోగ్యాభివృద్ధి కార్యక్రమాలక్రింద, ప్రస్తుతమున్న ఆరోగ్యసౌకర్యాలను సామాన్యప్రజానీకానికి అందుబాటులోకి వచ్చునట్లు విస్తృతంచేసి, తద్వారా జాతీయ ఆరోగ్యస్థాయిని క్రమంగా పెంపొందించడానికి కృషి జరుగగలదు. ఆరోగ్య కార్యక్రమాల నిమిత్తం ద్వితీయప్రణాళికలో రూ. 274 కోట్లు కేటాయించడం (తొలి ప్రణాళికలోనైతే రూ. 140 కోట్లు) జరిగింది. ఈ మొత్తములో రూ. 43 కోట్లు ఆసుపత్రుల సౌకర్యాలను అభివృద్ధి చేయడానికి వినియోగించబడగలదు. 1951 సంIIలో దేశమందున్న ఆసుపత్రులు, వానియందున్న మంచాలసంఖ్య, 1955-'56 సంII నాటికి సాధించబడిన అభివృద్ధి, 1960-'61 సంII (ద్వితీయ ప్రణాళిక ముగియునప్పటికి) నాటికి ఆశించబడుచున్న అభివృద్ధి మొదలగు వివరాలు దిగువపట్టికయందివ్వబడినాయి :—

| | 1951 | 1955-'56 | అభివృద్ధి శాతము | 1960-'61 | 1955-'56 సంII దరిమిలా అభివృద్ధి (శాతము) |
|---|---|---|---|---|---|
| వైద్యశాలల సంఖ్య | 8,600 | 10,000 | 16 | 12,600 | 26 |
| మంచముల సంఖ్య | 1,13,000 | 1,25,000 | 10 | 1,55,000 | 24 |



ద్వితీయ ప్రణాళిక కాలములో గ్రామీణ ప్రాంతాల ప్రజలకు తగిన వైద్య, చికిత్సా సౌకర్యాలను కల్పించు విషయమై ప్రత్యేకశ్రద్ధ తీసికొనబడనున్నది. ఈ కార్యక్రమం నిమిత్తం రూ. 23 కోట్లు ప్రత్యేకించడం జరిగింది. ఈ మొత్తములో గ్రామీణ వికాస కార్యక్రమ ప్రాంతాలందు 3,000 ఆరోగ్యకేంద్రాలు నెలకొల్పబడనున్నాయి.

## తర్ఫీదు సౌకర్యాలు

వైద్యసిబ్బందికి తర్ఫీదు సౌకర్యాలు విస్తరింపజేయబడనున్నాయి. వైద్య కళాశాలల సంఖ్య 1950-'51 సం॥లో 30 నుండి, తొలిప్రణాళిక ముగియునప్పటికి 42 వరకూ పెరిగింది. ప్రస్తుతమున్న వైద్యవిద్యా తర్ఫీదు సౌకర్యాలవల్ల యేడాదికి 2.500 డాక్టర్లవంతున తయారౌతున్నారు. మన అవసరాల దృష్ట్యా ఇది తక్కువేనని చెప్పాలి. దేశంలో సామాన్య ప్రజానీకమునకు కూడా వైద్య సౌకర్యాలు లభించవలయునన్న కనీసం యెంత వైద్యసిబ్బంది కావలయునో, ద్వితీయ ప్రణాళిక కాలములో ఈ అవసరాలు యెంతవరకు తీర్చబడనున్నవో మొదలగు వివరాలు దిగువపట్టికయందివ్వబడినాయి :—

| వైద్య సిబ్బంది | 1950-'51 | 1955-'56 | 1960-'61 | అవసరమైన సిబ్బంది సంఖ్య |
|---|---|---|---|---|
| డాక్టరులు ... | 59,000 | 70,000 | 82,500 | 90 000 |
| నర్సులు ... | 17,000 | 22,000 | 31,000 | 80.000 |
| మంత్రసానులు ... | 18,000 | 26,000 | 32,000 | 80,000 |
| హెల్తు విజిటర్లు... | 600 | 800 | 2,500 | 20,000 |
| దాయిలు, నర్సు-దాయిలు ... | 4,000 | 6,000 | 41,000 | 80,000 |
| హెల్తు అసిస్టెంట్లు, శానిటరీ ఇన్‌స్పెక్టర్లు ... | 3,500 | 4,000 | 7,000 | 20,000 |

దేశంలో ప్రస్తుతమున్న వైద్యకళాశాలలను విస్తరింపజేసి, క్రొత్త కళాశాలలను ప్రారంభించడానికి రూ. 26.5 కోట్లు ప్రత్యేకించబడింది. వీనితో బాటు, నర్సులు, మంత్రసానులు, ఫార్మశిస్టులు, శానిటరీ ఇన్‌స్పెక్టర్లు, తదితర వైద్యసిబ్బందిని విరివిగా తయారుచేయడానికి కూడా తగిన తర్ఫీదు సౌకర్యాలు యేర్పాటు చేయబడనున్నాయి.

మలేరియా, బోదకాలు, క్షయ, కుష్టువంటి అంటువ్యాధులను అరికట్టడానికి తొలి ప్రణాళిక కాలములో ప్రారంభించబడిన కృషి, ద్వితీయ ప్రణాళిక



కాలములో తీవ్రతరముగా కొనసాగించబడగలదు. మలేరియా వ్యాధిని అరికట్టే నిమిత్తం, 200 కంట్రోలు యూనిట్లు యేర్పాటు చేయబడనున్నాయి. ఇక క్షయ వ్యాధి నిరోధక కార్యక్రమంక్రింద బి. సి. జి. టీకాల వుద్యమం దేశవ్యాప్తము చేయబడనున్నది; దాదాపు 200 క్షయవ్యాధి చికిత్సాకేంద్రాలు నెలకొల్పబడనున్నాయి.

ఇక మంచినీటి సరఫరా, పారిశుధ్యముల విషయానికి వద్దాము. పట్టణ ప్రాంతముల మంచినీటి సరఫరా, పారిశుధ్య అభివృద్ధి కార్యక్రమాలకు రూ. 53 కోట్లు ; గ్రామీణప్రాంతపు మంచినీటి సరఫరా, పారిశుధ్య కార్యక్రమాలకు రూ. 28 కోట్లు, కార్పొరేషనులకు రూ. 10 కోట్లు కేటాయించడం జరిగింది.

ద్వితీయ ప్రణాళికలో ఆరోగ్యాభివృద్ధి కార్యక్రమాలందు పైన వివరింపబడిన పథకములతోబాటు, దేశీయవైద్యవిధానములకు ప్రోత్సాహమిచ్చుట ; ప్రసూతి, శిశుపోషణ, పారిశ్రామిక ఆరోగ్య పరిస్థితులు మొదలగువానిని గురించి పరిశోధనలను జరిపించుట ; కుటుంబ నియంత్రణం మొదలగువానికి సంబంధించిన పథకాలు కూడా వున్నాయి. కుటుంబ నియంత్రణ కార్యక్రమము నిమిత్తం ప్రణాళికలో రూ. 5 కోట్లు ప్రత్యేకించబడింది. ఈ మొత్తముతో పట్టణప్రాంతములందు 300 కుటుంబ నియంత్రణ కేంద్రాలు, గ్రామీణ ప్రాంతములందు 2,000 కేంద్రాలు ప్రారంభించబడనున్నాయి.

## గృహవసతి

దేశములో, ముఖ్యముగా పట్టణప్రాంతాలందు గృహవసతి కొరత మిక్కుటముగానున్నది. ద్వితీయ ప్రపంచ యుద్ధము, దేశవిభజనలవల్ల గృహవసతి పరిస్థితి మరీ విషమించింది. ఈ కొరతను తగ్గించడానికి తొలి పంచవర్ష ప్రణాళిక కాలములో కొంత కృషి జరిగింది. తొలి ప్రణాళికలో పట్టణప్రాంతాలందు దాదాపు 13 లక్షల గృహాలైనా నిర్మించబడియుంటాయనీ, ద్వితీయ ప్రణాళిక కాలములో పట్టణప్రాంతాలందు కనీసం మరి 19 లక్షల గృహాలైనా నిర్మించబడాలని అంచనా వేయబడింది.

పట్టణ ప్రాంత, గ్రామీణ ప్రాంత గృహనిర్మాణమును ప్లానుల ప్రకారం దశలవారీగా కొనసాగించాలనీ, ప్రతి రాష్ట్ర ప్రభుత్వమూ ఈ విషయమై శ్రద్ధ వహించి, తగిన కార్యక్రమాలను రూపొందించాలనీ ప్రణాళికా సమితి సూచించింది. పెద్ద పెద్ద పట్టణాలందుండే మురికిపేటలను తొలగించి, అందు నివసించే పేదప్రజల నిమిత్తం శుభ్రమైన, వాసయోగ్యమైన చిన్నచిన్న గృహాలను నిర్మించడానికి తగిన చర్యలు తీసికొనబడవలసియున్నది. దేశంలోని ముఖ్య నగరాలు, పట్టణాల అభివృద్ధి నిమిత్తం “మాస్టర్ ప్లానులు” తయారుచేయబడాలి.



గ్రామీణ ప్రాంతములందు ప్రస్తుతమున్న 5.4 కోట్ల గృహములలో అత్యధికభాగము బాగుచేయబడుటయో, తిరిగి నిర్మించబడుటయో జరుగవలసియున్నది. ప్రతిగ్రామమూ నిర్దిష్టమైన ప్లాను ప్రకారం పునర్నిర్మించబడి, విశాలములైన వీథులతోనూ, బారులు తీర్చిన గృహములతోనూ, మురుగునీటి పారుదల సౌకర్యాలతోనూ, బాలబాలికల నిమిత్తం చక్కని పాఠశాల, ఆటస్థలములతోనూ, పదిమంది కలసి గ్రామీణ సమస్యలనుగురించి చర్చించేందుకు, వేడుకలకు వుపయోగపడే సమాజ కేంద్రములతోనూ విలసిల్లాలి. ప్రతి రాష్ట్ర ప్రభుత్వమూ, గ్రామీణ గృహనిర్మాణమునకు సంబంధించిన ప్లానులను, ఇండ్ల డిజైనులను తయారుచేసి, గృహనిర్మాణ సామగ్రి విషయమై సలహాలనిచ్చే చిన్న సాంకేతిక శాఖను యేర్పాటు చేయడం మంచిది.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో గృహనిర్మాణము నిమిత్తం రూ. 120 కోట్లు కేటాయించబడింది. ఈ మొత్తము, పారిశ్రామిక గృహనిర్మాణము, తక్కువ ఆదాయములుగల సామాన్య ప్రజలకు గృహావసతి, మురికిపేటల తొలగింపు, ఊడ్చేవారికి గృహావసతి, తోట కార్మికులకు గృహావసతి, మధ్యతరగతి ప్రజలకు గృహావసతి మొదలగు పథకముల నిమిత్తం వినియోగించబడగలదు.

## వెనుకబడిన వర్గాల సంక్షేమం

వెనుకబడిన వర్గాల సంక్షేమ కార్యక్రమాల నిమిత్తం ద్వితీయ ప్రణాళికలో రూ. 91 కోట్లు కేటాయించబడింది. (తొలిప్రణాళికలోనైతే రూ. 39 కోట్లు మాత్రమే ప్రత్యేకించడం జరిగింది.) ఈ మొత్తము (రూ. 91 కోట్లు)లో రూ. 47 కోట్లు షెడ్యూల్డు జాతుల సంక్షేమ కార్యక్రమాలకు, రూ. 27.5 కోట్లు షెడ్యూల్డు కులాల సంక్షేమ కార్యక్రమాలకూ, రూ. 9.7 కోట్లు ఇతర వెనుకబడిన వర్గాలవారికీ, రూ. 3.9 కోట్లు మాజీ–నేరస్థ జాతుల సంక్షేమమునకూ, మిగతా రూ. 2.9 కోట్లు కార్యక్రమాల నిర్వహణకూ వినియోగించబడనున్నది. వీనితోబాటు, వెనుకబడిన వర్గాలు నివసించే ప్రాంతాలందు రహదారి, వార్తా సౌకర్యాల యేర్పాటు, వైద్యసహాయం, విద్య, గృహావసతి, మంచినీటి సరఫరా మొదలగువాని కల్పనకు కూడా కొన్ని పథకములు రూపొందించబడినాయి.

ఆదిమ జాతుల సంక్షేమ కార్యక్రమాలను రూపొందించునప్పుడు, వారి సంస్కృతి, సాంప్రదాయములను, వారి సాంఘిక, ఆర్థిక, మానసిక సమస్యలను సరిగా అర్థముచేసికొని, తదనుగుణముగా వ్యవహరించవలసియుంటుంది. ఈ కార్యక్రమాలను అమలు జరుపుటలో వారి విశ్వాసమును, ముఖ్యముగా వారి పెద్దల సుహృద్భావములను చూరగొనడం యెంతైనా అవసరం. ఆదిమజాతి విద్యార్థులకు విరివిగా స్కాలర్‌షిప్పులు, తదితర ఉపకార వేతనాలు యివ్వబడుతున్నాయి. వారిలో అస్పృశ్యతను తొలగించి, ఋణములపాలై బాధపడుతున్న వారికీ,



అదనముగా మరీ హీనస్థితియందున్న వారికీ తగినసహాయము నిచ్చి, వారికి తగిన ఆదాయము నివ్వగల కుటీర పరిశ్రమలను పెంపొందింపజేయడానికి కృషి జరుగ వలసియున్నది. కేంద్ర విద్యామంత్రిత్వశాఖ ద్వితీయ ప్రణాళిక కాలములో వెనుకబడిన వర్గాల విద్యార్థుల నిమిత్తం 2,32,000 స్కాలర్‌షిప్పులను మంజూరు చేసింది.

## సాంఘిక సంక్షేమం

తొలి ప్రణాళిక కాలములో సాంఘిక సంక్షేమ కార్యకలాపముల నిర్వహణ నిమిత్తం కేంద్ర ప్రభుత్వముచే, కేంద్ర సాంఘిక సంక్షేమ సంఘమనేది నెలకొల్పబడింది. ఈ సంఘము, పతిత స్త్రీలు, బిడ్డలు, అశక్తులు, బాలనేరస్థుల నిమిత్తం సంక్షేమ కార్యక్రమాలను రూపొందించి, నిర్వహించే స్వచ్ఛంద సంస్థలకు ఆవసరమైన సహాయ, సహకారములనిస్తూ వుంటుంది. రాష్ట్రస్థాయిలో కూడా ఇట్టి సంక్షేమ సంఘములు యేర్పాటు చేయబడ్డాయి. ఈ సంఘము లన్నీ కలిసి, ద్వితీయ ప్రణాళిక కాలములో దేశవ్యాప్తముగా సంక్షేమ కార్య క్రమాలను నిర్వహించగలవని ఆశించబడుచున్నది.

ద్వితీయ ప్రణాళికలో సాంఘిక సంక్షేమ కార్యక్రమాల నిమిత్తం రూ. 29 కోట్లు (కేంద్ర ప్రభుత్వముచే అమలు జరుపబడే సంక్షేమ కార్య క్రమాలకు రూ. 19 కోట్లు ; రాష్ట్రప్రభుత్వాల కార్యక్రమాలకు రూ. 10 కోట్లు) కేటాయించబడింది. ఈ మొత్తములు, సంక్షేమ విస్తరణ ప్రాజెక్టులకు, స్వచ్ఛంద సంక్షేమ సంస్థలకు, పతిత స్త్రీలు, బాలనేరస్థులు, బిచ్చగాండ్ర పున రుద్ధరణ కార్యక్రమాలకు గ్రాంటులనివ్వడానికి వినియోగించబడగలవు. యువజన సంక్షేమ కార్యక్రమాలకు, మానసికముగానూ, శారీరకముగానూ అశక్తులైన వారి యోగక్షేమములకు రూ. 11 కోట్లు ప్రత్యేకించడమైనది.

## కార్మిక సంక్షేమం, తర్ఫీదు

ద్వితీయ ప్రణాళికలో కార్మిక సంక్షేమం, కార్మిక తర్ఫీదు కార్యక్రమాల నిమిత్తం రూ. 29 కోట్లు కేటాయించబడింది. ఈ మొత్తములో రూ. 18 కోట్లు కేంద్ర ప్రభుత్వము అమలు జరిపే పథకాలకు, మిగతా 11 కోట్లు రాష్ట్ర ప్రభుత్వ పథకాలకు వినియోగించబడనున్నవి. ఈ పథకములందు ముఖ్యమైనవి, కార్మికులకు ఇతోధికముగా తర్ఫీదుసౌకర్యాలను యేర్పాటుచేయుట; 120 క్రొత్త యెంప్లాయిమెంటు యెక్స్చేంజీలను ప్రారంభించుట; ప్రస్తుతమున్న వానిని పటిష్ఠము చేయుట మొదలగువానికి సంబంధించినవి. "అప్రెంటిస్‌షిప్" పథకముక్రింద, బోధకులను, సాంకేతిక నిపుణులను తయారు చేయుటతోబాటు, పనివారలకు వివిధ వృత్తులందు శిక్షణనిచ్చే నిమిత్తం 19,700 సీట్లు ప్రత్యేకించ బడినాయి.

స మా ప్త ము.



73



# భారత దేశంలో

# సాముదాయక అభివృద్ధి కార్యక్రమం.



---

ఆసియా — ఆఫ్రికా దేశాల బాండుంగ్ సమావేశంలో
భారతదేశం సమర్పించిన నివేదిక.

# ఒకటో అధ్యాయం

## ప్రణాళికా విప్లవం.

భారతదేశంలో ప్రయోగింపబడిన కమ్యూనిటీ ప్రాజెక్టుల కార్యక్రమం, జీవిత సంపూర్ణ వికాసమే పరమలక్ష్యంగా కలిగి, ప్రభుత్వ సహకారాన్ని పొందుతున్న ఒక మహా ప్రజోద్యమం. దేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పుడు, దేశం నలుమూలల మర్భర దారిద్ర్యం, తాండవిస్తుండేది; గ్రామప్రాంతాలలో అనారోగ్యం, నిరక్షరాస్యత యిల్లుకట్టు కున్నాయి; జీవన ప్రమాణం హీన స్థాయిలో ఉండేది. దేశ విభజనవల్ల యింకా తీవ్ర సమస్యలు ఉత్పన్నమైనవి; ఆహారపరిస్థితి తీవ్రరూపం ధరించింది ; అంతే కాక లక్షలాది నిర్వాసుల పునరావాస కార్యక్రమం తక్షణ కర్తవ్యమైంది.

ఆ నాడు దేశాన్ని యెదుర్కొన్న సమస్యలు అంత కఠిన మైనవి కాగా పరిష్కారావకాశాలు మాత్రం స్వల్పంగా ఉండేవి. అందువల్ల ప్రాధాన్యతలను నిర్ణయిస్తూ, ప్రభుత్వం ఒక అభివృద్ధి ప్రణాళికను సిద్ధంచేయవలసిన అవసరం యేర్పడింది. 1950 సంవత్సరంలో ప్రణాళికాసంఘం స్థాపింపబడింది; 1951 వ సంవత్సరం జూలై నాటికి ప్రథమ పంచవర్ష ప్రణాళిక ముసాయిదా సిద్ధమైంది. ఈలోగా, 1950 సంవత్సరం జనవరి 26 వ తేదీని అమలు పరుప బడిన నూతనరాజ్యాంగం ద్వారా, భారతజాతి పరమలక్ష్యం శ్రేయోరాజ్యస్థాపన మని ప్రకటించబడింది.

1952 డిసెంబరులో తుదిరూప మందిన ప్రథమ పంచవర్ష ప్రణాళికలో, సమస్త భవిష్యత్ప్రణాళికలకు మార్గదర్శకమైన

ఒక ప్రాథమిక అభివృద్ధి ప్రణాళిక ప్రతి పాదింపబడింది. జీవిత సర్వాంగాలలోను తక్షణ అవసరాలు అనేకమై, ప్రపంచంలోని 6 వ వంతు జనభా కలిగిన యిండియాలాంటి దేశంలో, ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి తాత్కాలానికేగాక నిరంతరంగా జరగవలసి ఉంటుందనీ గుర్తించబడింది. మున్ముందు రాబోయే కాలంలో అభివృద్ధి సత్వరంగా జరిగేందుకు, నీరు, విద్యుచ్ఛక్తి వగైరా అత్యవసర ప్రాథమిక అవసరాలను ముందుగా తీర్చవలసి వచ్చింది. నీటి సప్లై, విద్యుచ్ఛక్తి వగైరా అవసరాలకై సకలార్థసాధకములైన భారీప్రాజెక్టులు, ప్రణాళికలో సూచింపబడినవి. రసాయనిక యెరువులు, యినుము, ఉక్కు, యంత్రపరికరాలు, టెలిఫోనులు వగైరా కీలక పరిశ్రమాభివృద్ధికి అవకాశం యేర్పడింది. వీటి అన్నిటిని మించి పంచవర్ష ప్రణాళికలో, వ్యవసాయాభివృద్ధి ద్వారా అధికాహారోత్పత్తి సాధనకు అత్యంత ప్రాధాన్యత లభించింది. 1947 నుండి 1952 వరకు గల యేడు సంవత్సరాల కాలంలో సుమారు 800 కోట్లరూపాయల విలువ గల ఆహార పదార్థాలను మన దేశం దిగుమతి చేసుకుంది. దేశీయ ఆర్థిక సంపద మీద యిదెంత భారమో చూడండి; దేశంలో ఆహార పదార్థాల ఉత్పత్తి సంతృప్తి కరంగా ఉన్నట్లైతే, యీ కోట్ల రూపాయలు శాశ్వతమైన జాతీయ నిర్మాణ కార్యక్రమాల నిర్వహణకు లభ్యమయ్యేవే కదా !

స్వాతంత్ర్య భానూదయం :-

ఈ కార్యక్రమాలు ప్రారంభంకాగానే, యిందులో అనేకం భారీ ప్రాజెక్టులనీ, వాటి నిర్వహణకు తగినంత ఆర్థిక స్థోమన్ను



సాంకేతిక నిపుణత అవసరమని ప్రణాళికాకర్తలు భావించారు వారు మొదట్లో గ్రామప్రాంతాలలోని సామాన్య ప్రజా సమూహాల నిత్యనైమిత్తిక జీవిత వ్యవహారాలను తాకి తెలుచుకో లేదు; అప్పటి వరకు స్వాతంత్ర్యం సామాన్య ప్రజల సాంఘిక. ఆర్థిక జీవితంలో ప్రతి ఫలించలేదు; కేవలం, యేదో స్వరాజ్యం వచ్చిందనే అల్ప సంతోషం తప్ప క్రొత్తగా వచ్చిన స్వాతంత్ర్యానికి గ్రామీణ ప్రజల నిత్యజీవిత సమస్యలపరంగా, ఒక అర్థం, ఒక క్రొత్త వ్యాఖ్యానం, విశిష్టత కల్పించి, తద్వారా సాంఘిక ఆర్థిక అభ్యున్నతి సాధనకై జరిగే కృషిలో జాతి మొత్తాన్ని కార్యోన్ముఖం చేయవలసిన అవసరం యేర్పడింది. అధికోత్పత్తి, అధిక వృత్తి కల్పన, సమానత్వం తన లక్ష్యాలుగా పంచవర్ష, ప్రణాళిక ప్రకటించింది. ఈ మహదాశయ సాధనకు అప్పుడు ప్రారంభోత్సవం జరిగింది.

కేంద్ర ప్రభుత్వం తలపెట్టిన యీ జాత్యభివృద్ధి కార్యక్రమంతో, గ్రామీణ భారతదేశంలోని అసంఖ్యాక ప్రజానీకానికి నిజమైన స్వాతంత్ర్యభానూదయమైంది. కేవలం ప్రభుత్వ కార్యక్రమంగా కాక, గ్రామప్రాంతాలలోని సుమారు ఏడుకోట్ల కుటుంబాలకు, యితరులతోపాటు తమకూ బ్రతకడానికి హక్కున్నదనే జీవిత చైతన్యం ప్రసాదించే ఒక మహోద్యముగా యిది లక్షింపబడింది. దేశంలో నిర్మించాలని కంకణం కట్టుకున్న శ్రేయోరాజ్య సాధనలో తమవంతు బాధ్యతలను గుర్తించడానికి తగినంతగా ప్రజలు చైతన్యవంతులు కావాలి. అందుకై వారు నూతన విజ్ఞానాన్ని సముపార్జించి, క్రొత్త జీవిత విధానాలను



పరిశీలించి, ఒక విశిష్టమైన, సమగ్రమైన సస్యజీవిత విధాన సాధనకై దీక్షవహించాలి.

## మూల విశ్వాసాలు

ఒక ఉద్యమంగా, దాని మూల విశ్వాసా లేమంటే:-

(1) కండపుష్టి ఘనకార్యాలు చేస్తుంది.

(2) కండపుష్టిచేత ఘనకార్యాలు చేయించ వచ్చు.

(3) దీనికి అవసరమైన పరిస్థితులను సృష్టించుకోవచ్చు.

ఈ సూత్రాలలో దైహికపరిశ్రమ, భావవిప్లవం, ప్రధానమైనవిగా పరిగణించ బడినవి. నలువైపుల పరుచుకొని వున్న మహా నిస్తబ్దతాపర్వతం రెక్కలన్ని ముక్కలు చేయగలిగితే, గ్రామ ప్రాంతాలలోని పటిష్టమైన ప్రజాశక్తి వజ్రాయుదాలను సమీకరించి, వ్యక్తి, సమిష్టి అభ్యుదయాన్నికై జరిగే ప్రయోజనాత్మక కృషిలో వినియోగించుకోవచ్చు. ఈ ప్రణాళికలో గ్రామీణ జీవితంలో ఒక ప్రశాంత విప్లవసాధన లక్షించబడింది. ప్రజల్లో శాంతియుత విధానాలతో భావవిప్లవం సాధించడానికి ప్రణాళిక పూనుకుంది.

ప్రారంభంలో యిదంతా ఒక పెద్ద గడ్డు సమస్యగానే తోచింది. ఈ రకమైన ఒక మహాప్రజోద్యమాన్ని నిర్మించ గలిగిన శక్తి ప్రభుత్వానికి ఉన్నదా అని శంకించిన బుద్ధిమంతులు లేకపోలేదు; అంతేకాక ప్రణాళికా విజయానికి కీలకమైన సామాన్య ప్రజాసహకారం లభించదనీ, అందువల్ల యిదంతా ప్రభుత్వకార్య కలాపంగానే మిగులుతుందని కూడా వారు భావించారు. మరికొందరు నిపుణులైన వారు తమ తమ శాఖాపరిధు



ల్లోనే అన్ని సమస్యల పరిష్కారం యిమిడి ఉన్నదని భావించారు. ఎలాగంటే, ఉదాహరణకు వ్యవసాయ రంగంలో నిపుణులు యేమనుకున్నారంటే, భూములకు నీటి సప్లైచేయ గలిగితే అధికోత్పత్తి జరుగుతుందనీ, దాని మూలంగానే భారతదేశాన్ని పీక్కుతింటున్న అనేక గడ్డు సమస్యలు పరిష్కారమైపోతాయనీ. అలాగే వైద్యనిపుణులు గ్రామీణ భారతంలోని క్షీణదశకు వ్యాధులు, అనారోగ్యం ముఖ్యకారణాలు గనుక వాటిని నిర్మూలిస్తే, ఆరోగ్యవంతమైన జాతి తనంతట తానే శ్రేయస్సుపథంలో పురోగమిస్తుందని భావించారు. నిరక్షరాస్యతయే ప్రస్తుత నిస్తబ్ధతకు మూలకారణమనీ, దానిని నిర్మూలిస్తే ప్రజలు విజ్ఞానవంతులై తమ సమస్యలను, తత్పరిష్కారాన్ని, గ్రహించి నడుచుకోగలుగుతారనీ విద్యావేత్తలు సూచించారు.

## పైలెట్ ప్రాజెక్టులు

ఈ విధమైన సంకుచిత దురూహలను, కుతర్కాలను త్రోసిరాజని, కేంద్రప్రభుత్వం, 1952 అక్టోబరు నెలలో పైలట్ ప్రాజెక్టులుగా జాతీయ అభివృద్ధి కార్యక్రమాలను ప్రారంభించింది. దేశం మొత్తంమీద 55 కేంద్రాలలో, 25,264 గ్రామాలకు చెందిన సుమారు ఒకకోటి అరవైనాలుగు లక్షల ప్రజానీకానికి యీ కార్యక్రమం వర్తించింది. దీన్ని పేరుకుమాత్రం 'పైలట్ స్కీమ్' అని వ్యవహరించినప్పటికీ, దాని వ్యాప్తి అప్పటికే సమగ్రంగా ఉంది. ఈ కార్యక్రమానికి ప్రజానీకంలో ఎలాంటి సంచలనం కలుగుతుందో, యీ ఉద్యమప్రచారంలో ప్రారంభదశలో యెలాంటి లోపాలు జరుగుతయో, గమనించవలసి



యున్నందున, దానిని పైలట్ స్కీముగా వ్యవహరించవలసి వచ్చింది.

ఈ కార్యక్రమం ప్రారంభమైన కొద్ది నెలలలోనే ఒక విషయం స్పష్టంగా తేలింది; అదేమంటే, యీ కార్యక్రమంతో సహకరించడానికి ప్రజానీకం సిద్ధంగా ఉందనీ, దీన్ని వారు తీక్ష్ణంగా పరిశీలించారనీ. అన్ని ప్రాజెక్టు ప్రాంతాలలోను ప్రభుత్వం అనుకున్న దానికంటె ఎక్కువగా ప్రజలు సమధికోత్సాహంతో సహకరించడానికి ముందుకువచ్చారు. ఈ కార్యక్రమాలను దేశవ్యాప్తంగా అమలు పరచడానికి ప్రభుత్వం పూనుకునేందుకు యీ ప్రజోత్సాహమే మూలకారణమైంది.

---



7

## రెండో అధ్యాయం

## ప్రణాళికా స్వరూపం

1952 వ. సంవత్సరంలో మహాత్ముని జన్మదినం అక్టోబరు 2వ తేదీన యావద్భారత దేశంలోను జాత్యభివృద్ధి ప్రణాళికా నిర్వహణ ప్రారంభింపబడింది. అంతకుముందే అదే సంవత్సరంలో క్రొత్త ఢిల్లీలో జరిగిన రాష్ట్ర డెవలప్ మెంటు కమీషనర్ల సమావేశంలోనే యీ కార్యక్రమానికి చెందిన ప్రాథమిక చర్చలు జరిగాయి.

సాంఘిక, ఆర్థిక జీవితరంగాలలో అతిప్రధానమైన అన్ని అంశాలలోను జాత్యభ్యుదయ సాధనమే ప్రణాళికా లక్ష్యం. ఈ సందర్భంగా జరిగిన సాధికార లక్ష్యప్రకటనలో యిలా ఉంది:-

"ప్రణాళికా నిర్వహణలో ఆబాలగోపాలానికి జీవిత చైతన్యాన్ని కలిగించి మార్గదర్శకత్వం వహించడమే కమ్యూనిటీ ప్రాజెక్టుల ప్రధాన లక్ష్యం. నిర్వహణ ప్రాథమిక దశలో యీ లక్ష్యసాధనలో ప్రధానాంశమైన ఆహార స్వయంపోషకత్వంమీద దృష్టి కేంద్రీకరింపబడాలి".

1951 వ సంవత్సరంలో ఆహారపదార్థాల దిగుమతి ఉచ్చస్థాయి నందుకుంది. ఇతరత్రా వినియోగింపదగిన దేశీయసంపద యీ దిగుమతుల రూపేణా వృథాగా వ్యయం చేయబడుతున్నది. ప్రణాళికా కార్యక్రమాన్ని చర్చించుకుని నిర్ణయించుకుంటున్న దశలో, యీ పరిస్థితులవల్ల ఆహార సమస్యకు అత్యధికప్రాధాన్యత యివ్వవలసివచ్చింది.

అతి ప్రధానమైనవిగా, యీ క్రింది అంశాలు ప్రణాళికలో చేర్చబడినవి.

(ఎ) వ్యవసాయం : (1) బీళ్లు, బంజరు భూములు సాగులోకి తేవడం.

(2) కాలువలు, బావులు, చెరువులు, గుంటలు, సరస్సులు, నదులలోనుండి లిఫ్టులు, వగైరా విభిన్న రూపాలలో నీటి పారుదల సౌకర్యాలు కలిగించడం

(3) మేలురకం విత్తనాలు, అధునాతన వ్యవసాయ విధానాలు, పరికరాలు, పశువైద్యం, మార్కెటింగ్, పరపతి, పశుపోషణ కేంద్రాలు, భూసార పరిశీలన, మెరువులు వగైరా వివిధ సౌకర్యాలు కలిగించడం.

(4) దేశీయ మత్స్యపరిశ్రమాభివృద్ధి, కూరగాయలు, పండ్లతోటలు, వృక్షావాపనము, ఆహార విధానాల పునర్నిర్మాణం.

(బి) రాకపోకలు :-రోడ్ల నిర్మాణము; రోడ్లప్రయాణంలో యంత్ర సౌకర్యాలను ప్రోత్సహించడం, పశుప్రయాణ సౌకర్యాల కల్పన.

(సి) విద్య :-ప్రాథమికదశలో నిర్బంధ ఉచిత విద్యా సౌకర్యాలు, ఉన్నత, మాధ్యమిక; విద్యాభివృద్ధి, సాంఘిక విజ్ఞానం, గ్రంథాలయాలు.

(డి) వైద్యం .-పారిశుధ్యం, ప్రజారోగ్య సౌకర్యాలు, బాధితులకు, రోగులకు వైద్యసౌకర్యాలు, జన్మపూర్వ, జన్మాంతర మాతాశిశు సంరక్షణ, ప్రసూతి సౌకర్యాలు.



(ఇ) శిక్షణ:-(1) కృషికారుల వృత్తిస్థాయిని పెంచడానికి ప్రత్యేకశిక్షణ.

(2) కృషీవలులకు శిక్షణ; వ్యవసాయవ్యాప్తికి, సలహాదార్లు, సహాయకులు, పర్యవేక్షకులు నిర్వాహకులు, వైద్య కార్యకర్తలు, ప్రాజెక్టు నిర్వాహణాధికారులు.

(ఎఫ్) వృత్తికల్పన:-(1) కుటీర పరిశ్రమలు, మధ్యతరహా, చిన్నతరహా పరిశ్రమలకు యితోధిక ప్రోత్సాహం.

(2) ప్రణాళికాబద్ధమైన సంపద్విభాగం, వ్యాపారం, నిర్మాణ కార్యకలాపాలద్వారా వృత్తులను కల్పించుట.

(జీ) గృహనిర్మాణం:-గ్రామీణ, పట్టణ ప్రాంతలలో గృహ నిర్మాణంలో నూతన విధానాల ప్రోత్సాహం.

(హెచ్) సాంఘిక శ్రేయస్సు:-(1) స్థానిక సంస్కృతి, కళానైపుణ్యం ద్వారా జాతిని ఉత్తేజపరచే వినోదకార్యక్రమాల నిర్వహణ, శ్రవ్య, దృశ్యకళా ప్రదర్శనలద్వారా, జాతీయ వికాస కల్పన, విజ్ఞానాభివృద్ధి.

(2) స్థానికంగా క్రీడాభివృద్ధి, సహకారం, స్వయంకృషి ఉద్యమం.

ఈ మహదాశయాలు, వ్యాప్తిలోను, పరిమాణంలోను, జాతీయాభివృద్ధికి బహుధా దోహదం చేస్తున్నవి. ప్రభుత్వరంగం, వింత విశాలమైనదైనా, యిలాంటి బృహత్ప్రణాళికను స్వయంగా నిర్వహించలేదు. ప్రభుత్వ ప్రస్తుత ఆర్థికపరిస్థితి దేశం మొత్తానికి చెందిన జాత్యభివృద్ధి ప్రణాళికలలోని ముఖ్యాంశాల నిర్వహణకు మాత్రమే పరిమితమైఉంది. అదైనా, ప్రతీ జాతీయకృషిలోను,





గ్రామస్థులు ధనంగాగాని, ఐచ్ఛికశ్రమదానం రూపేణాగాని తమ తీరిక సమయాల్లో సహకరించినప్పుడే, ఈ మహత్తర కృషిలో ప్రతీ రంగంలోను, ప్రతీదశలోను, గ్రామస్థులమీద యెంతో బాధ్యత పడుతుంది; ప్రభుత్వం, ప్రజల సముత్సాహకృషికి కేవలం సహకారిగా మాత్రమే ఉంటుంది.

ప్రథమంలో ప్రభుత్వమే చొరవతీసుకుని, ప్రోత్సాహం యివ్వవలసివచ్చినప్పటికీ, యీ ప్రణాళికను ప్రభుత్వ సహకారంతో నడుపబడుతున్న ఒక మహాప్రజా ప్రణాళికగానే అభివర్ణించవలసి ఉంటుంది.

## విదేశసహాయం

ఈ మహత్తరకృషిలో, అమెరికా సంయుక్తరాష్ట్రాలు, ఫోర్డుసంస్థల అమూల్యసహాయం యిండియాకు లభిస్తున్నది. 1952 లో ప్రారంభింపబడిన మొదటి 55 ప్రాజెక్టులకు కావలసిన పరికరాలు, సప్లైలరూపంలో సుమారు 4 కోట్ల రూపాయల సహాయం అమెరికా యిచ్చింది. తరువాత మరల ఒకసారి 91 లక్షల రూపాయలు, మరోసారి, 2½ కోట్ల రూపాయలవరకు అమెరికా ప్రభుత్వం సహాయం చేసింది. ఈ కార్యక్రమ నిర్వహణలో సహాయకారులుగా కొంతమంది సాంకేతిక నిపుణులనుగూడా అమెరికా పంపింది.

వేలాది నిర్మాణ కార్యకర్తలకు శిక్షణయిస్తూ, యీ ప్రణాళికా ప్రారంభంనుండి ఫోర్డుసంస్థ మనతో సహకరిస్తున్నది. భారత ప్రభుత్వానికి యీ సంస్థవారు చేస్తున్న సహాయంలో ఒక ముఖ్యభాగం, గ్రామస్థాయిలో కార్యకర్తలకు ఉచిత శిక్షణ యివ్వడం. గ్రామీణప్రాంతాల అభివృద్ధికై 15 పైలట్ ప్రాజెక్టులను ప్రారంభించడానికికూడా ఫోర్డుసంస్థ తోడ్పడింది.



## మూడో అధ్యాయం

### జాతీయ విస్తరణోద్యమం

ప్రథమంలో ప్రారంభింపబడిన 55 కమ్యూనిటీ ప్రాజెక్టుల నిర్వహణలో కలిగిన అనుభవం, వాటికి లభించిన సమధిక ప్రజోత్సాహం, యీ కార్యక్రమాన్ని దేశపరివ్యాప్తంగా చేయవలసిన అవసరాన్ని నొక్కిచెప్పినై. కాని కమ్యూనిటీ ప్రాజెక్టులలో ఉద్దేశింపబడిన పరిమాణంలో, దేశవ్యాప్తంగా యిలాంటి సమగ్రమైన కార్యక్రమాన్ని అమలుపరచ గలిగిన అవకాశాలు దేశంలో లేవు.

అందువల్ల కమ్యూనిటీ ప్రాజెక్టులకుతోడు, అంతకంటె కొద్ది తరహాలో జాత్యభివృద్ధి కార్యక్రమాలను ప్రారంభించాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఈ అభివృద్ధి కార్యక్రమాలనే జాతీయ విస్తరణోద్యమం అని అంటున్నాం. ఈ అభివృద్ధి కార్యక్రమాలు అమలుపరచబడిన ప్రాంతాలను పరిశీలించి, వాటిలోనుండి కొన్నింటిని యెన్నుకుని కమ్యూనిటీ ప్రాజెక్టులలో తలపెట్టబడిన భారీ ప్రణాళికను అమలుపరచడానికి వినియోగించాలని కూడా నిర్ణయించబడింది. ఈ రెండు విధానాల ప్రణాళికలు పరస్పర పోషకంగా ఏక కాలంలోనే అమలు జరుపబడుతుంటవి. శాశ్వత శ్రేయోవ్యవస్థ జాతీయ విస్తరణోద్యమాన్ని ప్రారంభించడంలో ప్రభుత్వ లక్ష్యమేమంటే, ప్రస్తుత పరిపాలనా వ్యవస్థతో నిత్యసంబంధం కలిగిన, గ్రామీణప్రాంతీయ అభివృద్ధి వ్యవస్థను మరొకదానిని శాశ్వతంగా

నిర్మించడమే. రాజ్యాంగంలో ప్రతిపాదించబడిన శ్రేయోరాజ్య నిర్మాణాన్ని సాధించడానికి తగిన యంత్రాంగంగా యీ గ్రామీణ అభివృద్ధి వ్యవస్థ ఉద్దేశించబడింది.

ఈ రెండు వ్యవస్థల సమ్మేళన, పరస్పర సహకారంవల్ల, క్రొత్త సిబ్బందిని యేర్పాటు చేసుకోవలసిన అవసరం లేకుండానే, ప్రస్తుతం ఉన్న ప్రభుత్వ సిబ్బందినే శ్రేయోరాజ్య నిర్మాణకార్య కర్తలుగా ఉపయోగించుకోడానికి అవకాశం లభించింది. ఈ రూపేణా, ఒకానొకనాడు కేవలం రివిన్యూవసూలు, శాంతి భద్రతల రక్షణలకై నియుక్తమైన ప్రభుత్వ యంత్రాంగం, నేటికి ఒక సమగ్రమైన శ్రేయోరాజ్య నిర్మాణార్థమైన పరిపాలనా వ్యవస్థగా రూపొందింది. అంతేగాక ప్రభుత్వాధ్వర్యంలోని అభివృద్ధి శాఖల శక్తినంతా గ్రామీణ అభివృద్ధి పథకాలపై కేంద్రీకరించడం జరిగింది.

## అధికారి బృందం

ఈ రెండు వ్యవస్థల అవసరాలకు తగినవిధంగా, వాటి బడ్జెట్, సిబ్బంది స్వరూపం నిర్ణయింపబడినవి. అవి ఏవనగా:

నేషనల్ ఎక్స్‌టెన్‌షన్ సర్వీస్ బ్లాక్ - అధికారిబృందం:

| | |
|---|---|
| బ్లాక్ డెవలప్‌మెంట్ అధికారి (ప్రాంతీయాధికారికి సహాయకంగా) | 1 |
| ఎక్స్‌టెన్‌షన్ అధికార్లు (వ్యవసాయం; పశుపోషణ; సహకారం, పంచాయతీలకు) | 3 |
| సోషల్ ఎడ్యుకేషనల్ ఆర్గనైజర్లు (1 పు. 1 స్త్రీ) | 2 |

| | |
|---|---|
| ప్రజారోగ్యశాఖ ఓవర్సీయర్ | 1 |
| విలేజి లెవల్ వర్కర్సు | 10 |
| అకవుంటెంట్, స్టోర్ కీపర్ | 1 |
| టైపిస్ట్, గుమస్తా | 1 |
| మెసెంజర్లు వగైరా | 3 |

డెవలప్ మెంట్ బ్లాకు (కమ్యూనిటీ ప్రాజెక్టు ప్రాథమిక దశ)-అధికారి బృందం.

| | |
|---|---|
| విలేజి లెవల్ వర్కర్సు | 2 |
| స్టాక్ మెన్ (పశువైద్యం). | 2 |
| మెసెంజర్లు (డిటో) | 2 |
| చీఫ్ సోషల్ ఎడ్యుకేషనల్ ఆర్గనైజర్ | 1 (ప్రతి 3 బ్లాకులకు) |
| మెడికల్ ఆఫీసరు | 1 |
| కాంపౌండరు | 1 |
| శానిటరీ యిన్ స్పెక్టరు | 1 |
| లేడీ హెల్త్ విజిటర్ | 1 |
| మంత్రసానులు | 4 |
| శానిటేరియన్ (వైద్య ఉపాధ్యాయులు) | 1 |
| స్వీపర్లు. | 2 |

ఆర్థిక స్తోమతు :

కమ్యూనిటీ ప్రాజెక్టులు సహా జాతీయ విస్తరణోద్యమ సేవా కార్యకలాపాల క్రింద పంచవర్ష ప్రణాళికలో, ప్రణాళికా కాలంలో ఖర్చు నిమిత్తం 101 కోట్ల రూపాయలు కేటాయించ బడింది. కమ్యూనిటీ ప్రాజెక్టుల నిర్వహణశాఖ, వివిధ రకాల బ్లాకులకు

వేర్వేరుగా బడ్జెట్ అంచనాలు తయారుచేసింది. కమ్యూనిటీ డెవలప్ మెంట్ బ్లాకు పూర్తి నిర్మాణకాలం మూడు సంవత్సరాలు; యీ కాలానికి బడ్జెట్ అంచనా 15 లక్షలు. కాని ఎక్స్టెన్షన్ బ్లాకు నిర్మాణకార్యక్రమాలకు అదే కాలానికి బడ్జెట్ అంచనా 7½ లక్షలు. ఈ బడ్జెట్ అంచనాల పూర్తి వివరాలు 3, 3 (ఎ), అనుబంధాలలో చూపబడినవి.

పరిపాలనా వ్యవస్థ

కమ్యూనిటీ ప్రాజెక్టులకూ, ఎక్స్టెన్షన్ కార్యక్రమానికీ ఉద్దేశించబడిన పరిపాలనా వ్యవస్థ గ్రామస్థాయిలోకి కూడా చొచ్చుకు పోయింది; అంతేకాక ప్రతిదశలోను అనధికార ప్రజా నాయకుల సహకారం యొక్క ఆవశ్యకత గుర్తించబడింది. కమ్యూనిటీ ప్రాజెక్టుల నిర్వహణశాఖ, యీ పరిపాలనా వ్యవస్థ లోని అధికార బృందానికి నాయకత్వం వహిస్తున్నది. ప్రధాన మంత్రి నాయకత్వంలో ప్రణాళికా సంఘ సభ్యులతో కూడిన ఒక కేంద్ర కమిటీ సలహాల మీద ప్రాజెక్టుల నిర్వహణశాఖ కార్యకలాపాలు సాగిస్తుంది. ఈ కేంద్ర కమిటీయే, ఈ కార్యక్రమాలతో సంబంధం గల కేంద్ర ప్రభుత్వ వివిధశాఖల కార్యకలాపాలను సమన్వయ పరుస్తుంది.

పోతే, రాష్ట్రస్థాయిలో ఒక రాష్ట్రాభివృద్ధి సంఘం పని చేస్తుంటుంది. ముఖ్య మంత్రి నాయకత్వంలో రాష్ట్ర అభివృద్ధి శాఖా మంత్రులు యీ సంఘంలో సభ్యులుగా ఉంటారు. ఒక సీనియర్ అధికారి—రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శిగాని డెవలప్ మెంట్ కమిషనర్ హోదాగలిగిన అదనపు ప్రధాన కార్య

దర్శిగాని, రాష్ట్రాభివృద్ధి సంఘానికి కార్యదర్శిగా వ్యవహరిస్తారు. రాజధానిలో గల అన్ని అభివృద్ధిశాఖల ప్రధానాధికారుల బృందానికి రాష్ట్ర డెవలప్ మెంట్ కమిషనర్ ఉన్నతాధికారి. అన్ని శాఖల అభివృద్ధి కార్యకలాపాలను సమన్వయపరుస్తూ, ఆయన వాటికి ఆదర్శవంతమైన ఏకపథ పురోగామిత్వాన్ని కల్పించడానికి కృషి చేస్తాడు. ఈ అధికారి బృందంలో డెవలప్ మెంట్ కమిషనర్‌కు తరువాత వాడు జిల్లా కలెక్టరు. మామూలు పనులైన, రెవిన్యూవసూలు, శాంతి భద్రతల రక్షణ మాత్రమే కాకుండా, అనేక చోట్ల జిల్లా కలెక్టర్లకు అభివృద్ధి ప్రణాళికల పురోగమన బాధ్యతలను కూడా సంక్రమింపజేయడం జరిగింది.

ఒక ప్రాజెక్టు నిర్వహణ బాధ్యత, ఆ ప్రాజెక్టు కార్య నిర్వహణాధికారి మీద ఉంటుంది. ఆయన ఆధ్వర్యంలో 300 గ్రామాలు గల 3 బ్లాకులు ఉంటవి. ప్రతి బ్లాకు, ఒక బ్లాక్ డెవలప్ మెంట్ అధికారి పర్యవేక్షణ క్రింద ఉంటుంది. కార్య క్రమ స్వభావానుగుణంగా, 5 నుండి 10 గ్రామాల వరకు బాధ్యత వహించి, విలేజిలెవల్ వర్కర్సు పని చేస్తుంటాడు. జిల్లా కేంద్రంలోను, బ్లాకు కేంద్ర స్థానంలోను, వివిధ విషయాలకు చెందిన నిపుణులు వ్యవహారాలను నడుపుతుంటారు; ప్రాజెక్టు కార్య నిర్వహణాధికారి, బ్లాక్ డెవలప్ మెంట్ ఆఫీసరు నిపుణుల కార్యకలాపాలను సమన్వయ పరుస్తారు.

ఈ అధికారిక వ్యవస్థకు తోడుగా, అనధికార ప్రజాసహకారం లభించే యేర్పాట్లు చేయబడినై కూడా. కేంద్రంలో, పార్లమెంటు మార్గదర్శకంగా సూచనలు చేస్తుంటుంది. రాష్ట్ర

స్థాయిలో శాసన సభ కూడా అదే పనిచేస్తుంది. ప్రాజెక్టు స్థాయినుండి, యింకా క్రింది వరకు, వివిధ దశలలో అనధికార సలహా కమిటీలు ఏర్పడి, నిర్వహణాధికారికి, డెవలప్ మెంట్ ఆఫీసరుకు సహకారం యిస్తున్నవి. ఈ గ్రామస్థాయి కార్యకలాపాలు, యీ నిర్మాణంలో కీలక పాత్రవహిస్తున్నవి. అక్కడ, గ్రామ పంచాయితీలు, గ్రామ సంఘాలు, గ్రామకార్యకర్తల సహకారంతో నిర్మాణ కార్యక్రమాలు నిర్వహిస్తున్నవి. ఈ జాత్యభివృద్ధి ప్రణాళికా నిర్వహణకు చరమలక్ష్యమైన ప్రజా పరిపాలనా వ్యవస్థ స్వరూపం రెండవ అనుబంధంలో చూపబడింది.

---

# నాలుగో అధ్యాయం

## ప్రణాళిక ప్రస్తుత వ్యాప్తి

1952 అక్టోబరులో యీ కార్యక్రమం ప్రారంభింపబడిన నాటి నుండి ఎప్పటి కప్పుడు కమ్యూనిటీ ప్రాజెక్టులు, జాతీయ విస్తరణ కేంద్రాలు, ప్రారంభింపబడుతూనే ఉన్నాయి. 1956 మార్చి నాటికి యిండియాలోని గ్రామీణ ప్రజానీకంలో నాల్గవ వంతుమంది జాతీయ విస్తరణోద్యమ ప్రభావితులు కావాలనే ప్రణాళికా లక్ష్య ప్రకటనను దృష్టిలో పెట్టుకుని యీ నూతన నిర్మాణాలు ప్రారంభించబడుతున్నవి. ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలంలో, భారత దేశంలోని సుమారు 5½ లక్షల గ్రామాలకుగాను, 8 కోట్ల జనాభా కలిగిన లక్షా యిరవై వేల గ్రామాలకు, 1200 బ్లాకులు ద్వారా, యీ విస్తరణోద్యమం వ్యాపించవలసి ఉంది. 1200 బ్లాకులలో, 700 బ్లాకులు సత్వరాభివృద్ధి ప్రణాళిక క్రింద, మిగిలిన 500 వ్యాప్తి ప్రణాళిక క్రింద నిర్వహింపబడవలసి ఉన్నై.

ప్రణాళికా లక్ష్యం యిలా ఉండగా, 1955 ఏప్రిల్ నాటికి జరిగిన కృషి యీ క్రింది విధంగా ఉంది.

| ప్రారంభ సంవత్సరం | ఎన్ని ప్రాజెక్టులు లేక బ్లాకులు* | ప్రణాళికవర్తించే గ్రామాల సంఖ్య (సుమారు) | జనాభా (సుమారు) (లక్షలలో) | రిమార్కులు |
|---|---|---|---|---|
| కమ్యూనిటీ ప్రాజెక్టు బ్లాకులు: | | | | |
| 1952–53 | 167 | 25,264 | 164 | |
| 1953–54 | 53 | 7,693 | 4 | |
| ఎక్స్టెన్షన్ బ్లాకులు: | | | | |
| 1953–54 | 259 | 31,435 | 187 | |
| 1954–55 | 242 | 24,200 | 160 | |
| 1955–56 | 107 | 10,700 | 71 | |
| మొత్తం | 828 | 99,292 | 622 | |

*1 ప్రాజెక్టు = 3 బ్లాకులు: 1 బ్లాకు = 60 నుండి 70 వేల జనాభా కలిగిన 100 గ్రామాలు.

ఈ సంవత్సరం ఏప్రిల్ నుండి, 132 ఎక్స్టెన్షన్ బ్లాకులు కమ్యూనిటీ బ్లాకుల క్రిందికి మార్పుచేయబడినవి. వీటిలో 87 లక్షల జనాభా కలిగిన 13,200 గ్రామాలుచేరి ఉన్నై. జాతీయ విస్తరణోద్యమ ప్రణాళిక క్రింద చేయబడిన మొట్ట మొదటి మార్పు యిదే.

గ్రామీణ జనాభాలో 1/5 వంతులకు :-

పై అంకెలనుబట్టి, ఈ రెండు ప్రణాళికల ద్వారా ఇండియాలోని 31 కోట్ల జనాభాకుగాను 6 కోట్ల 20 లక్షల మందికి

పైగా యీ కార్యక్రమం వర్తించిందని స్పష్టంగా తెలుస్తున్నది. దేశంలోని 5½ లక్షల గ్రామాలకుగాను, లక్షకు కొంచెం తక్కువ గ్రామాలకు యీ ఉద్యమం వ్యాపించింది. గ్రామీణులలో ప్రతి 5 మందిలో ఒకరు, యీ ఉద్యమ ఫలితాలను పొందు తున్నారు. ఇందులో సగంమంది కమ్యూనిటీ కార్యక్రమం ద్వారానూ, మిలిగిన సగం మంది వ్యాప్తి ప్రణాళిక ద్వారాను ప్రభావితులు అవుతున్నారు.

గ్రామీణ జనాభాలో 4/5 వంతులు యింకా యీ ప్రణాళికా పరిధికి వెలుపలనే ఉన్నప్పటికీ, యిప్పటి వరకు జరిగిన వ్యాప్తి బ్రహ్మాండమైనదనే భావించుకోవాలి. మన ప్రణాళిక క్రమక్రమంగా, అంతకంతకు యెక్కువగా, వ్యాప్తి చెందుతుంది. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక చివరికాలానికి, జాతీయ విస్తరణోద్యమ ప్రభావం యావద్భారత గ్రామీణ ప్రాంతాన్ని పరిపుల్లం చేస్తుంది. అంతేగాక భారత గ్రామీణ జనాభాలో సగం భాగం సత్వరజాతీయాభివృద్ధి కార్యక్రమాలక్రింద పురోగమనం సాగించాలి.

విస్పష్టమైన ఫలితాలు: -

కమ్యూనిటీ కార్యక్రమాల ప్రధానలక్ష్యం, ప్రజల భావనా రీతిలోను, ఆదర్శాలలోను నూతన పురోగామిత్వాన్ని సాధించి, వారిని స్వీయశ్రేయస్సుకై స్వయంకృషి పథోన్ముఖులుగాచేయడమే. ఆచరణలోకి వచ్చేటప్పటికి యీ మార్పు, వ్యక్తి, సమిష్టి చైతన్య రూపంలో, తత్ప్రయోజన సిద్ధికై జరిగే కృషిగా, తమ కోసం తాము ప్రజానీకంపడే శ్రమగా రూపొందుతుంది.

గత 2½ సంవత్సరాల్లో జరిగిన కృషిని సమీక్షించుకుంటే, కమ్యూనిటీ ప్రాజెక్టు ప్రాంతాలలోను, వ్యాప్తి ప్రణాళికా ప్రాంతాలలోను, వివిధ రంగాలలోను సమృద్ధిగా అభివృద్ధి సాధింప బడిందనే చెప్పాలి. కొన్ని ప్రధాన రంగాలలో 1954 డిశెంబరు వరకు సాధింపబడిన సత్ఫలితాలు యీ క్రింది పట్టికలో చూపింప బడినవి :-

వ్యవసాయం :-

| | |
|---|---|
| యెరువుల గుంటలు | 601,723 |
| యెరువుల పంపకం : (టన్నులు) | 119,442 |
| విత్తనాల పంపకం ,, | 43,200 |
| శాస్త్రీయ వ్యవసాయ పరికరాల పంపకం | 101,070 |
| వ్యవసాయ ప్రదర్శనలు | 433,117 |
| పండ్లు, కూరగాయల పెంపకం (యకరాలు) | 155,529 |
| కీలక గ్రామ ప్రణాళికలు : (పశుపోషణ) | 738 |
| మేలుజాతి యెద్దుల సప్లై. | 3,125 |
| పశురోగ నివారణ | 7,653,444 |
| చేపల సప్లై | 7,072353 |
| కొత్తగా సాగులోకి వచ్చిన భూమి (యకరాలు) | 396,009 |
| ఇరిగేషన్ సౌకర్యాలు యేర్పడిన భూమి (యకరాలు) | 759,776 |

వైద్య సౌకర్యాలు, పారిశుధ్యం :-

| | |
|---|---|
| నీరు యింకే గుంటలు | 122,536 |
| గ్రామాల్లో మరుగు దొడ్లు | 27,061 |
| మురుగు పారుదుల సౌకర్యాలు (మైళ్లు) | 616 |

| | |
|---|---|
| బావుల నిర్మాణం | 8,308 |
| బావుల మరమ్మత్తు | 15,411 |

విద్య :

| | |
|---|---|
| క్రొత్త పాఠశాలలు | 5,590 |
| బేసిక్ పాఠశాలలుగా మార్చబడినవి | 1,661 |
| వయోజన విద్యా కేంద్రాలు | 14,445 |

ప్రజా సంస్థలు :

| | |
|---|---|
| కమ్యూనిటీ కేంద్రాలు | 28,667 |
| స్థాపించబడిన ప్రజా సంఘాలు | 20,951 |
| క్రొత్త సహకార సంస్థలు | 14,126 |
| సహకార సంఘాలలో క్రొత్త సభ్యత్వం | 211,909 |

రహదార్లు, రాకపోకలు :

| | |
|---|---|
| పక్కా రోడ్ల నిర్మాణం (మైళ్లు) | 1,145 |
| కచ్చా రోడ్ల నిర్మాణం ,, | 11,886 |

లలితకళలు, చేతిపనులు :

| | |
|---|---|
| ఉత్పత్తి, శిక్షణా కేంద్రాలు | 254 |

గృహవసతి :

| | |
|---|---|
| గ్రామాల్లో గృహ నిర్మాణం | 11,183 |
| గ్రామాల్లో గృహాల మరమ్మతు | 96,466 |

సాధించిన సత్ఫలితాలలో ఘన విజయాలుగా పేర్కొన దగినవి చూడండి. వ్యవసాయరంగంలో, సేద్యంలో మార్పులు సూచించి మేలు విత్తనాల సప్లై, ఎరువులు, శాస్త్రీయ వ్యవసాయ

పరికరాలసప్లై వగైరా చర్యలవల్ల వ్యవసాయ విధానాలలో అభివృద్ధిని సాధించడమేకాకుండా, క్రొత్తగా సుమారు 4 లక్షల యకరాల భూమిసాగులోకి తేబడింది ; మరొక 7 లక్షల 50 వేల యకరాల భూమికి యిరిగేషన్ వసతి సౌకర్యాలు కల్పింపబడినవి. అంతేకాక మరొక లక్షాయాభైఅయిదువేల యకరాలక్రింద పండ్లు, కూరగాయల తోటలు పెంచడం జరిగింది.

పశుపోషణ విషయంలో, 738 కీలక గ్రామ కేంద్రాల స్థాపనద్వారాను, సుమారు 3 వేల మేలురకం యెద్దుల సప్లై ద్వారాను, ప్రాజెక్టు ప్రాంతాలలో అతి ముఖ్యమైన యీ సమస్యను ఎదుర్కోడానికి అంకురార్పణ జరిగింది. పశు సంపద అభివృద్ధి యితర ప్రాంతాలలో చాల బలహీనంగా ఉంది.

గ్రామీణ ప్రాంతాల్లో మరుగుదొడ్ల సౌకర్యకల్పన, ఆయా ప్రాంతాల అభివృద్ధి సాధనలో ఒక ప్రధానాంశం. వీటికి తోడు సుమారు 600 మైళ్లు పొడవుగల మురుగు నీటి పారుదల కాల్వల నిర్మాణం జరిగింది. యివన్నీ గ్రామపారిశుద్ధ్యానికి అనువైనవాతావరణాన్ని కల్పించి, గ్రామ రామణీయకతను సాధించడానికి దోహదము లవుతున్నవి.

నిరక్షరాస్యతా నిర్మూలన మరొక ముఖ్యాంశము. నూతనంగా పాఠశాలలను నిర్మించడము, ఉన్నవాటిని బేసిక్ పాఠశాలలుగా మార్చి, చేతిపనుల శిక్షణకు సౌకర్యాలు కల్పించడమే కాకుండా, వేలాదిగా వయోజన విద్యా కేంద్రాలుకూడా ప్రారంభింపబడినవి.

కమ్యూనిటీ కార్యక్రమంలో, గ్రామ స్థాయిలో ప్రజా సంఘాల నిర్మాణం ప్రముఖ పాత్ర వహిస్తున్నది. ప్రణాళిక ఆచరణకు అధోస్థాయిలో తీసుకోవలసిన చర్యలలో యిదే ముఖ్యమైనది. నిర్మింపబడిన గ్రామ సంఘాలు, ప్రారంభింపబడిన నూతన సహకార సంఘాలు, యీ ప్రజా సంఘ నిర్మాణరంగంలో జరుగవలసిన సమగ్రాభివృద్ధి శిఖరానికి ప్రథమ సోపానాలుగా అప్పుడే వెలసినవి.

ఏ గ్రామీణ ప్రాంతములోనైనా రోడ్లు, రహదార్ల సౌకర్యాలు అభివృద్ధి చేయడం అత్యవసరం. వర్షాకాలంలో, యితర ప్రపంచంతో యేమాత్రం సంబంధం లేకుండా కాలంగడిపే లక్షలాది భారతీయ గ్రామ సీమల విషయంలో యీ రంగంలో ప్రత్యేక శ్రద్ధ అవసరమవుతుంది. భారతదేశంలో అమలు పరచబడిన కమ్యూనిటీ కార్యక్రమాల లన్నింటిలోనూ రోడ్ల నిర్మాణ కృషిమీద ప్రజానీకం దృష్టి పూర్తిగా ప్రసరించింది ; ఈ కార్యక్రమంలో గ్రామీణ ప్రజల నూతనోత్సాహంవెల్లి విరిసింది. ఈ ప్రణాళిక అమలు జరిగిన రెండేండ్ల కాలంలోనూ, సుమారు 12 వేల మైళ్లకు పైగా రోడ్ల నిర్మాణం జరిగింది రోడ్లకు అవసరమైన స్థలాన్ని ప్రజలే యిచ్చారు ; మట్టి పనిగూడా పూర్తిగా ప్రజా సహకారంతోనే జరిగింది. గ్రామ ప్రాంతాలలో రోడ్ల ఆవశ్యకత యెంతగా ఉందో, లభించిన యీ ప్రజా సహకారాన్ని బట్టి మనం ఊహించుకోవచ్చు.

ప్రజా సహకారం :-

అశేష గ్రామీణ ప్రజానీకంనుండి నిరవధికంగా లభ్యమైన సచేతన సహకారంవల్లనే యీ మహత్తర విజయాలు,

చేకూరినవి. 1954 డిసెంబరు వరకు ప్రాజెక్టులమీద ప్రభుత్వ వ్యయం సుమారు 13 కోట్ల 48 లక్షలు ; కాగా భూమి, ధనం, శ్రమశక్తి ద్వారా వివిధ రూపాలలో ప్రజలనుండి లభించిన సహకారం యొక్క విలువ సుమారు 7 కోట్ల 48 లక్షలకు ఉంటుంది. అంటే ప్రభుత్వం చేసిన వ్యయంగాక, అందులో సుమారు నూటికి 55 వంతుల వరకుగల అదనపు విలువను సృష్టించి ప్రజలు సహకరించారు.

మన గ్రామీణ ప్రాంతాలు దారిద్ర దేవాతానిలయాలు. అవసరాలకు మించిన భూవసతిగాని, ఆర్థిక స్తోమతుగాని మన గ్రామస్థులకు లేదు. అయినప్పటికీ, ఐచ్ఛికంగా తమ సహాయ్య సహకారాలను అందించి, ప్రజలు ఈ అభివృద్ధి కార్యక్రమాలలో తమకు గల గాఢ విశ్వాసాన్ని సువ్యక్తంచేశారు.

---

## ఐదో అధ్యాయం.

కమ్యూనిటీ కార్యక్రమ ప్రధాన సిద్ధాంతమేమంటే, దాని ఆచరణకు అవసరమైన ఉత్సాహశక్తి ప్రజానీకంనుండే రావాలని, గ్రామాలలో యితఃపూర్వం ఉపయోగింపబడని ప్రజోత్సాహ మహాశక్తిని నిర్మాణ కార్యక్రమాల వైపుకు మళ్ళించి సహకార సూత్రాల మీద ప్రజాభ్యుదయ సాధనలో సద్వినియోగం చేయాలని. మనం లక్షిస్తున్న అధునాతన గ్రామీణ జీవిత విధానంలో లక్షలాది కుటుంబాలు తమంతటతాము, ఐచ్ఛికంగా వివిధ సహకార సంఘాలలో నిబంధింపబడి, తమ అభ్యుదయాన్ని గురించి స్వేచ్ఛగా నిర్ణయాలు చేసుకుంటారు; భారీయెత్తున శాస్త్రీయ వ్యవసాయ విధానాలను అనుసరిస్తూ, వికేంద్రీకృతములైన వివిధ కుటీర పరిశ్రమలు, చిన్న పరిశ్రమలలో సహాయక జీవనోపాధులను కల్పించుకుంటారుకూడా. అదే సమయంలో, వారికి ప్రభుత్వం, పరపతి సౌకర్యాలు, పరిశోధనా ఫలితాలను కల్పిస్తూ, యితర అవసర వస్తువులను సప్లై చేస్తుంటుంది. దీనిని కేవలం ఆర్థిక దృష్టితోనే చూడకూడదు. ఈ నిర్మాణ కార్యక్రమాల వ్యాప్తివల్ల కలిగే ఆర్థికేతర ఫలితాలు, సాంఘిక ప్రయోజనాలుకూడా ముఖ్యమైనవే. కాగా ఏయే ప్రధాన మార్గాలలో భావ విప్లవం యీ ప్రణాళికలవల్ల సాధింపబడాలంటే;

(1) అధిక వృత్తి కల్పన; ఉద్యాన నిర్మాణ కృషి, పశు పోషణ, మత్స్య పరిశ్రమలతో సహా, వ్యవసాయ రంగంలో

శాస్త్రీయ విధానాల అనుసరణద్వారా అధికోత్పత్తి సాధన ; సహాయక పరిశ్రమలు, కుటీర పరిశ్రమల స్థాపన.

(2) స్వయం సేవ, ఆత్మ విశ్వాసం, సహకార సిద్ధాంతాల సమగ్ర ఆచరణ, సంపూర్ణ వ్యాప్తి.

(3) గ్రామీణ ప్రాంతాలలో లభ్యమవుతున్న. ప్రజల శక్తి, ఆవకాశంలో కొంత భాగాన్ని జాత్యభ్యున్నతికై వినియోగించవలసిన ఆవశ్యకత.

అవసరమైన చోట్ల, ప్రాథమిక ఉద్యమోత్సాహాన్ని కల్పిస్తూ, ప్రభుత్వం అన్ని దశలలోను కేవలం మార్గదర్శిగానే వ్యవహరిస్తుంది. ప్రభుత్వసహకరణ వినా, యేయే రంగాల్లో అభ్యుదయసాధన కష్టతరమో, ఆయా విషయాలలో ప్రభుత్వం ప్రజలకు సహాయం చేస్తుంది.

ప్రజా సంఘాలు :

ప్రజా సహకారంవల్ల, ప్రజలకు తమ సమస్యలు, వాటి పరిష్కార విధానాలను గురించిన విజ్ఞానాభివృద్ధి, చైతన్యం కలగడమేకాకుండ, అది, వారిలో నిర్మాణ కృషికి సుముఖమైన కార్యోత్సాహశక్తిని కలుగజేస్తుందికూడా. కాబట్టి యీ కార్యక్రమం యితోధికంగా అభివృద్ధి చెందాలంటే, తగిన విధంగా ప్రజా సంఘాల నిర్మాణం అత్యవసరం. ఆ సంఘాలే ప్రజోత్సాహాన్ని సమీకరించి, కార్యక్రమాన్ని నిర్విఘ్నంగా నిర్వహించు కుంటై. గ్రామ స్థాయిలో చట్టబద్ధంగా నిర్మితములైన పంచాయితీలు ప్రణాళికా నిర్ణయంలోను, నిర్వహణలోను ప్రముఖపాత్ర వహిస్తున్నవి. యిలాంటి పంచాయితీలు లేనిచోట్ల, లేదా నామ

మాత్రావశిష్టమ్ములై ఉన్నచోట్ల, వీటికి బదులుగా అనధికార గ్రామాభివృద్ధి సంఘాల నిర్మాణం ప్రోత్సహింపబడుతున్నది. వివిధ రాష్ట్రాలలో యీ సంఘాలు, గ్రామ వికాసమండలి, గ్రామ మంగళ సమితి, గ్రామ సేవా సంఘం వగైరా వివిధ నామాలతో వ్యవహరింపబడుతున్నవి. ఈ సంఘాలద్వారా ప్రణాళిక రచన లోను, నిర్వహణలోను ప్రజా సహకారం సమీకరించబడుతున్నది.

ఈ గ్రామ సంఘాలు నిర్ణయించిన ప్రణాళిక వివరాలను, బ్లాకు స్థాయిలలో సలహా కమిటీలు మళ్లీ చర్చిస్తున్నవి. యీ కమిటీలలో, గ్రామ సంఘాల ప్రతినిధులు, స్థానిక శాసన సభ్యులు, పార్లమెంటు సభ్యులు సహకార సంస్థల ప్రతినిధులు, అభ్యుదయ భావుకులైన వ్యవసాయదార్లు మొదలైనవారు సభ్యులుగా ఉంటారు. బ్లాకు సలహా కమిటిచేత నిర్ధారితమైన ప్రణాళికలు జిల్లా ప్రణాళికలోసంలీనం చేయబడుతవి. ఈ బాధ్యత జిల్లా అభివృద్ధి కమిటీమీద ఉంటుంది ; ఈ కమిటీలోకూడా, ప్రసిద్ధులైన అనధికార నాయకులు జిల్లా స్థాయిలో వివిధ సాంకేంతిక శాఖల అధిపతులు సభ్యులై ఉంటారు. ఈవిధంగా ప్రతి దశలోనూ, అధికార, అనధికార సభ్యుల, సంస్థల పరస్పర సలహా, సంప్రదింపులతో, ప్రణాళికా నిర్ణయం, నిర్వహణ నిరంతరంగా సాగుతుంది.

## ప్రభుత్వ సహకారం :

వ్యవసాయదారుడికి పరపతి సౌకర్యాలు, పనిముట్లు, సలహా సిబ్బంది, యితర సప్లైలు వగైరా రూపాలలో యీ కార్యక్రమ నిర్వహణకు ప్రభుత్వ సహాయం లభిస్తుంది. ప్రతి సంవత్సరం

స్వల్పకాలిక ఋణాల క్రింద 100 కోట్లు, మధ్యకాలిక ఋణాల క్రింద 25 కోట్లు, దీర్ఘకాలిక ఋణాల క్రింద 5 కోట్ల వరకు రైతులకు రాష్ట్ర ప్రభుత్వాలు సహాయ పడాలనే లక్ష్యాన్ని ప్రణాళిక చివరి సంవత్సరంలోగా సిద్ధించుకునేందుకు కేంద్ర ప్రభుత్వం ఆయా ప్రభుత్వాలకు పంచవర్ష ప్రణాళిక క్రింద సహాయంచేస్తున్నది. వ్యవసాయదారులకు పరపతి సౌకర్యాల కల్పన ప్రధానమైనదిగా గుర్తించబడింది; ఎందు కంటే, అది లభ్యంకానిదే, మన కార్యక్రమంలో ఉద్దేశించిన విధంగా ప్రతికుటుంబానికి ఒక అభివృద్ధి ప్రణాళిక ఉండాలనే లక్ష్యం సిద్ధించదు. సహకార సంఘాలు యిండియాలో దాదాపు 30 సంవత్సరాలనుండి పనిచేస్తున్నప్పటికీ, యింత దీర్ఘకాలం గడిచిన తర్వాత కూడా, సహకారోద్యమం బలిష్టంగాఉన్న ప్రాంతాలలో సైతం, వ్యవసాయ దారుల కుటుంబాలలో నూటికి 30 వంతుల మందికి మాత్రమే, సహకార సంఘాలు విధించిన నిబంధనల ననుసరించి, పరపతి సౌకర్యం లభ్యమవుతున్నది. అంటే ప్రజానీకంలో నూటికి 30 మంది మాత్రమే పరపతి కలవాళ్లు అన్నమాట.

మిగిలిన 70 వంతులు ప్రజానీకానికి పరపతి కలిగించడమే, మన ప్రధాన సమస్య. కమ్యూనిటీ కార్యక్రమ నిర్వహణ ద్వారా, పరపతి సౌకర్యాల అవకాశాలను వృద్ధి చేయడానికి తీవ్రమైన చర్యలు తీసుకోబడుతున్నవి. పరపతికి ఎవరు అర్హులు అనే సమస్యపోయి, అప్పుడే, పరపతియే ప్రయోజనాల నిమిత్తం యివ్వబడుతున్నదనే చర్చకు అవకాశం లభించింది. అంటే పరపతి, వ్యక్తినిబట్టినె కాక, ప్రయోజనాన్నిబట్టి కల్పించబడుతున్నది.

అందరికీ పరపతి లభ్యమైంది కాబట్టే, వ్యక్తి ప్రాధాన్యతకు మారుగా ప్రయోజన ప్రాధాన్యత యేర్పడింది. ప్రభుత్వ ఋణాలకు అవసరమైన హామీలువగైరా యివ్వగలిగిన స్థితిలో లేనందున అనర్హులైన అనేక మంది వ్యవసాయదారులకు, యీ ప్రయోజన ప్రాధాన్యత సిద్ధాంతంవల్ల ఋణాలు లభించి, ఉత్పత్తి యెక్కువ చేసుకోవడానికి అవకాశం లభించింది.

---

# ఆరో అధ్యాయం

## ప్రణాళికా శిక్షణ

ఈ కార్యక్రమ నిర్వహణ రంగంలో ప్రభుత్వం కేవలం ఒక మార్గదర్శిగాను, సహకారిగాను వ్యవహరిస్తున్నప్పటికీ ఈ బృహత్కార్యక్రమంలోని కనీస ధర్మాలను నిర్వహించటానికి సమర్థమైన యంత్రాంగం నిర్మించవలసిన అవసరం ఉంది. ప్రణాళికను అమలుపరచడంలో వివిధ రంగాలలో, విభిన్న దశలలో, అవసరమైన కీలక సాంకేతిక నిపుణులను సమకూర్చవలసిన బాధ్యత కూడా ప్రభుత్వానికి ఉంది. శ్రద్ధతో, ఉత్సాహంతో కార్యక్రమం అమలుకు పూనుకోగలిగిన తగిన వ్యక్తులను నిర్ణయించుకొనడం కూడా, ప్రభుత్వానికి ముఖ్య కర్తవ్యమైంది. ఈ వ్యక్తులకు కావలసిన అర్హత కేవలం విజ్ఞాన సముపార్జనాశక్తి మాత్రమే కాదు; గ్రామీణ ప్రజలకు సేవచేయాలనే సంకల్పం, దీక్ష కలిగిఉండి, యీ రంగంలో ఆత్మార్పణ చేయగలిగినవారై గ్రామీణ సమస్యా పరిష్కార మార్గాన్వేషణ తత్పరులైన వ్యక్తులను యీ సందర్భంలో యెన్నుకొనవలసి ఉంది. కేవలం ఉద్యోగ వృత్తి పరులనుండి యిలాంటివారు లభించడం అంత సులభంకాదు. యిలాంటి బృహత్కార్యక్రమ నిర్వహణకు అవసరమైన విద్య, విజ్ఞానం, నిపుణత, సామర్థ్యం అభిరుచి, అభినివేశం కలిగే విధంగా కొంత మందికి ప్రత్యేక శిక్షణ యివ్వవలసి ఉంటుంది కూడా.

## గ్రామకార్య కర్తలు :

ఈ కార్యక్రమ నిర్వహణలో కీలకవ్యక్తి, సకలార్థ సాధకు డైన గ్రామ కార్యకర్త, ఆహార, వ్యవసాయ శాఖవారు 1952 లోనే దేశంలోని వివిధ రాష్ట్రాలలో 34 శిక్షణా కేంద్రాలను స్థాపించారు. వీటికి ప్రత్యేక ఆర్థిక, సాంకేతిక సహాయం అమెరికాలోని ఫోర్డ్ సంస్థ ద్వారా లభిస్తున్నది. ప్రస్తుతం పనిచేస్తున్న కేంద్రాలు చాల నందున యింకా అదనంగా 9 శిక్షణ కేంద్రాలను స్థాపించడానికి అనుమతించబడింది. యిందులో 5 కేంద్రాలు అప్పుడే ప్రారంభమైనవి.

ఈ శిక్షణ కేంద్రాలలో, వ్యవసాయానికితోడు, కొద్ది కాలంపాటు, పశుపోషణ, ప్రజారోగ్యం, సహకారం, పంచాయతీ పాలన, సాంఘికశాస్త్రం, గృహపరిశ్రమలు వగైరా విషయాలలో గూడా శిక్షణ యివ్వబడుతుంది. ఈ శిక్షణ యివ్వడంలో ప్రధానోద్దేశం ఏదో ఒక రంగంలో నిపుణులను తయారుచేయడం కానే కాదు; గ్రామీణ జీవితంలో ఉత్పన్నమయ్యే వివిధ సమస్యలకు సామాన్య పరిష్కార మార్గాల అవగాహన కలిగి, గ్రామస్థులకు అవసరమైన సందర్భాలలో సహకారాన్ని సేకరించ గల విధానాలను గ్రహించగలిగి, తగుమాత్ర విజ్ఞానంతోనే వివిధ రంగాలలో యథాశక్తి ఉపకరించగల కార్యకర్తలను తయారు చేయడమే యీశిక్షణలక్ష్యం. ప్రత్యేకశిక్షణ తరగతులతో కొన్ని కేంద్రాలలో బ్లాకుస్థాయిలో నిపుణులను—వ్యవసాయం, పశు పోషణ, సహకారపంచాయితీ పరిపాలనలకుచెందిన అధికార్లతో సహా—తయారుచేయడానికి ఏర్పాట్లు చేయబడినవి. ప్రస్తుతం నిర్వహింపబడుతున్న వాటిలో 25 కేంద్రాలలో కంసాలి, వడ్రంగి,

వగైరా చేతివృత్తుల శిక్షణకు అవకాశాలు కల్పించేపథకం ఒకటి యిప్పుడు ఆహారవ్యవసాయశాఖవారి ఆలోచనలోఉన్నది.

గ్రామాలలోని స్త్రీ జనాభ్యుదయాన్ని దృష్టిలో పెట్టుకొని, గ్రామకార్యకర్తలుగా కొంతమంది స్త్రీలకుకూడా శిక్షణ యివ్వ బడుతున్నది.

సోషల్ఎడ్యుకేషనల్ ఆర్గనైజర్ :

కమ్యూనిటీ కార్యక్రమ నిర్వహణకు అవసరమైన యితర కార్యకర్తలలో, సోషల్ఎడ్యుకేషనల్ ఆర్గనైజరు ముఖ్యుడు. ప్రజానీకంలో, కమ్యూనిటీ కార్యక్రమాలతో సహకరించే చైతన్యం అభిరుచి కలిగించడమే అయనకర్తవ్యం. దేశంలోని వివిధప్రాంతా లలో సోషల్యెడ్యుకేషన్లో ఆర్గనైజర్లు శిక్షణనిమిత్తం కమ్యూనిటీ ప్రాజెక్టుల నిర్వహణశాఖవారు 5 కేంద్రాలను నెల కొల్పారు. వీలైనంతమంది స్త్రీలనుకూడా ఎడ్యుకేషనల్ ఆర్గ నైజర్లుగా నియోగించడానికి ప్రయత్నాలు జరుగుతున్నవి.

తగిన అభిరుచి, అభినివేశం కలిగించేందుకు, బ్లాకు నిర్వ హణాధికారులకుకూడా శిక్షణ యివ్వడం జరుగుతున్నది. మా మూలుగా బ్లాక్ డెవలప్మెంటు అధికారులను, పరిపాలనా వ్యవ హారదక్షతగలిగిన ఆఫీసర్లనుండి యెన్నుకుంటారు. దేశంలో 3 చోట్ల యీఅధికార్లకు శిక్షణయివ్వడానికి కేంద్రప్రభుత్వం కేంద్రాలను నెలకొల్పింది. వైద్యకార్యకర్తల శిక్షణకేంద్రాలు కూడా నెలకొల్పబడిఉన్నవి. ఈకేంద్రాలను ఆయారాష్ట్ర ప్రభుత్వాలే నిర్వహిస్తున్నవి.

కార్యకర్తల సంఖ్యావశ్యకత :

కమ్యూనిటీ ప్రాజెక్టుల నిర్వహణనిమిత్తం ఉచితశిక్షణ పొందిన వివిధకార్యకర్తలు బహుళసంఖ్యలో లభించడం ఎంతో

అవసరం. ప్రథమప్రంచవర్ష ప్రణాళికాకాలంలో, ప్రాజెక్టు నిర్వాహణాధికార్లు, డెవలప్‌మెంట్ ఆఫీసర్లు, గ్రామకార్యకర్తలు, సోషల్ ఎడ్యుకేషన్ ఆర్గనైజర్లు, డాక్టర్లు, నర్సులు, పశువైద్యులు, స్టాక్‌మెన్, ఉపాధ్యాయులు, వ్యవసాయశాస్త్ర పట్టభద్రులు, కోపరేటివ్ యిన్స్పెక్టర్లు, కాంపౌండర్లు, శానిటరీయిన్స్పెక్టర్లు, లేడీ హెల్తు విజిటర్లు, మంత్రసానులు, ఓవర్సీరులు, వృత్తిపనుల సూపర్‌వైజర్లు, మెకానిక్కులు, ఇంజనీర్లు వగైరా, వగైరా, వివిధరకాలకుచెందిన కార్యకర్తలు మొత్తం సుమారు 84,000 మంది అవసరమైనట్లు అంచనా వేయబడింది. ఈసంఖ్య, ద్వితీయ ప్రణాళికాకాలంలో 3½ లక్షలవరకు పెరగవచ్చు.

గత 2½ సంవత్సరాలలో బహుళసంఖ్యాకులైన కార్యకర్తలకు శిక్షణయివ్వబడింది.

1954 సంవత్సరం డిశెంబరు 31 వ తేదీకి, ప్రాజెక్టు ప్రాంతాలలో పనిచేస్తున్నసుశిక్షితులైన కార్యకర్తలసంఖ్య ఈక్రింది విధంగాఉంది.

| | |
|---|---|
| గ్రామకార్యకర్తలు | 8,013 |
| సోషల్ఎడ్యుకేషనల్ ఆర్గనైజర్లు | 1,064 |
| బ్లాక్ డెవలప్‌మెంట్ ఆపీసర్లు | 638 |

ఆయాశాఖలలో నిపుణులు :

| | |
|---|---|
| అగ్రికల్చరల్ ఎక్స్టెన్షన్ ఆఫీసర్లు | 647 |
| వెటర్నరీ డాక్టర్లు | 461 |
| కోపరేటివ్ పంచాయితీ యిన్స్పెక్టర్లు | 477 |
| ఓవర్సీర్లు | 639 |

| | |
|---|---|
| డాక్టర్లు | 231 |
| శానిటరీ యిన్స్పెక్టర్లు | 91 |
| లేడీ హెల్త్ విజిటర్లు | 110 |
| మంత్రసానులు | 464 |

[ఈసంఖ్యా వివరాలు 1954 డిశెంబరు 31 వ తేదీ నాటివి. మధ్యప్రదేశ్, పంజాబ్, ఒరిస్సా, మణిపూర్, వింధ్య ప్రదేశ్ రాష్ట్రాల సమాచారంమాత్రం పూర్తిగా లభ్యం కానందున 1954 ఆగష్టువరకు అందిన వివరాలుమాత్రమే యిందులో చేర్చబడినవి.]

ఈశిక్షణా కార్యక్రమం నిరంతరంగా సాగుతున్నది. ఇప్పటికి అనేకశిక్షణ సంస్థలు ప్రారంభించి పనిచేస్తున్నవి; మరి కొన్నింటికి ప్రారంభసన్నాహాలు జరుగుతున్నవి. అందువల్ల ఈ కేంద్రాలనుండి లభ్యమయ్యే సుశిక్షితులైన కార్యకర్తలసంఖ్య క్రమక్రమంగా అభివృద్ధిచెంది, ప్రథమ, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలలో ఉద్దేశింపబడిన వ్యాప్తి కార్యక్రమ నిర్వహణకు అవసరమైనంతమంది కార్యకర్తలు లభ్యంకాగలరని భావించవచ్చు.

నవోదయ శిక్షణ

కార్యక్రమ నిర్వహణకు, తగిన కార్యకర్తలను యెన్ను కొనడంలో ప్రధానాంశం, ఆయావ్యక్తులకు కార్యక్రమంతో, ఆచరణతో, అభిప్రాయసామ్యం, అభిరుచి ఉండేటట్లు చూడడమే. ఈ అభిరుచి, అభిమానం కలిగించడానికి వివిధ కేంద్రాలలో శిక్షణ యివ్వడమే కాకుండా, కమ్యూనిటీ ప్రాజెక్టు నిర్వహణ శాఖవారు, రాష్ట్రస్థాయిలోనూ, ప్రాజెక్టుస్థాయిలోను, ప్రాంతీయం

గానూ, సమావేశాలను యేర్పాటు చేస్తున్నారు. ఈ చర్చలో గ్రామ కార్యకర్తల నుండి, కార్యక్రమంలో నిమగ్నులైన వివిధ గతుల అధికార్లు పాల్గొంటారు. ఉన్న సమస్యలను చర్చించు కుంటున్నప్పుడే క్రొత్త సమస్యలు ఉద్భవిస్తే, ఇతరుల అనుభవాలను గురించి తెలుసుకొనడం ద్వారా, ఆఫీసర్లు స్వీయానుభవాలకు మెరుగులు దిద్దుకొన గలుగుతారు; అంతేకాక, దేశంలో ఒక మారు మూలనే కొన్ని గ్రామాలకే పరిమితమై ఉన్న అధికార్లలో సైతం, యావద్భారత దృష్టి, సౌభ్రాతృభావం, సమృద్ధిగా ఉద్దీపిస్తుంది. ఈ సమావేశాలలో అనధికార ప్రముఖులుకూడ పాల్గొనడానికై ప్రోత్సహింపబడతారు. కొన్ని సమావేశాలలో అనధికార ప్రముఖుల నుండి అనేక అమూల్యమైన సలహాలు లభించినవి కూడా. ప్రాజెక్టు కార్యక్రమంలో అనధికార సహకారం యెప్పుడూ ప్రత్యేకంగా అపేక్షింపబడుతున్నది ; దేశంలో అనేక అనధికార సంస్థలు ప్రాజెక్టు కార్యక్రమాలలో వివిధ రంగాలలో ప్రాజెక్టు అధికార్లతో సహకరిస్తూ, కృషి చేస్తున్నవి.

## 5 వ అధ్యాయం

## అభ్యుదయ మహాన్వేషణ

కమ్యూనిటీ ప్రాజెక్టుల కార్యక్రమం భారత దేశంలో గత 2½ సంవత్సరాలుగా అమల్లో ఉంది. గ్రామీణ ప్రాంతాల లోని ప్రతి వ్యక్తి జీవిత కుసుమాన్ని వికాశింపజేసి, నిర్మాణ దశలో ఉన్న నవభారత మహా సౌధానికిగట్టి పునాదులు వేయడమే యీ కార్యక్రమ లక్ష్యం. మహత్తరమైన యీ ఆశయం ఎంత వరకు సాధించబడిందని తెల్సుకోడానికి 2½ సంవత్సరాల కాలపరిమాణం ఏ మూలకు వస్తుంది? ఇది చాలా స్వల్పకాలం, 1952 అక్టోబరు నెలలోనే మొదటి 55 ప్రాజెక్టులు ప్రారంభింపబడి నప్పటికీ, మొదట్లో కొన్ని నెలలవరకు ఆయా ప్రాంతాలను సర్వే చేసు కోవడం, తగిన కార్యకర్తలను నియమించుకోవడంతోనే సరిపోయింది. ఈ కార్యక్రమాలకు ప్రారంభోత్సవం జరిగిన కొంతకాలం తర్వాతనే ఒక స్పష్టమైన రూపంలో పని, ప్రారంభించ బడింది.

ఇలాంటి బృహత్కార్యక్రమం సరియైన పద్ధతుల మీద నడువబడాలంటేనూ, కార్యక్రమం ఆచరణలో అడ్డదారులు త్రొక్కి, అసలు ప్రధాన లక్ష్యాలు విస్మరింపబడే ప్రమాదం లేకుండా ఉండాలంటేనూ, తగు జాగ్రత్తలు తీసుకోవడం అవసరం. అందుకనే భారత ప్రభుత్వంవారు వివిధ రంగాలలో ప్రత్యక్ష విచారణలు జరుపగల ఒక ప్రత్యేక స్వతంత్ర సంస్థను నెలకొల్పారు. ఒక వైపున కార్యక్రమం అమలు జరుపబడుతూ ఉండంగా, దాని

వల్ల కలిగే ఫలితాలను ప్రత్యక్షంగా సరిచూసుకోడానికి యిది చక్కని అవకాశం. కార్యక్రమం యే రీతిగా అమలుపరచబడుతున్నదో, లక్ష్యసిద్ధి ఎంత వరకు కలుగుతున్నదో, కావలసిన అభిరుచి, అభిమానం, జరుగుచున్న కృషిలో ఎంత వరకు అభివ్యక్త మవుతున్నదో స్పష్టంగా తెలియగలందులకే యీ నిర్దిష్ట పరిశోధనలు, పరిశీలనలు ఉద్దేశింపబడినై. ఈ ప్రణాళికా ఫలిత నిర్ణయ సంస్థ (Programme Evaluation Organisation) కు కమ్యూనిటీ ప్రాజెక్టు నిర్వహణశాఖతో యే విధమైన సంబంధం లేదు. వివిధ ప్రాంతాలలోగల తన అధికారుల ద్వారా తనే స్వయంగానూ, సర్వస్వతంత్రంగానూ యీ సంస్థ పరిశీలనలు చేస్తుంటుంది.

కార్యక్రమ నిర్వహణను గురించి తత్ఫలితాలను గురించి విమర్శనాత్మక దృష్టితో యీ సంస్థ అనేక నివేదికలు ప్రభుత్వానికి సమర్పించింది. కొన్ని ప్రధాన విధానాల మీద యీ సంస్థవారు తమ అభిప్రాయాలు ప్రకటించారు; ఉదాహరణకు, గ్రామీణ ప్రజానీకంలో అభ్యుదయాత్మక దృక్పథం యేర్పడిందా? అధికోత్పత్తి ఎంత వరకు సాధించబడింది? కార్యక్రమ నిర్వహణలో నిమగ్నమైన ప్రభుత్వాధికారులు, తమ పూర్వవైఖరి మార్చుకుని యీనూతన దృక్పథాన్ని—అంటే శాంతిభద్రతలరక్షణ బాధ్యతతోకూడిన తమ పూర్వదర్పవైఖరివదలి, సర్వప్రజాశ్రేయో విధానాన్ని—ఎంతవరకు అలవరచుకున్నారు? అదనంగా జీవన భృతికల్పనకు ఎంతవరకు అవకాశాలు లభించాయి? మొదలైన అనేక ముఖ్యసమస్యలు ఈసంస్థ విమర్శకు గురిఅయినవి. కేంద్రంలోనూ, రాష్ట్రాలలోనూ, కమ్యూనిటిప్రాజెక్టు నిర్వహణశాఖలు

యీవిమర్శలను శ్రద్ధగా పరిశీలించి, అవసరమైన మార్పులను చేసుకుంటున్నవి.

అంతేకాక భారతప్రధాని నాయకత్వంలో పనిచేస్తున్న కమ్యూనిటిప్రాజెక్టు నిర్వహణ కేంద్రకమిటీ, యావద్భారతంలో కార్యక్రమాలను సమన్వయముచేసి నడిపించే బాధ్యతలను వహించి, అవసరమైనప్పుడల్లా నిర్వహణ వ్యవహారాలనుగురించి పరిశీలిస్తూ, తగుసూచనలను చేస్తుంటుంది. పోతే నిర్వహణరంగంలో, యావద్భారతదేశంలోనూ కార్యక్రమాన్ని అమలుపరచే బాధ్యత కేంద్రకమ్యూనిటి ప్రాజెక్టునిర్వహణశాఖవారిది. కేంద్రనిర్వహణాధికారి, ఆయనక్రింది ఉద్యోగినిపుణులు, ప్రాజెక్టునిర్వహణాధికారులతో ఉత్తరప్రత్యుత్తరాలద్వారాను, స్వయంగానూకూడ నిత్యసంబంధంకలిగిఉంటారు. కార్యక్రమం తప్పుదారిలోనడుస్తున్నప్పుడు దానిని సరిదిద్దడానికి తక్షణచర్యలు తీసుకుంటారు. ప్రజాసహకరసేకరణలోనూ, ప్రజాప్రయోజన సాధనలోనూ, మొదటి రెండు సంవత్సరాలకాలంలో కొన్ని సత్ఫలితాలు కలిగినప్పటికీ, మనం అంతిమలక్ష్యానికి యింకా దూరంగానే ఉన్నామనిచెప్పాలి. గ్రామీణప్రాంతాలలోని సామాన్య కుటుంబీకుడికి కలిగే నిర్దిష్ట ప్రయోజనాలనుబట్టి అతని మనోభావాలలోకలిగే అధునాతన దృక్పథప్రభావాన్నిబట్టి యీకార్యక్రమ విజయాన్ని మనం అంచనా కట్టుకోవాలి. ఈక్రింది ప్రశ్నలకు సంతృప్తికరమైన సమాధానాలులభిస్తే, అప్పుడు మనకు సంపూర్ణవిజయం.

ప్రతి కుటుంబానికి ఒక అభివృద్ధిప్రణాళికఉందా ? దానికోసం ఆకుటుంబం నూతనవిధానాల ననుసరించి, నిరంతరకృషి చేస్తున్నదా ?

వ్యవసాయంలాంటి ప్రధానమైన వృత్తిలో, పనిపాటులు అంతగా ఉండని సమయాల్లో పనిచేసుకోడానికి యితరవృత్తులు ఆకుటుంబానికి లభిస్తున్నవా ?

ప్రాజెక్టు ప్రాంతంలోని ప్రతికుటుంబానికి పరపతి సౌకర్యం లభించిందా, కనీసం ఒకసహకార సంఘంలోనైనా కుటుంబం తన హక్కును వినియోగించుకుంటున్నదా ?

సమాజ సమిష్టిప్రయోజన నిర్మాణ కర్యక్రమాల్లో ధన రూపేణాలేదా శ్రమదానరూపేణాగాని ప్రతికుటుంబం తనవంతు బాధ్యతను నిర్వహిస్తున్నదా ?

ఈమహోద్యమంలో పాల్గొనడానికి, గ్రామాల్లోని యువ జనులు మహిళలు ఎంతవరకు సుముఖులైనారు ?

కేవలం తాత్కాలిక ప్రయోజనాలుగామాత్రమేకాక, ఈకార్యక్రమాలు గ్రామాల జీవితచైతన్యంలో శాశ్వతంగా భాగస్వామిత్వాన్ని సాధించుకోగలిగాయా ? ఈకార్యక్రమాలు గ్రామీణ నిత్యజీవితంలోకి వేళ్లుప్రాకి, లోతులకు చొచ్చుకు పోగలిగాయా ? యిప్పుడు వ్యక్తిలోవచ్చినమార్పు, తనభవితవ్య నిర్ణేతతనే చైతన్యాన్ని కల్గించగలశక్తిగలదేనా ? దేశంలో యేదో మారుమూల, 5 లేక 10, గ్రామాలకు బాధ్యతవహించిన గ్రామకార్యకర్తకుగాని, లేక కేంద్రమయ్యానిటి ప్రాజెక్టు నిర్వహణ శాఖాధికారికిగాని - వివిధతరగతుల అధికారులకు - మనసులో కలవరపెడుతున్న ప్రశ్నలు, సంతృప్తికరమైన సమాధానాలు లభించవలసిన ప్రశ్నలివియే.

ఈ కార్యక్రమ నిర్వహణ సర్వం ఒక మహాప్రజాచైత న్యోద్యమంగా ప్రభుత్వం భావిస్తున్నది. ఇందులో ప్రధానపాత్ర

ధారి ప్రభుత్వంకాదు, ప్రజలే. ఈఉద్యమంద్వారా మన ఆదర్శమైన శ్రేయోరాజ్య సుగమపథ నిర్మాణం జరుగుతున్నది. ఈపథ నిర్మాణబాధ్యత ప్రజలదే; దీన్నిగమించేదివారే; అధిగమించేది వారే.

ఈనవభారత నిర్మాణబాధ్యతను ప్రజలు, ప్రజాసేవకులు, ప్రజాప్రతినిధులు ఎంతవరకు వహిస్తారనే దానిమీద మన విజయ సాధన ఆధారపడిఉంది. వివిధసిద్ధాంతాల, విధానాల నినాదాలతో ఆకాశం చిల్లులుపడిపోతున్నది. కాని ఆకలి, అనారోగ్యం, అజ్ఞానం - యివి కేవలం సిద్ధాంతాల వల్లింపువల్ల నిర్మూలింపబడవు. మంత్రాలకు చింతకాయలు రాలగవుగదా! మన శ్వేదాశ్రువులలోనే మన సమస్యాపరిష్కారం యిమిడిఉంది. చెమటోడ్చి మనకోసం పనిచేసుకోవాలి. అదే మనలక్ష్యసిద్ధికి దగ్గరదారి. శాంతి అహింసలమార్గంలో, ఒకనూతనజీవితవికాసాన్ని ఒక సంపూర్ణజీవితసౌందర్యాన్ని సాధించడానికి, యీాకమ్యూనిటి ప్రాజెక్టులరూపంలో భారతదేశం నిరంతరం కృషిచేస్తున్నది. ఒక నూతనజీవిత సౌరభ్యంకోసం వెతుకుతున్నది. ఒకవెలుగుకోసం పరితపిస్తున్నది. ఇది ఒకనిరంతర అన్వేషణ. జీవితఅభ్యుదయ మహాన్వేషణ.

---

# అనుబంధం 1.

## శిక్షణ కేంద్రాలు :

[: ప్రాజెక్టు కార్యకర్తల నిమిత్తం ప్రత్యేకంగా నెలకొల్పబడినవి :]

| రాష్ట్రం | జిల్లా | శిక్షణకేంద్రం |
|---|---|---|
| ఆంధ్ర | తూర్పు గోదావరి | సామల్కోట |
| ఆంధ్ర | పశ్చిమ ,, | గోపన్నపాలెం |
| అస్సాం | సిబ్సా నగర్ | జోరట్ |
| బీహార్ | పాట్నా | పాట్నా |
| బీహాక్ | ముజఫర్ పూర్ | ముజఫర్ పూర్ |
| బీహార్ | రాంచీ | కంకా |
| బొంబాయి | కైరా | ఆనంద్ |
| బొంబాయి | ధార్వార్ | ధార్వార్ |
| బొంబాయి | పూనా | మంజరి |
| మధ్యప్రదేశ్ | హోసంగాబాద్ | పోవర్ఖేడా |
| మధ్యప్రదేశ్ | చాందా | సిందెవాహి |
| మద్రాసు | మధుర | గాంధీగ్రాం |
| మద్రాసు | దక్షిణ మలబార్ | పర్లీ |
| ఒరిస్సా | బొలంగీర్ | బొలంగీర్ |
| పంజాబ్ | కర్నాల్ | నిలోఖేరి |
| పంజాబ్ | గుర్దాస్ పూర్ | పటియాలా |
| ఉత్తర ప్రదేశ్ | లక్నో | బక్షీ-కా-తలాబ్ |
| ఉత్తర ప్రదేశ్ | ఆల్మోరా | హావాల్ బాగ్ |

| | | |
|---|---|---|
| ఉత్తర ప్రదేశ్ | ఝూన్సీ | చిరగాన్ |
| ఉత్తర ప్రదేశ్ | గాజిపూర్ | గాజిపూర్ |
| ఉత్తర ప్రదేశ్ | గోరఖ్ పూర్ | గోరఖ్ పూర్ |
| ఉత్తర ప్రదేశ్ | బలంద్ షార్ | బలంద్ షార్ |
| పశ్చిమ బెంగాల్ | బర్ద్వాన్ | బర్ద్వాన్ ఫారం |
| పశ్చిమ బెంగాల్ | నాడియా | ఫులియా-1 |
| పశ్చిమ బెంగాల్ | నాడియా | ఫులియా-2 |
| పశ్చిమ బెంగాల్ | హుగ్లీ | చిన్సూరా |
| హైదరాబాద్ | హైదరాబాద్ | హిమాయత్ సాగర్ |
| హైదరాబాద్ | హైదరాబాద్ | పర్భని (ప్రస్తుతం హిమాయత్ సాగర్ లోనే ఉంది.) |
| మధ్య భారత్ | గ్వాలియర్ | అంత్రి |
| మైసూరు | మాండ్య | మాండ్య |
| పెప్సూ | — | నాభ |
| రాజస్థాన్ | కోటా | భతార్ పురా |
| రాజస్థాన్ | — | షియోగంజ్ |
| సౌరాష్ట్ర | జునాఘర్ | జునాఘర్ |
| తిరువాన్కూర్-కొచ్చి | — | కొట్టరకార |
| భోపాల్ | — | బైరఘర్ |
| హిమాచల ప్రదేశ్ | మహాసు | మషోబ్రా |
| వింధ్య ప్రదేశ్ | ఛత్తేర్ పూర్ | నౌగాంగ్ |
| జమ్మూ-కాశ్మీర్ | — | శ్రీనగర్ |

## : సోషల్ ఎడ్యుకేషనల్ ఆర్గనైజర్ల శిక్షణ కేంద్రాలు :

[సోషల్ ఎడ్యుకేషన్ ఆర్గనైజర్లకు శిక్షణ నిమిత్తం]

| | | |
|---|---|---|
| మద్రాసు | మధుర | గాంధీగ్రాం |
| పంజాబు | కర్నాల్ | నిలొఖేరీ |
| ఉత్తర ప్రదేశ్ | అలహాబాద్ | అలహాబాద్ |
| పశ్చిమ బెంగాల్ | బీర్భూమి | శ్రీనికేతన్ |
| హైదరాబాద్ | — | హిమాయత్ సాగర్ |
| *బొంబాయి | బరోడా | బరోడా |

*సోషల్ ఎడ్యుకేషన్ ఆర్గనైజర్లుగా
స్త్రీలకు ప్రత్యేక శిక్షణ

## : బ్లాక్ డెవలప్‌మెంటు అధికారుల శిక్షణ కేంద్రాలు :

[100 గ్రామాలుకల బ్లాకులలో డెవలప్‌మెంట్ అధికారుల శిక్షణ నిమిత్తం]

| | | |
|---|---|---|
| బీహార్ | రాంచీ | ది పటోలీ కాంప్ |
| పంజాబు | కర్నాల్ | నిలొఖేరీ |
| హైదరాబాద్ | ... | హిమాయత్ సాగర్. |

## : ప్రజారోగ్య నవోదయ శిక్షణ కేంద్రాలు :

| | | |
|---|---|---|
| మద్రాసు | మద్రాసు | పూనమల్లి, మద్రాస్ |
| పశ్చిమ బెంగాల్ | హుగ్లీ | సింగూరు |
| ఢిల్లీ | ఢిల్లీ | నజఫ్ గర్. |

---

## అనుబంధం 2.

### ప్రజోద్యమ వ్యవస్థ

పార్లమెంటు

|

రాష్ట్ర శాసన సభ

|

జిల్లా బోర్డులు

|

తాలుకా బోర్డులు

|

ఫిర్కా బోర్డులు

|

గ్రామ అభివృద్ధి సంఘం

↓

ప్ర జ లు:

## అనుబంధం. 3.

: ఒక్కొక్క డెవలప్ మెంట్ బ్లాకు మీద జరిగే ఖర్చు అంచనా :

(కమ్యూనిటీ ప్రాజెక్టు బేసిక్ టైపు)

ఈ బడ్జెట్ అంచనా కేవలం సూచన ప్రాయమే. ఆయా ప్రాంతాలలోని పరిస్థితులకు అనుగుణంగా దీన్ని మార్చుకోవాలి.

[లక్షల రూపాయల్లో]

| ఖర్చుపద్దు. | మొత్తం | రూపాయలు | డాలర్లు | రికరింగ్ | నాన్ రికరింగ్ | అప్పులు | అప్పులు కాక యితర రకాలు. |
|---|---|---|---|---|---|---|---|
| 1. ప్రాజెక్టు ప్రధాన కార్యస్థానం :<br>(ఏ) కార్యకర్తలు<br>(బి) ప్రయాణ సౌకర్యాలు (1)<br>(సి) ఆఫీసు నిర్వహణ | 2.23 | 2.08 | 0.15 | 2.05 | 0.18 | ... | 2.23 |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 2. వ్యవసాయం, పశుపోషణ అభివృద్ధి | | | | | | | |
| (ఎ) ట్రాక్టర్లు | 0.24 | ... | 0.24 | ... | 0.24 | 0.24 | ... |
| (బి) ప్రదర్శన పరికరాలు | 0.10 | 0.10 | ... | ... | 0.10 | ... | 0.10 |
| (సి) ఉపకార్య స్థానాలు | 0.9 | 0.9 | ... | 0.07 | 0.02 | ... | 0.09 |
| (డి) రిపేరు సర్వీసు కేంద్రం (1) | 0.05 | 0.05 | ... | ... | 0.05 | 0.05 | ... |
| (ఇ) మార్కెటింగ్ సెంటరు | 0.10 | 0.10 | ... | ... | 0.10 | 0.10 | ... |
| (ఎఫ్) కీలక గ్రామ ప్రణాళికలు | 0.29 | 0.26 | 0.03 | 0.21 | 0.08 | ... | 0.29 |
| 3. ఇరిగేషన్ | 5.00 | 4.30 | 0.70 | ... | 5.00 | 5.00 | ... |
| 4. క్రొత్తసాగు | 0.25 | 0.25 | ... | ... | 0.25 | 0.25 | ... |
| 5. ఆరోగ్యం, గ్రామీణ పారిశుధ్యం. | | | | | | | |
| (1) (ఎ) ఆస్పత్రుల నిత్య ఖర్చు | 0.10 | 0.10 | ... | 0.10 | .. | ... | 0.10 |
| (బి) భవనాలు | 0.10 | 0.10 | ... | ... | 0.10 | ... | 0.10 |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| (సీ) ఆస్పత్రి పరికరాలు వగైరా | 0.10 | 0.07 | 0.03 | ... | 0.10 | ... | 0.10 |
| (ii) మంచి నీటి సప్లై | 0.50 | 0.50 | ... | ... | 0.50 | ... | 0.50 |
| (iii) మురుగు పారుదల సౌకర్యాలు పారిశుద్ధ్యం | 0.25 | 0.25 | ... | ... | 0.25 | ... | 0.25 |
| 6. విద్య | 1.50 | 1.50 | ... | 1.00 | 0.50 | ... | 1.50 |
| 7. సాంఘిక విజ్ఞాన వ్యాప్తి దృశ్య, శ్రవ్య రీతీ ప్రచారం సహా) | 0.50 | 0.35 | 0.15 | 0.30 | 0.20 | ... | 0.50 |
| 8. రహదార్లు | 1.25 | 1.15 | 0.10 | ... | 1.25 | ... | 1.25 |
| 9. గ్రామీణ చేతి వృత్తులు | 1.25 | 1.25 | ... | 0.50 | 0.75 | 0.75 | 0.50 |

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 10. గృహ నిర్మాణం (ప్రాజెక్టు కార్యకర్తలకు గ్రామీణ సౌకర్యార్థం) | 1.10 | 1.10 | ... | ... | 1.10 | 1.10 | ... |
| మొత్తం | 15.00 | 13.60 | 1.40 | 4.23 | 10.77 | 7.49 | 7.51 |

ఒక్కొక్క డెవలప్‌మెంటు బ్లాకు మీద ఖర్చు — రూ. 15 లక్షలు.

కేంద్రం భరించేది—రికరింగ్ ఖర్చులో 50%
నాన్ రికరింగ్ ఖర్చులో 75% } — 12.07 లక్షలు.

అప్పులు

రాష్ట్ర ప్రభుత్వవాటా — 2.93 లక్షలు.

## అనుబంధం 3 (ఎ)

నేషనల్ ఎక్స్టెన్షన్ సర్వీస్ డెవలప్‌మెంట్ బ్లాక్ (100 గ్రామాలు) మీద ఖర్చుఅంచనా :

(ఈబడ్జెట్ అంచనా కేవలం సూచనప్రాయమే. ఆయా ప్రాంతాలలోని పరిస్థితులకు అనుగుణంగాదీన్ని మార్చుకోవాలి)

1. కార్యకర్తలు :

1. యస్. డి. ఒ. కు సహాయంగా పనిచేయడానికి ఒకబ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరు(250-400) నెలకు రు 350 చొ॥ సంవత్సరానికి రు. 4,200

2. ముగ్గురు ఎక్స్టెన్షన్ ఆఫీసర్లు(వ్యవసాయం, పశుపోషణ పంచాయతీలు - సహకారం,) ,, 9000

3. ఇద్దరు సోషల్ఎడ్యుకేషనల్ ఆర్గనైజర్లు (ఒకస్త్రీ, ఒక పు.) నెల 1-కి రు 125 చొ. ,, 3000

4. ఒక ఓవర్సీరు : ప్రజారోగ్యం నిమిత్తం : నెలకు రు 250 చొ॥ ,, 3000

5. 10 మంది గ్రామకార్యకర్తలు నెలకు రు 100 చొ॥ ,, 12,000

6. ఒక అకవుంటెంట్ - స్టోర్‌కీపర్, ఒకటైపిస్టు - గుమాస్తా, నాలుగోగ్రేడ్ సిబ్బంది -ముగ్గురు ,, 6,000

7. జీపుకారు నిర్వహణ, డ్రైవరు జీతంసహా ,, 3500

8. ఇతర ఖర్చులు ,, 3,300

మొత్తం 44,000

నాల్గవవంతు సిబ్బంది యిదివరకేఉన్నట్లు భావించినందున, నాల్గవవంతు తీసేయగా 11,000

ఒక సంవత్సరానికి అదనపు సిబ్బంది నిమిత్తం అయ్యేఖర్చు— 33.000

అదే 3 సంవత్సరాల కాలానికి రు 99,000 లేక

రు 100,000

II ప్రయాణసౌకర్యాలు (ట్రైలర్ సహా ఒక జీపుకారు), ఆఫీసు నిర్వహణ, సైకిళ్లు, ఫర్నిచరు. స్థిరాస్తులు ఆఫీసుభవనం. విత్తనాలు, పరికరాలు, స్టోరు : 50,000

III స్థానికనిర్మాణ కార్యక్రమాలు (రోడ్లు, వంతెనలు ప్రజారోగ్యకార్యక్రమాలు, పారిశుద్ధ్యం; మురుగుపారుదల వగైరా 150,000

IV సాంఘిక విజ్ఞానవ్యాప్తి: వ్యవసాయదార్లకు బహుమతులు, యితరస్కీములకు బహుమానాలు 25,000

V పాఠశాలలు, ఆస్పత్రులు వగైరాస్థానిక సంస్థలకు నిత్యఖర్చుల నిమిత్తం యిచ్చేగ్రాంట్లు : 25,000

VI మైనర్ యిరిగేషన్ స్కీములకు అప్పులు : 1,00,000

VII స్వల్పకాలిక ఋణాలరూపేణా పరపతిసౌకర్యాలు : 3,00,000

మొత్తము రు 7,50,000 లేక

$7\frac{1}{2}$ లక్షలు.

ఖర్చుల వివరం :

| | |
|---|---|
| 3 సంవత్సరాలకు మొత్తంఖర్చు | రు 7.5 లక్షలు. |
| రికరింగ్ ఖర్చు : | రు 1.5 ,, |
| నాన్‌రికరింగ్ ఖర్చు | రు 2.0 ,, |
| అప్పు | రు 4.0 ,, |
| కేంద్రం భరించేది—రికరింగ్ ఖర్చులో 50% స్వల్పకాలిక ఋణాలు మినహా మిగిలిన ఖర్చు 2.25 + 1.0 | 3.25 ,, |
| రాష్ట్రప్రభుత్వం వాటా | 1.25 ,, |
| రాష్ట్రప్రభుత్వాలు, రిజర్వ్‌బ్యాంక్, సహకార సంఘాలు వగైరాద్వారా స్వల్పకాలిక ఋణప్రదానం | 3.00 ,, |

---

# అనుబంధము. 4

## : కమ్యూనిటీ ప్రాజెక్టులు, నేషనల్ ఎక్స్టెన్షన్ సర్వీసులను దేశవ్యాప్తంగా అమలు పరచటానికి అవసరమయ్యే సిబ్బంది అంచనాలు :

| సిబ్బంది వివరం: | నేషనల్ ఎక్స్టెన్షన్ సర్వీసు బ్లాకులు 2404 (500 + 1904) | | నేషనల్ ఎక్స్టెన్షన్ సర్వీసు బ్లాకులు 2524 (620 + 1904) జాతీయాభివృద్ధి కార్యక్రమాల క్రింది సత్వరాభివృద్ధికై ప్రారంభించవలసినది. | | మొత్తం. |
|---|---|---|---|---|---|
| | ఒక్కొక్క బ్లాకుకు | మొత్తానికి | ఒక్కొక్క బ్లాకుకు | మొత్తానికి | |
| (ఎ) పరిపాలనా నిర్వహణ : | | | | | |
| 1. బ్లాక్ డెవలప్ మెంట్ ఆఫీసరు | 1 | 2404 | 1 | 2524 | 4928 |
| 2. డైవర్లుసహా గుమాస్తాలు | 6 | 14424 | 15 | 37860 | 52284 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| | (బి) వ్యవసాయం : | | | | |
| 3. | వ్యవసాయ శాస్త్ర పట్టభద్రులు | 1 | 2404 | 1 | 2524 | 4928 |
| 4. | గ్రామకార్యకర్తలు (పురుషులు) | 10 | 24040 | 10 | 25240 | |
| 5. | ,, (స్త్రీలు) | ... | ... | 2 | 5048 | 54328 |
| | (సి) పశు పోషణ : | | | | | |
| 6. | పశువుల డాక్టరు | 1 | 2404 | 1 | 2524 | 4928 |
| 7. | స్టాక్ మెన్ | ... | ... | 2 | 5048 | 5048 |
| 8. | మెసెంజర్లు | ... | ... | 2 | 5048 | 5048 |
| | (డి) సహకారం : | | | | | |
| 9. | కోపరేటివ్ ఇన్స్పెక్టర్లు | 1 | 2404 | 1 | 2524 | 4928 |
| | (ఇ) విద్య : | | | | | |
| 10. | ఉపాధ్యాయులు | ... | ... | 62 | 156488 | 156488 |
| | (యఫ్) సాంఘిక విజ్ఞాన వ్యాప్తి : | | | | | |
| 11. | సోషల్ ఎడ్యుకేషన్ ఆర్గనైజర్లు | 2 | 4808 | 2 | 5048 | 9856 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| (జి) వైద్య సౌకర్యాలు : | | | | | |
| 12. డాక్టర్లు | ... | ... | 1 | 2524 | 2524 |
| 13. కాంపౌండర్లు | ... | ... | 1 | 2524 | 2524 |
| 14. శానిటరీ ఇన్‌స్పెక్టర్లు | ... | ... | 1 | 2524 | 2524 |
| 15. లేడీ హెల్త్ విజిటర్లు | ... | ... | 1 | 2524 | 2524 |
| 16. మంత్రసానులు | ... | ... | 4 | 10096 | 10096 |
| 17. స్వీపర్లు | ... | ... | 2 | 5048 | 5048 |
| (హెచ్) నిర్మాణాలు : | | | | | |
| 18. ఇంజనీర్లు | ... | ... | 1/3 | 841 | 841 |
| 19. ఓవర్సీర్లు | 1 | 2404 | 2 | 5048 | 7452 |
| (ఐ) చేతి వృత్తులు | | | | | |
| 20. పర్యవేక్షకులు | ... | ... | 2 | 5048 | 5048 |
| 21. మెకానిక్కులు | ... | ... | 3 | 7572 | 7572 |
| మొత్తం : | | 55,292 | | 2,93,625 | 3,48,917 |

## అనుబంధం 5.

1952-53 అక్టోబరు మధ్యకాలంలో ప్రారంభింపబడిన కమ్యూనిటీ ప్రాజెక్టులు, డెవెలప్‌మెంట్ బ్లాకులలో 1952 నుండి 1954 డిశెంబరువరకు జరిగిన కృషిసమీక్ష :

[19-3-55 నాటి తాత్కాలిక అంచనాలు]

పి. అంటే పూర్తిప్రాజెక్టు
డి. అంటే డెవలప్‌మెంట్ బ్లాకు.

| | పార్టు 'ఎ' రాష్ట్రాల్లో (33 పి, 15 డి) | పార్టు 'బి' రాష్ట్రాల్లో (9 పి, 8 డి) | పార్టు 'సి' రాష్ట్రాల్లో (2 పి, 9 డి) | మొత్తం (44 పి, 32 డి) |
|---|---|---|---|---|
| *1. రాష్ట్రాలకు, ప్రాజెక్టు కార్యస్థానాలకుగాను ప్రభుత్వవ్యయం (వేలసంఖ్యలో) | 17,911·19 | 4,640·08 | 2,861·30 | 25,412·66 |
| వ్యవసాయం, పశుపోషణ : | | | | |
| 2. ఎరువులగుంటలు | 266,015 | 102,497 | 26,174 | 394,686 |
| 3. ఎరువుల పంపకం (మణుగుల్లో) | 1,795,109 | 571,461 | 33,274 | 23,99,844 |
| 4. విత్తనాలపంపకం (మణుగుల్లో) | 565,091 | 131,324 | 46,022 | 742,437 |

| | | | | |
|---|---|---|---|---|
| 5. వ్యవసాయ పరికరాలపంపకం | 54,042 | 19,772 | 5,715 | 79,529 |
| 6. ప్రదర్శనల నిర్వహణ | 322,927 | 56,908 | 33,695 | 413,530 |
| 7. పండ్లపెంపకం (యకరాల్లో) | 1,227 | 7,853 | 3,899 | 24,023 |
| 8. కూరగాయలపెంపకం (యకరాలు) | 33,806 | 19,550 | 10,509 | 63,865 |
| 9. బ్రీడింగ్ కేంద్రాలు : | 432 | 39 | 32 | 503 |
| 10. ఎద్దులసంరక్షణ | 172,065 | 46,773 | 30,126 | 248,964 |
| 11. మేలుజాతి యెద్దులసప్లై | 724 | 235 | 180 | 1,139 |
| 12. డిటో పక్షులసప్లై | 34,796 | 2.368 | 5,447 | 42,611 |
| 13. పశువులటీకాలు | 3,789,285 | 772,902 | 211,451 | 4,773,638 |
| 14. పశురోగనివారణ | 1,314,592 | 397,365 | 240,309 | 1,952,266 |
| 15. చేపలసప్లై | 5,341,214 | 37,106 | 768,766 | 6,147,086 |
| *16. వ్యవసాయం, పశుపోషణమీాద ప్రభుత్వవ్యయం (వేలసంఖ్యలో) | 9,775·41 | 2,156·92 | 872·13 | 12,804·46 |

| | | | | |
|---|---|---|---|---|
| 17. కొత్తగా సాగులోకివచ్చిన విస్తీర్ణం (యకరాల్లో) | 151,055 | 36,962 | 26,349 | 214,366 |
| *18. కొత్తసాగుకు ప్రభుత్వవ్యయం (వేలలో) | 1,350·30 | 307·76 | 219·10 | 1,877·16 |
| ఇరిగేషన్ : | | | | |
| 19. ఇరిగేషన్ క్రిందికి కొత్తగా తేబడిన భూమి (యకరాల్లో) | 406,871 | 95,167 | 36,875 | 538,913 |
| *20. ఇరిగేషన్ మీద ప్రభుత్వవ్యయం (వేలలో) | 13,963·77 | 4,583·58 | 1,267·14 | 19,814·49 |
| ప్రజారోగ్యం, గ్రామీణ పారిశుద్ధ్యం : | | | | |
| 21, నీరుయింకేగుటలు | 45,429 | 21,197 | 3,827 | 70,453 |
| 22. గ్రామాల్లో మరుగుదొడ్లు | 15,394 | 1,860 | 596 | 17,850 |
| 23. మురుగుకాల్వలు (గజాలలో) | 5,72,815 | 56,231 | 56,044 | 685,090 |
| 24. బావులు | 4,330 | 850 | 526 | 5,706 |

| | | | | |
|---|---|---|---|---|
| 25. బావులమరమ్మత్తు | 7,809 | 1,219 | 1,175 | 10,203 |
| *26. ప్రజారోగ్య, గ్రామీణపారిశుద్ధ్యం మీాద ప్రభుత్వవ్యయం (వేలలో) | 6,041·60 | 1,952·45 | 1,273·34 | 9,267·39 |
| విద్య : | | | | |
| 27. క్రొత్తపాఠశాలలు | 1,778 | 892 | 472 | 3,142 |
| 28. బేసిక్ హైస్కూళ్ళ క్రిందికి మార్చబడిన పాఠశాలలు | 945 | 277 | 125 | 1,347 |
| *29. విద్యాశాఖమీాద ప్రభుత్వవ్యయం (వేలలో) | 4,455·89 | 1,600·63 | 610·13 | 6,666·65 |
| సాంఘిక విజ్ఞానవ్యాప్తి : | | | | |
| 30. వయోజనవిద్యా కేంద్రాలు : | 6,862 | 1,486 | 892 | 9,240 |
| 31. నేర్చుకుంటున్న వయోజనులు : | 1,02,238 | 36,494 | 8,369 | 1,47,101 |

| | | | | |
|---|---|---|---|---|
| 32. కమ్యూనిటీ కేంద్రాలు : | 14,752 | 2;257 | 2,124 | 19,138 |
| 33. జాతీయవినోద కార్యక్రమాలు | 26,041 | 3,361 | 1,468 | 30,870 |
| 34. ప్రజాసంస్థలనిర్మాణం : | 4,953 | 1,429 | 706 | 7,088 |
| *35. సాంఘికవిజ్ఞానవ్యాప్తికి ప్రభుత్వవ్యయం వేలలో | 2701·44 | 389·82 | 337·90 | 3,429·16 |
| రహదార్లు : | | | | |
| 36. పక్కా-రోడ్లు (మైళ్లలో) | 525 | 108 | 102 | 735 |
| 37. కచ్చారోడ్లు (మైళ్లలో) | 5,646 | 1,178 | 1,537 | 8,361 |
| * 38. రహదార్లు ప్రయాణ సౌకర్యాల మీాద ప్రభుత్వవ్యయం (వేలలో) | 8,182·59 | 3.095·18 | 1,753·51 | 13,031·28(a) |
| లలిత కళలు, చేతి వృత్తులు : | | | | |
| 39. ఉత్పత్తి, శిక్షణ కేంద్రాలు | 122 | 28 | 41 | 191 |

| | | | | |
|---|---|---|---|---|
| * 40. చేతివృత్తులు వగైరా మీద ప్రభుత్వవ్యయం వేలలో | 2,286·59 | 1,049·92 | 582·67 | 3,919·18 |
| సహకారం | | | | |
| 41. క్రొత్త సహకార సంస్థలు | 1702 | 396 | 272 | 2370 |
| 42. సహకార సంస్థల క్రొత్త సభ్యత్వం | 30053 | 766(a) | 1230 | 32049' |
| గృహ నిర్మాణం : | | | | |
| 43. గ్రామాల్లో గృహ నిర్మాణం | 5730 | 2704 | 2754 | 11188 |
| 44. గ్రామాల్లో యిండ్ల మరమ్మతు | 91,660 | 2,530 | 2,276 | 96,466 |
| * 45 మొత్తం ప్రభుత్వవ్యయం (వేలలో) | 75,657·00(b) | 23,203·63(c) | 11,367·17(d) | 110,227·82 |
| ప్రజా సహకారం | | | | |
| 46. శ్రమ రూపంలో (వేలలో)<br>47. ధన రూపంలో, యితర విధాలు (వేలలో) | 33,824 | 3,749<br>5,956 | 4,179 | 47,708 |

* ఈ గుర్తు గలవి ఖర్చు పద్దులు:

(ఎ) సమాచారం పూర్తిగా లభించలేదు.

(బి) యిందులో దిగుమతి చేసుకొన్న వస్తువుల విలువ (23-11-54 వరకు), నిర్మాణాల ఖర్చు, విద్యుచ్ఛక్తి, ప్రచారం, సహకారం అడ్వాన్సు ఋణాల, యితర విధాలైన అడ్వాన్సులు, సస్పెన్స్ అకవుంట్‌లోని మొత్తము, వగైరా అన్ని కలిసి సుమారు 90 లక్షల రూపాయల మొత్తం కలిసింది. వివరాలు యివ్వబడలేదు.

(సి) యిందులో దిగుమతి చేసుకున్న వస్తువుల విలువ (23-11-54 వరకు.) శిక్షణ కేంద్రాల ఖర్చులు, ప్రయాణాలు, అడవులు, ఆదర్శ గ్రామ ప్రణాళికలు, సస్పెన్సు అకవుంట్ మొత్తం వగైరా కలిసి రు. 34 లక్షల రూపాయల మొత్తం కలిసింది.

(డి) యిందులో దిగుమతి చేసుకున్న వస్తువుల విలువ (23-11-54 వరకు), (రు. 15.7 లక్షలు), నిర్మాణాలు, యితర ఖర్చులు (18,830) వగైరా 16 లక్షల రూపాయల మొత్తం కలిసింది.

## అనుబంధం 5 (ఎ)

(19-3-55 నాటికి తాత్కాలిక అంచనాలు)

నేషనల్ ఎక్స్టెన్షన్ సర్వీస్ బ్లాకులలో 1953-54 సం॥ లలో
1953 అక్టోబరు నుండి 1954 డిశెంబరు వరకు జరిగిన

కృ షి స మీ క్ష :

| | పార్టు 'ఎ' రాష్ట్రాల్లో (190)* | పార్టు 'బి' రాష్ట్రాల్లో (44)** | పార్టు 'సి' రాష్ట్రాల్లో (16) | మొత్తం. (250) |
|---|---|---|---|---|
| వ్యవసాయం, పశుపోషణ : | | | | |
| 1. మెరువుల గుంటలు | 1,20,537 | 63,176 | 23,324 | 2,07,037 |
| 2. మెరువుల పంపకం (మణుగులు) | 7,20,642 | 1,05,022 | 29,289 | 8,54,953 |
| 3. విత్తనాల పంపకం (మణుగులు) | 3,49,226 | 70,021 | 15,337 | 4,34,784 |
| 4. వ్యవసాయ పరికరాల పంపకం | 11,926 | 6,012 | 3,603 | 21,541 |
| 5. వ్యవసాయ ప్రదర్శనలు | 13,439 | 4,298 | 1,850 | 19,587 |
| 6. పండ్ల పెంపకం (యకరాలు) | 11,142 | 6,098 | 1,805 | 19,045 |

| | | | | |
|---|---|---|---|---|
| 7. కూరగాయల పెంపకం (యకరాలు) | 32,560 | 13,808 | 2,228 | 48,596 |
| 8. బ్రీడింగ్ కేంద్రాలు : | 181 | 49 | 5 | 235 |
| 9. కృత్రిమ గర్భధారణ కేంద్రాలు | 46 | 71 | 6 | 123 |
| 10. ఎద్దుల సంరక్షణ | 78,347 | 34,337 | 13,687 | 1,26,371 |
| 11. మేలు జాతి ఎద్దుల సప్లై | 1,991 | 94 | 26 | 2,116 |
| 12. మేలుజాతి పశువుల సప్లై | 19,526 | 5.459 | 2,191 | 27,176 |
| 13. పశురోగ నివారణ | 5,52,403 | 2,39,754 | 1,35,383 | 9,27,540 |
| 14. చేపల సప్లై | 7,97,425 | 12,704 | 1,15,138 | 9,25,267 |
| క్రొత్తసాగు : | | | | |
| 15. క్రొత్తగా సాగైన భూమి (యకరాల) ఇరిగేషన్ : | 60,429 | 14,452 | 1,06,762 | 1,81,643 |
| 16. ఇరిగేషన్ క్రిందికి క్రొత్తగా వచ్చిన భూమి (యకరాలు) | 1,80,233 | 28,228 | 12,402 | 2,20,863 |

| | | | | |
|---|---|---|---|---|
| ప్రజారోగ్యం, గ్రామ పారిశుద్ధ్యం : | | | | |
| 17. నీరు యింకే గుంటలు | 24,163 | 24,725 | 3,195 | 52,083 |
| 18. గ్రామాల్లో మరుగుదొడ్లు | 7,764 | 727 | 720 | 9211 |
| 19. మురుగు కాల్వలు | 3,05,625 | 68,765 | 25,424 | 399,815 |
| 20. బావులు | 1,966 | 436 | 200 | 2,602 |
| 21. బావుల మరమ్మత్తు | 4,086 | 591 | 531 | 5,208 |
| విద్య : | | | | |
| 22. క్రొత్త పాఠశాలు | 1,624 | 633 | 191 | 2,448 |
| 23. బేసిక్ పైపు క్రింద మార్చబడినవి. | 239 | 56 | 19 | 314 |
| సాంఘిక విజ్ఞాన వ్యాప్తి | | | | |
| 24. వయోజన కేంద్రాలు | 3,554 | 1,234 | 417 | 5,205 |
| 25. విద్యావంతులైన వయోజనులు | 50,607 | 20,711 | 6,506 | 77,824 |
| 26. కమ్యూనిటీ కేంద్రాలు | 7,395 | 1,413 | 726 | 9,534 |
| 27. జాతీయవినోద కార్యక్రమాలు | 8,657 | 2,646 | 3,815 | 15,118 |
| 28. ప్రజాసంస్థల నిర్మాణం | 12,680 | 1,073 | 110 | 13,863 |

| | | | | |
|---|---|---|---|---|
| రహదార్లు : | | | | |
| 29. పక్కారోడ్లు నిర్మాణం (మైళ్లు) | 238 | 105 | 67 | 410 |
| 30. కచ్చారోడ్లు నిర్మాణం : (మైళ్లు) | 2,253 | 946 | 326 | 3,525 |
| లలితకళలు, చేతివృత్తులు : | | | | |
| 31. ఉత్పత్తి శిక్షణ కేంద్రాలు | 44 | 18 | 1 | 63 |
| సహకారం : | | | | |
| 32. క్రొత్త సహకార సంస్థలు | 10,936 | 710 | 110 | 11,756 |
| 33. సహకార సంస్థల్లో క్రొత్త సభ్యత్వం | 1,43,912 | 23,466 | 12,482 | 1,79,860 |
| ప్రభుత్వవ్యయం (ఎ) (వేలలో) | | | | |
| 34. కార్యకర్తల క్రింద | 4,579·10 | 984·89 | 443·57 | 6,007·56 |
| 35. ప్రయాణ సౌకర్యాలు, పరికర సామగ్రి వగైరా | 1,707·76 | 365·47 | 163·25 | 2.236·48 |
| 36. స్థానిక నిర్మాణాలు | 3,918·80 | 944·34 | 469·05 | 5,332·19 |
| 37. సాంఘిక విజ్ఞానం | 498·96 | 144·59 | 60·75 | 704·30 |

C-6

| | | | | |
|---|---|---|---|---|
| 38. గ్రాంట్లు | 308·50 | 161·67 | 29·17 | 499·34 |
| 39. మైనర్ యిరిగేషన్ ఋణాలు | 1,467·20 | 400·34 | 296·22 | 2,163·76 |
| 40. స్వల్పకాల పరపతి ఋణాలు | 5,260·05 | 748·94 | 530·14 | 6,539·13 |
| 41. మొత్తం ప్రభుత్వ వ్యయం | 18,048·14 | 4,560·82 (బి) | 1,992·15 | 24,601·11 |
| ప్రజాసహకారం : | | | | |
| 42. శ్రమశక్తి (వేలలో విలువ) 43. ధనం, యితరవిధాల సహాయం (వేలలో) | 20,625 | 5,023 | 1,506 | 27,154 |

*1954 డిశెంబరుతో అంతమయ్యే మూడు నెలలకు పంజాబులోని మాగా బ్లాకు కృషి ఫలితాలు లభించలేదు.

**జమ్ము కాశ్మీర్‌కు చెందిన 10 బ్లాకుల వివరాలు చేర్చబడలేదు.

(ఎ) అస్సాంకు చెందిన 12 బ్లాకులు, పంజాలోని మాగా బ్లాకు, మధ్యభారత్, రాజస్థాన్‌కు చెందిన 3 బ్లాకులు–వీటి విషయంలో 1954 సెప్టెంబరు 30 వ తేదీ వరకే ఖర్చు చూపబడింది. నెం 40 లో చూపిన ప్రభుత్వ వ్యయంలో మాత్రం డిశెంబరు 54 వరకు ఖర్చు యిమిడి ఉంది.

(బి) హైదరాబాదులో అడ్వాన్సు ఋణాలక్రింద యిచ్చిన 1.38 లక్షలు, సస్పెన్స్ అకవుంట్ క్రింద 38,698 రూపాయలు కలిసి చూపబడినవి.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | 193 |
| పుస్తకం పేరు | యువత ద్వితీయ సంవత్సర ప్రత్యేక [illegible] |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 147 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 74 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | munisha |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |